# స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగు కవిత

యన్. భక్తవత్సల రెడ్డి

నాగపట్ల పబ్లికేషన్స్
1986

(Telugu)

*Swatantryottara Kaal ana Telugu kavita*

By

**Dr. N. Bhakthavathsala Reddy**
Dept of Linguistics
University of Kerala
Karyavattom P. o. TRIVANDRUM, Kerala

First Published : November 1986

Printed at : M/s Srinivasa Printers
2-3-529/A, J. N, Polytechnic Road
Amberpet, Hyderabad--500 013.

**Price : 60-00**

**Deluxe edn ; 80**

Publishers : Naagapatla Publications

Copies can be had from :
Mrs. N. Sarada
C/o : The Author



Cover Design : PETASRI

# కృతజ్ఞతలు

ఆధునిక సాహిత్యంలో నా అభిరుచిని గమనించి, పరిశోధనాంశాన్ని ఎన్నికచేసి, సిద్ధాంతవ్యాస రచనలో అడుగడుగున తమ అమూల్యసూచనల్ని అందించి, ఆదరించిన స్నిగ్ధహృదయులు, గురువర్యులు, మదురై కామరాజ విశ్వవిద్యాలయ తెలుగుశాఖ ప్రారంభ అధ్యక్షులు, కీర్తిశేషులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు చేసిన మేలు ఎలా మరువగలను.

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తెలుగు శాఖలో 1957లో చేరి నప్పటినుంచి ఆప్యాయత కనబరుస్తూ, నాలోని లోటుపాటుల్ని మందలిస్తూ, ప్రవాసాంధ్రుడనయినా తనవాడుగానే గుర్తించి, ముందుదారి చూపిస్తున్న దయానిధి, గురువర్యులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు ఆచార్య జి. యన్. రెడ్డిగారి ఋణం ఎలా తీర్చుకోగలను.

నాలోని అలసతని గుర్తించి 'సిద్ధాంతవ్యాసం సమర్పిస్తే తప్ప పాతాల జోలికి రావద్దు' అని నిర్మొహమాటంగా చెప్పి, నాభావం అక్షరాకృతిని పొంద డానికి, కారకులైన కేరళ విశ్వవిద్యాలయ భాషాశాస్త్రశాఖ ప్రారంభ అధ్యక్షులు, తమిళ విశ్వవిద్యాలయ తొలి ఉపాధ్యక్షులు అయిన ఆచార్య వి. ఐ. సుబ్రమణ్యంగారి గొప్పమనసు ఎదనించి ఎలా చెరిగిపోగలదు.

చర్చలద్వారా తమ అమూల్య అభిప్రాయాల్ని తెలియ జేయడమే కాకుండా, కావల్సిన కవితా సంకలనాల్ని కూడా అందించిన దయామయుడు డా. దాశరథిగారి చేయూత దేనితో సరితూల్చగలను.

పరిశోధనాకాలం (1974-1977)లో ఉపకార వేతనాన్ని మంజూరు చేసిన మదురై కామరాజ విశ్వవిద్యాలయ అధికారులకి,

ఈ గ్రంథముద్రణకై ఆర్థిక సహాయంఅందజేసిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సాంస్కృతిక వ్యవహారాల శాఖకి,ముఖపత్రాన్ని అందంగా వేసిన 'పేటశ్రీ'కి

తెలుగుమాటకి దూరంగా తిరువనంతపురంలో నేను ముద్రించుకోలేని పరిస్థితుల్లో ఉన్నప్పుడు, నా వెన్నుతట్టి, అన్నిపనులు చక్కచేసి ముద్రణ భాగ్యం కల్గించిన డా. యన్. శివరామమూర్తిగార్కి, ప్రూఫులు దిద్ది సహక రించిన శ్రీ చీమకుర్తి శేషగిరిరావుగార్కి, శ్రీనివాసా ప్రింటర్స్ సిబ్బందికీ,

ఈ గ్రంథం ఈ రూపంలో రావడానికి సహాయపడిన ఇంకా ఎందరో సన్నిహితులు, అందరికీ నమస్సుమాంజలులు.

# భూమిక

స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగుకవిత ఇతరయుగాల్లో వెలసిన కవిత్వంలాగే విస్తారమయింది. ఇతరయుగాల కవిత కవిపేర్లతో మనముందు కనబడుతుంటే ఇరవయ్యో శతాబ్ది కవిత ఉద్యమాల చట్రాలలో తనరూపుని దిద్దుకొంటుంది.

ఈ గ్రంథానికి స్వాతంత్ర్యసిద్ధి ఒక అవధి. రాష్ట్రోద్యమం, తెలంగాణోద్యమం, విశాలాంధ్రోద్యమం లాంటి ఆంధ్రరాష్ట్రానికే సంబంధించిన ఉద్యమాలు ఉన్నా అవి అన్నీ స్వాతంత్ర్యసిద్ధితో ఏదో ఒకవిధంగా ముడి పెట్టుకొని ఉన్నవే. స్వాతంత్ర్యసిద్ధి రాజకీయరంగంలో ఒక పతాక సన్నివేశం.

తెలుగు సాహిత్యరంగంలో-ప్రత్యేకించి కవితారంగంలో—స్వాతంత్ర్య సిద్ధి ఒకమలుపు. దానికి ముందు వెనకల ఉన్న తెలుగుకవితని పరిశీలిస్తే రెండు విషయాలు స్ఫురిస్తాయి.

1. స్వాతంత్ర్యసిద్ధికి ముందు ఉన్న కవితలో విదేశీయ ప్రభావం ఎక్కువ.

2. స్వాతంత్ర్యోత్తర తెలుగు కవితలో దేశీయత పాలు ఎక్కువ.

ఇరవయ్యో శతాబ్ది తెలుగు సాహిత్యంలో భావకవిత్వం, అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం—అన్నవి నాల్గు ఉద్యమాలు. ఆంగ్ల రొమాంటిసిజం ప్రభావఫలితం భావకవిత్వం. రొమాంటిసిజం మీద దాడి చేయడం ధ్యేయంగా వచ్చిన సర్రియలిజం, క్యూబో ఫ్యూచరిజం, డాడా యిజం లాంటి కవితోద్యమాల ప్రభావం ఉన్న కవిత్వం అభ్యుదయ కవిత్వం లోని నవ్యకవిత. ఆర్థిక సిద్ధాంత ఊపిరి పోసుకొన్న కవిత అభ్యుదయ కవిత్వంలోని ప్రగతివాద కవిత. ఈ విషయాలు 'స్వాతంత్ర్య సిద్ధికి ముందు ఉన్న కవితలో విదేశీయ ప్రభావం ఎక్కువ' అన్న విషయాన్ని సమర్థిస్తున్నాయి.

స్వదేశీ సంస్థానాల ఇనుప కౌగిలినించి బయటపడాలనే తపన ఆవేశం తెలంగాణా పోరాటం ప్రతిబింబించే కవితలోని ఇతివృత్తం. ఉద్యమ దాడులు వెనక్కి తగ్గాక "మధ్యతరగతి మందహాసం", గుమస్తా 'నీరేశ్వరావు'ల కష్టాల దొంతరులు, సమరాలపై విహ్యం, శాంతిపై వ్యామోహం పెంచుకోవడం స్వాతంత్ర్యోత్తర అభ్యుదయ కవిత్వంలోని కావ్యవస్తువు. 'సుందర సమతా వ్యవస్థ కోసం', మానవతని పుణికి పుచ్చుకొన్న మనీషికోసం ఉవ్విళ్ళూరుతూ, తమ చుట్టూ 'కుళ్ళి కంపు కొట్టుతున్న కుష్ఠువ్యవస్థ'ని ఏవగించుకోవడం దిగంబర కవిత్వం. కూటికి గుడ్డకి కరువై, శ్రమనే నమ్ముకొని బతుకు ఈడ్చుకుంటున్న జీవుల శ్రమని దోపిడిచేసే వర్గశత్రువులని రూపుమాపడానికి సాయుధ పోరాటం వినా గత్యంతరం లేదన్న నమ్మకం విప్లవకవిత్వానికి ప్రాణం. ఈ విషయాలు 'స్వాతంత్ర్యోత్తర తెలుగుకవితలో దేశీయత పాలు ఎక్కువ' అన్న విషయాన్ని చెప్పక చెప్పుతున్నాయి.

ఇక ఛందస్సు విషయంలో కూడా స్వాతంత్ర్యసిద్ధి ఒక మలుపే. అంతకు ముందే వేరులు బలపడినా, అన్ని నడకల్నీ రాబట్టుకొని ఒక ప్రకృష్ట రచనావాహికగా రాచబాటకెక్కింది స్వాతంత్ర్యోత్తర కాలాననే.

ఇలా స్వాతంత్ర్యసిద్ధిని ఒక అవధిగా పెట్టుకొని మార్పుల కాలవాలమైన ఉద్యమాలలోని తెలుగుకవితని గుర్తించడం 'స్వాతంత్ర్యోత్తర కాలాన తెలుగుకవిత' ఉద్దేశ్యం.

ఈ గ్రంథంలో కవిత్వం, కవిత రెండూ ఒకే అర్థంలోనే వాడబడ్డాయి. అయినా ఒక ఉద్యమం అన్న అర్థంలో వాడబడినపుడు 'కవిత్వం', కానప్పుడు 'కవిత' కనబడతాయి.

# విషయ సూచిక

# 1

# భావ కవిత్వం

తెలుగు సాహిత్యంలో స్వాతంత్ర్యానికి పూర్వం రెండు కవితోద్య మాలు తాలోత్తాలంగా వెల్లి విరిశాయి. ఒకటి భావకవితోద్యమం. రెండు అభ్యుదయ కవితోద్యమం.

భావకవితోద్యమం సాహిత్య పరంగా ఆంగ్లరొమాంటిసిజం నించి ప్రేరణ పొందింది. అభ్యుదయ కవితోద్యమంలో కళ పరంగా కవితోద్య మాల (-isms) ప్రభావం, మార్క్సిజం ప్రభావం, తెలంగాణా పుద్యమ ప్రభావంతోబాటు సంఘం నించి ప్రేరణపొందడం కూడా వుంది.

స్వాతంత్ర్యం తర్వాత కూడా భావకవిత్వచ్ఛాయలు తెలుగు కవితలో కనబడుతున్నాయి. స్వాతంత్ర్యానికి పూర్వంలాగా ఒక పుద్యమ రూపంలో లేకపోయినా, దాని ప్రభావం కొంతమంది కవులపై వుంది.

భావకవిత్వం ఆంగ్ల సాహిత్య ప్రభావ ఫలితం. భావకవిత్వంలోని కవిత, కావ్యవస్తువు, కవిసమయాలు, కొత్తపదాల నిర్మాణం లాంటి వాటి విషయంలో ఆంగ్లరొమాంటిసిజం ప్రభావం ఎక్కువగా వున్నట్టు చూడగలం. వాటితో బాటు కావ్యంలో దొరికే ప్రమాణాల్ని బట్టి కావ్యవిలువలు నిర్ణయిం చాలనడం. ఒకే గమ్యానికి పలుదార్లువుండొచ్చు, ఏ దారిలో పయనించినా చేరేది గమ్యం మాత్రమే. అలాగే కావ్యంలో పలుసాధనాలు (means) వుండొచ్చు. కాని సాధ్యం (End) మాత్రం ఒకటే అన్న సిద్ధాంతం కూడా రొమాంటిసిజం ప్రభావ ఫలితమే.

పుట్టుక:- [1]'వర్డ్సువర్తు కాలరిడ్జిల'లిరికల్ బ్యాలడ్స్ (Lyrical Ballads (1798) లో ఆంగ్ల సాహిత్యంలో రొమాంటిసిజం తలెత్తింది. అంతకుముందు నించికూడా వుందనీ, షేక్స్పియర్ సంప్రదాయాన్ని త్రోసిరాజని రొమాంటి జాన్ని అనుసరించాడనీ అంటూంటారు కాని సరైన అవగాహనతో, అన్ని

హంగులూ కుదుర్చుకొని వచ్చింది మాత్రం 'లిరికల్ బ్యాలడ్స్'తో మాత్రమే. ఇద్దరూ కల్సి రచించినంత మాత్రాన ఇద్దరివీ ఒకే భావాలు అని అనుకోవడానికి వీలు పడడంలేదు [2]వర్డ్సువర్తు ఎక్కువగా ప్రకృతిగత వస్తువులకి ప్రాముఖ్యం ఇవ్వడంతో బాటు వాటికి సాహిత్యగౌరవం కల్గించాడు. కాలరిడ్జి వీటికన్నా [3]అద్భుతత్వాన్ని, మధ్యయుగ, జానపద కథల్ని కావ్యవస్తువులుగా మలచుకొన్నాడు. కీట్సు షెల్లీల్లో అద్భుతత్వం కన్నా వియోగానికి ప్రాధాన్యం కనబడుతూంది. [4]బైరను కాలం నాటికి బాహిర వేషభాషలు ఆ స్థానాన్ని పొందాయి. ఇవి స్థూలంగా రొమాంటిసిజంలో వచ్చిన మార్పులు.

ఆంగ్ల రొమాంటిసిజాన్ని ప్రభావితం చేసినవిగా ఫ్రెంచి, జర్మను సాహిత్యాల్ని కీర్తిస్తుంటారు, ఆంగ్లవిమర్శకులు. ఫ్రాన్సులో రూసో ప్రతిపాదించిన సాంఘిక రాజకీయ ప్రతిపాదనలు ఫ్రెంచి విప్లవానికి దారితీయడమే గాకుండ సాహిత్యంలో సరికొత్త పంథాకు దారిచూపాయి. సంప్రదాయం కనుక అనుసరించాలి అన్న గుడ్డివాదాన్ని త్రోసిపుచ్చి, మానవులహక్కుల్ని స్వాతంత్ర్యాన్ని అణగదొక్కి రాజుల సంపూర్ణాధికారాన్ని, ధనికుల అధిపత్యాన్ని, మతాల పిడివాదాన్ని, అధికారుల దుర్వినియోగాన్ని విమర్శిస్తు ప్రబోధించాడు రూసో. స్వాతంత్ర్యం సమానత్వం సౌభ్రాతృత్వం (Liberty, Equality and Fraternity) అన్న సూత్రం ఫ్రెంచి విప్లవానికి దారితీసింది. ఈ సూత్రం వ్యక్తిత్వానికి ఇచ్చిన పట్టువల్లా, హేతుబద్ధంగాని ప్రభుత్వాజ్ఞల్ని ధిక్కరించాలనే ఆతురతా, ఆవేశం వల్లా సాహిత్యపరంగా రొమాంటిసిజానికి దారితీసింది. జర్మనీలో ష్లెగెల్ (Schlegel) సోదరులు రొమాంటిక్ దృక్పథాన్ని (Romantic view of Art) ప్రచారం చేశారు. అందంగా స్వతసిద్ధంగానే అమరివున్న ప్రకృతిపై కృత్రిమంగా జరిపే అన్వేషణ క్లాసిసిజం అనీ, కొత్త జీవితాలు, అందచందాలు, వాస్తవికత వీటికోసం నిజమైన పోరాటం జరిపేది రొమాంటిసిజం అనీ వాళ్ళు ప్రబోధించారు. ఇది జర్మను దేశాన్ని, ఒక రకంగా యూరోపునంతా, ఆకట్టుకొంది. ఇలా ఫ్రెంచి రాజకీయ ప్రభావమూ, జర్మన్ రొమాంటిక్ దృక్పథ ప్రభావమూ కలసి ఆంగ్లసాహిత్యంలో రొమాంటిసిజానికి దారితీశాయి.

రొమాంటిసిజం లాగే భావకవిత్వం కూడా ఇతర భాషలనించి ప్రేరణ పొందింది. దేశంలో స్వాతంత్ర్యం కోసం పోరాటాలు జరుపుతూ అరెస్టులు,

బందీలు, జలియన్‌వాలాబాగ్‌లో అమానుషచర్యలు లాంటివి జరుగుతూ వున్నా ఆ సమయంలో తెలుగు కవులు 'ప్రియురాలి పదముల గుసగుసలకి చెవి యొగ్గి' పరవశులైవారే కాని, తమిళనాడులో సుబ్రహ్మణ్య భారతి లాంటి వాళ్ల రొమాంటిసిజాన్ని అనుసరిస్తూ వున్నా, ప్రభుత్వాన్ని ధిక్కరించి, జైలు పాలవడం కూడా తెలుగు కవుల్ని ప్రబోధించ లేకపోయింది. [5]"ప్రబంధ యుగం నాటి మాచల్దేవి వరూధినులు. తిరిగి ఊర్వశీ, శశికళ, పద్మావతీ ప్రేయసులు ప్రత్యక్ష మయ్యారు — ఒక వైపు మహోద్ధృతంగా స్వాతంత్ర్యోద్యమం జరుగుతూన్న రోజుల్లో తెలుగు సాహిత్యాన్ని Dominate చేసిన నీచమైన పరిణామం ఇది — ప్రజలకు తెలుగు సాహిత్యానికి ఏమాత్రం సంబంధం లేకుండా పోయింది."

కావ్యవస్తువు :- భావ కవిత్వంలో కావ్య వస్తువు అనుభూతి ప్రధాన మైంది. పాత సాహిత్యంలో లాగా కథాప్రాధాన్యం కల్గిన వస్తువు అంతగాలేదు. వెల్చేరు నారాయణరావు గారు [6]"భావకవిత్వంలో వస్తువుకి స్వతంత్ర అస్తిత్వం లేదు. అది కేవలం కవి వ్యక్తిగతంగా మనస్సులో ఊహించుకున్నది. ఆ వస్తువుకి పుట్టుక పౌరాణిక సమాజమూ కాదు, కవి నిర్మితమైన సాహిత్య ప్రపంచమూ కాదు. అది కేవలం వైయక్తికమైన కవిమనః ప్రపంచం." కనుక అనుభూతి ప్రధానం, భావనాశక్తిమూలంగా హృదయ సంబంధి అయింది అన్నారు. నారాయణరెడ్డి గారు భావకవిత్వాన్ని నిర్వచిస్తూ [7]"కవిత్వాని (కావ్యం) కి వస్తువు, భావము, రచన అనేవి మూడంగాలనీ, భావం ప్రధానంగా కలది భావకవిత్వం" అనీ అన్నారు.

కవిత్వానికి వస్తువు, భావము, రచన అనేవి మూడు భిన్న అంగాలు కావు. ఒకదానికొకటి విడదీయరాని అనుబంధం కలవి. ఆంగ్లం లోని **Content, Form** ల కిందికి ఈ మూడూ వస్తాయి. కథా ప్రాధాన్యం కలవి వస్తువు కింద, శైలీరమ్యత, సమాన చాలన వైపుణి. పద గుంఫన చాతుర్యం మొదలైనవి 'రచన' కింద వస్తాయని నారాయణరెడ్డి గారు అన్నారు. 'రచన' కింద వస్తాయన్న 'అవి' అన్నీ 'వస్తువు'కి సంబంధించినవి కావు. అవి కేవలం Form (రచన)కి సంబంధించేవి మాత్రమే. 'భావము హృదయములో కల్గిన వికృతి. అనగా అది హృదయ సంబంధి' అన్నారు

నారాయణరెడ్డి గారు. హృదయ సంబంధి అన్నపుడు అది అనుభూతి ప్రధానం అవుతూంది. ఈ విషయంలో వేరువేరుగా చెప్పినా అనుభూతి ప్రధానం అన్న విషయంలో నారాయణరావు గారూ, నారాయణరెడ్డి గారు ఒకే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. శ్రీ శ్రీ "భావ కవిత్వం ఒక కవిత్వం, ఒక అనుభవం; దీన్ని ఒకడు మరి ఒకడికి బోధ పర్చడానికి వీల్లేదు. పరిమళం ఇలా వుంటుందని ఏమి చెప్పగలం" అని అన్నారు.

రొమాంటిసిజం కూడా అనుభూతి ప్రధానం అయింది. 'Theory of imagination' (భావనా శక్తి) పై చాలినన్ని విమర్శలు చెలరేగాయి. వర్డ్సువర్త్.[9] "........... the poetry is tne spontaneous overflow of powerful feelings;, it takes its origin from emotion recol lected in tranquility" మంచి కవిత్వం అంటే ప్రకృతి పరంగా పుట్టిన వుదాత్త మైన భావ వెల్లువ, ప్రశాంతంగా వున్న మనః కార్మిక శాలలో మననం చేయబడి అక్షరాకృతి పొందడం — అని అన్నారు. వర్డ్సువర్త్ రచనల్లో Solitary Reaper, Daffodils ని ఈ నిర్వచనాన్నికి వుదాహరణంగా తీసుకోవచ్చు. కవి దారిలో పోతూ వాటిని చూసి తన్మయానంద చిత్తుడై మననం చేసుకొంటూ మనస్సుని ప్రశాంత వాతావరణం నించి. ఈ వూహల్తో నింపి తద్వారా కల్గిన అనుభూతిని బాహ్యజగత్తులోని వస్తువుతో తాదాత్మ్యం చెందింప జేసి, అక్షరాకృతి పొందినవి, అవి. అంటే బాహ్య జగత్తులోని వస్తువు మనః కార్మిక శాలలో మననం చేయబడి పునస్సృష్టింప బడటమే వర్డ్సువర్త్ చెప్పిన "emotion recollected in tranquility"గా తెలుస్తూంది. పై కవిత్వావిర్భావంలో మొదటిది ప్రకృతి (వస్తువు) సంబంధంగా కదిలే వుదాత్తమైన భావ వెల్లువ (the spontaneous overflow of powerful feelings) అనీ తర్వాతిది ప్రశాంతంగా వున్న మనః కార్మికశాలలో వాటి మననం (their recollection in tranquility) అనీ, చివరిది వాటి పునస్సృష్టి అంటే అక్షరాకృతి (their expression in poetry) అనీ అర్థం అవుతుంది.

ఇక్కడ theory of imagination అనేది కొంచెం ప్రస్తావించాల్సి వుంది. రొమాంటిసిజం కన్నా ముందు imagination, fancy అనేవి ఒకే అర్థంలో వాడబడుతూ వుండేవి. ఇపుడు వాటిమధ్య సరైన అడ్డురేఖ బలపడ్డది.

దాన్ని సృష్టించింది వర్డ్సు వర్తు. జలపర్చింది కాలరిడ్జి. బాహ్యజగత్తులోని వస్తువు కవి ఇచ్చే సంపన్నమైన భావనాపటిమ చేత సరికొత్తరూపుని సంత రించుకొని, ముందటి దాని కన్నా అన్ని విధాలా వుదాత్తంగా కనబడుతూంది. అంటే కవి బాహ్య జగత్తులోని వస్తువుకి తనదైన 'తనం' ని అర్పించి దానికి నగిషీలు చెక్కుతాడన్న మాట. ఇలా నగిషీలు చెక్కడం భావనాశక్తి(imagination) పని. ఇపుడు సామాన్యుడు బాహ్యజగత్తులోని వస్తువు తనకు పరిచయం అయిందే అయినా, కవిత్వంలో కొత్తదిగా అనుభూతిని పొందుతాడు. ఇది ప్రకృతి (వస్తువు) పై మనస్సు, మనస్సు పై ప్రకృతి జరిపే పోరాటం వల్ల వస్తూంది అని స్థూలంగా అనుకోవచ్చు. పై పరిశీలన వల్ల రొమాంటిసిజంలోని భావనా శక్తి (imagination) నారాయణ రెడ్డి, నారాయణ రావు గార్లు చెప్పిన 'అనుభూతి'కి సమమైందిగా గుర్తించొచ్చు. అలా అయినపుడు content (వస్తువు), form (రచన) రూపంలో, బయటికి వచ్చే ముందటి ఒక కార్యం మాత్రమే అనుభూతి. అది తనలోని 'తనం'ని బాహ్యజగత్తుకి జోడిస్తుంది కనుక వైయక్తికం అవుతూంది. కనుక 'భావం', వస్తువు, రచనలాగా విడి అంగం కాదు. అది కవిని ఆశ్రయించుకొని వుండేది మాత్రమే. వస్తువుకి కేవలం 'కథా ప్రాధాన్యం కల్గింది' అన్న అర్థమే గాకుండా ప్రకృతిలోని ప్రతిదీ అన్న విశాలార్థం వస్తూంది. అది పురాణాదుల్లో లాగా కథా ప్రాధాన్యం కల్గిందిగా వుండొచ్చు, ప్రబంధాదుల్లో లాగా కథ అల్పంగా వుండొచ్చు, భావ కవిత్వంలో-ఎక్కువభాగం-లాగా ఒక సంఘటనకో, అనుభూతికో, అవేశానికో పరిమితం అయివుండొచ్చు. నారాయణరెడ్డి గారన్నట్టు కథాప్రాధాన్యం కానిది భావకవిత్వం అయితే కష్టకమల, తృణకంకణం, పూర్ణమ్మ లాంటివి భావ కవిత్వం కిందికి చేరకపోవచ్చు. మొత్తంమీద భావకవిత్వంలో ప్రబంధాల్లో లాగా వూహల వుడ్డీనం గాకుండా భావచిత్రణ (imagery)లకి ఆదరం కల్గింది. బుద్ధికి గాక హృదయానికి పని తగిలింది. అందువల్ల అంతకు పూర్వం వుండిన అంగాంగ వర్ణన అంతస్సౌందర్యానికి మారింది.

## విమర్శ ప్రమాణం

కావ్య విలువల్ని విమర్శించేటపుడు ప్రాచీన ఆలంకారికుల లక్షణాల్ని దృష్టిలో పెట్టుకోవడం సంప్రదాయానుసారంగా తెలుగు సాహిత్యంలో జరి

గేదే అది భావకవిత్వంతో కొంత వెనక్కి నెట్టబడింది.[9] "భావకవిత్వంలో కవి అనుభూతి, ఉద్వేగం వ్యక్తమయినవా. అవి సిన్సియర్‌గా వున్నాయా- అనేది ప్రమాణం." అంటే కవిత్వంలో చొప్పించబడి వున్న విషయాలే ప్రమాణాలు గాని, ఇతరత్రా సంప్రదాయలాక్షణికుల కట్టుబాటులకి లొంగినవి కావు అని అర్థమవుతుంది. ఇలాంటి స్వేచ్ఛ - కావ్యవిమర్శలో - భావకవిత్వంతోనే ప్రారంభం అయింది. దీనికి కారణం కవులకు వున్న స్వేచ్ఛ. తెచ్చుకొన్న స్వేచ్ఛ.[10] "కవులు గుర్తింపబడని ప్రపంచ శాసనకర్తలు"గా కీర్తించబడడానికి కూడా ఇదే కారణం ఇలా అభ్యంతరప్రమాణాల చేత కావ్యాన్ని విమర్శించడానికి కారణం-[11] "ఆత్మగత ప్రపంచంలోని అనుభవం భావకవిత్వానికి కావ్యవస్తువు అవడం. దానికి తోడు కావ్యం ఆత్మానందం కోసమే అవడం" అని విమర్శకులు గుర్తించారు. వస్తువుపరంగా అనుభూతి, కావ్యప్రయోజనం విషయంలో ఆనందం అదీ సద్యః పరనిర్వృతి( immediate pleasure) కావడం భావకవిత్వ లక్షణాలుగా పేర్కోవచ్చు. కనుక భావ కవిత్వంలో కవిత్వ దృష్టి ఆనందాన్ని అదీ సద్యః పర నిర్వృతిని కల్గించడం మాత్రమే. దాన్ని కల్గించడం కోసం కవి ఏ మార్గానైనా అనుసరించొచ్చు. అది అంత ప్రధానంకాదు - అని అర్థం అవుతుంది. ఈ దృష్టితో చూసినపుడు కావ్యంకన్నా కవికే ప్రాధాన్యం వచ్చింది అని తెలుస్తూంది.

రొమాంటిసిజంలో కూడా కావ్యంకన్నా కవికే ప్రాధాన్యం కనబడుతూంది వర్డ్సువర్తు, కాలరిడ్జ్ లాంటి మొదటి తరం కవులకీ, షెల్లీ, కీట్సు, బైరను లాంటి రెండోతరం కవులకీ రాజకీయప్రాతిపదికంగా చూస్తే ఎంతో వ్యత్యాసం కనబడుతూంది. కాని వాళ్ళందర్నీ ఒక కవితా సూత్రం బిగించింది. అదే రొమాంటిసిజం. ఇక్కడ ప్రతి కవికీ తనదైన గొంతు, దారి వుంటాయి. అందరూ రొమాంటిక్ కవులే అయినా ప్రతి ఒక్కరిదీ ఒక్కోదారి. పదుగురు మెచ్చిన దారి అయింది. అందుకే[12] వర్డ్సువర్తు ప్రకృతి గత కవిత్వానికి [13]కాలరిడ్జి మధ్యయుగ వైభవ స్మరణకీ, [14]షెల్లీ ప్రేమతత్వానికీ, [15]కీట్సు సౌందర్యతత్వానికీ [16]బైరను సంఘంపై అపహేళనకీ దారులు ఏర్పర్చారు. ఇలా భిన్న భిన్న దారుల్ని ఏర్పర్చుకొన్నా వాళ్ళధ్యేయం మాత్రం సద్యః పరనిర్వృతి - (immediate pleasure). ఆ విషయాన్ని

ప్రస్తావిస్తూ కాలరిడ్జి [17].... Poetry is the art of communicating something both to express and produce excitement, but for the purpose of immediate pleasure" అని అంటారు.

రొమాంటిక్ కవులు ఏర్పర్చుకొన్న ఆ భిన్నదారులు భావకవిత్వంలో కూడా కనబడుతున్నాయి.

## ఛందస్సు

భావకవులు ఛందస్సులో కొత్తదారులు తొక్కారు. సంస్కృత వృత్తాల వాడకం చాలా తగ్గిపోయింది. జాతులు ఉపజాతులు మొదలైనవి వాడుకొన్నా, మార్పు స్పష్టంగా కనబడుతూంది. భావం ఎంత వరకు వస్తే అంత వరకి పాదాన్ని ముగించడం, అనవసరంగా అనవుడు, నావుడు లాంటి పడికట్టు పదాల్ని వాడకపోవడం, గేయాన్ని వాడడం భావకవిత్వంలో కనబడుతూంది.

[18]"భావకవులు ఆశు వాఙ్మయంలోని ఛందోరీతులు తీసుకున్నావారు రాసింది భావ కవిత్వమే. సామాన్య ప్రజల భాషనీ, జీవిత సన్నివేశాలనీ తీసుకున్నా, అది కాల్పనిక దృక్పథం తోటే" అన్న అభిప్రాయం విమర్శకుల్లో వుంది. ఏ దృక్పథంతో తీసుకొన్నా సంస్కృత వృత్తాల నించి ఛందస్సు ముత్యాల సరాలకు మారింది. 'స్వేచ్ఛ' కవితా విషయంలోనే గాక ఛందస్సులో కూడా వ్యక్తం అయింది.

Hartley అన్న మనశ్శాస్త్రవేత్త తన శాస్త్రంలో దేన్నయితే ప్రతిపాదించాడో సరిగ్గా అలాంటి మార్పుల్నే వర్డ్సువర్తుకూడా తన కవిత్వంలో వివరించాడు. Hartley సాధ్యం సాదించేందుకు వుపయోగించిన సాధనాలు రెండు దృక్పథాలు కల్గినవి. ఒకటి ఛందస్సు-దీన్నే వర్డ్సువర్తు 'పదాల అమరిక' (arrangement of words) అన్నారు. రెండోది 'నిశితానుభావం' (vivid sensation) వల్ల మానవుల నిత్య వాడుక భాషని వుపయోగించడం. ఈ రెండు విధానాలు కలసిమెలసి పనిచేసి కొంత అనిశ్చిత ఆనందాన్ని కలగజేస్తాయి. ఇలాంటి సాధనాలనే వర్డ్సువర్తు కూడా కవిత్వంలో చొప్పించారు. పి. యస్. శాస్త్రి గారు [19]"........... The poems are experiments, consciously controlled by a definite end. The end is to impart a certain quality of pleasure" అన్నారు.

పై పరిశీలన వల్ల రొమాంటిసిజం ధ్యేయం ఆనందంపొందడం అనీ, దాన్ని సాధించడానికి, అనుభూతికి సిత్యవాడుక భాషని జోడించడం, వాటికి అనువైన ఛందస్సుని వాడడం అనీ అర్థం అవుతూంది. సరిగ్గా ఇలాంటి వాతావరణమే భావకవిత్వంలో కూడా కనబడుతుంది గురజాడ అప్పారావు గారు ఛందస్సు దృష్ట్యా 'ముత్యాల సరాలు' ని పరిచయం చేశారు. భాష రీత్యా శిష్ట వ్యావహారికాన్ని ప్రవేశపెట్టారు. రొమాంటిసిజంలో ఛందస్సును మార్చి మార్చి ప్రయోగించిన వాడు బైరను. అతనికి[20] "పాత ఛందో మార్గాలని మార్చి మెరుగు పెట్టుట ఇష్టం లేదు సాహసంతోనూ తన ఛందో రీతులను అన్వేషించాడు" అన్వేషించి "డాన్‌జువాన్"లో, 'అట్టావారైమా' ఛందస్సుని వాడాడు. కొంతమంది పాత ఛందస్సులనే మార్చి మార్చి నగిషీలు చెక్కారు. రొమాంటిసిజం లోని పై రెండు విధానాలు-కొత్త ఛందస్సుని కూర్చడం, పాత ఛందస్సుకి నగిషీలు చెక్కడం-భావకవిత్వంలో కనబడుతున్నాయి. ఇక వస్తువత్తు ప్రతిపాదించదల్చుకొన్న సామాన్యుని వేష భాషలకి అనుకరణలు 'యెంకి పాటలు'ల్లో బసవరాజు కొన్ని గేయాల్లో కన బడుతుంది. ముత్యాలసరంతో బాటు మరికొన్ని గేయాలు కూడా ఖండగతి, త్ర్యశ్రగతి, మిశ్రగతి, శరషట్పది, కుసుమషట్పది- -లాంటివి-భావ కవి త్వంలో కనబడుతున్నాయి.

## కవి సమయాలు-కావ్య పదజాలం:

ప్రాచీన సాహిత్యంలో వున్న కవి సమయాలు, కావ్యపదజాలాలు కనుమరుగయ్యాయి. పూలకు, భ్రమరాలకు వున్న ప్రేయసీ ప్రియుల సంబం ధం మాతా శిశు సంబంధంగా మారడంలాంటి కొన్ని కొత్త కవిసమయాలు భావ కవిత్వంలో చోటు చేసుకొన్నాయి. [21]"అనుభూతిని మాటల్లో చెప్ప వలసి వచ్చేసరికి భావకవి వైయక్తికమైన సంకేతాలూ, అనిదంపూర్వ పద బంధాలు వాడడం మొదలు పెట్టాడు ...... ఇలాంటి మాటలు ఇంతకు పూర్వం వాడిన వారెవరూ లేక పోవడం మాత్రమే కొత్తకాదు. ఈ మాటలు అంతవరకూ అంగీకరింపబడుతూ వస్తున్న నియమాలకు విరుద్ధం. ఇందులో కొన్ని తెలుగు కవిత్వంలో ఏర్పడివున్న కవిసమయాలకు విరుద్ధమయినవి. మరి కొన్ని తెలుగు వ్యాకరణానికి విరుద్ధమయినవి" అని భావకవిత్వంలో

వచ్చిన కొత్త పదాలు, కవిసమయాల్ని గూర్చి నారాయణరావు గారు అంటున్నారు.

నారాయణరెడ్డిగారు [22] "అష్టాదశ వర్ణనల నిర్బంధమునకు తిలోదకము లర్పించిరి. ప్రాచీన కావ్యముల నుండి యెరువు తెచ్చుకొన్న కవి సమయములను కాసింత సేపు ప్రక్కకు నెట్టిరి. అవసరమని తోచినపుడు ఔచిత్య భంగము లేనపుడు సరికొత్త కవిసమయములను ప్రయోగించుకొనిరి" అంటూ ప్రాచీన కవిసమయాల ధిక్కరణ భావకవిత్వంలోని భాగంగా పేర్కొన్నారు.

> [22]'మేలు కొలుపులు కోడికూసెను
> విరులు కన్నులు విచ్చి చూసెను
> ఉండి, ఉడిగియు, ఆకులాడగ
> కొనరెనో యన గాలి వీచెను.

పాత కవిసమయాల ఉల్లంఘన కనబడుతూవుంది. 'తిమిరలత, నవ్వువెన్నెల, విరికన్నెవలపు, ఇరుల గుసగుసలు, పూల బాల, మేఘ బాల, పూలపాలు, బాలమామిళ్లు, బాల గులాబీలు — లాంటి కొత్త పదాలు భావ కవిత్వంలో చోటు చేసుకొన్నాయి.

రొమాంటిసిజంలో కూడా ఇలాంటి వుల్లంఘన కనబడుతుంది. ఇది Poetic Diction గా రూపు దిద్దుకొంది. వర్డ్సువర్తు [23]" ... .... seems to believe too that even honest expressions can become bad poerry just by being repeated" అని అన్నా కేవలం దాన్ని అనుసరించినంత మాత్రాన అది చెడ్డ కవిత్వం కాదు. కాకపోతే అది కాలానికి తగ్గట్టుగా వుండాలి. ఆ విషయాన్ని గురించి చెప్తూ[23] " Coleridge argued that if a given image or figure (for instance the 'image' of Phoebus as the sun) is used badly by a given poet (for instance, Gray in a sonnet criticized by Wordsworth), the reason for the badness is not that the figure is a repetition of what other poets have done but that it is in some way a violation of '**grammar**, logic, psychology', 'good-sense' or 'taste'-the 'rules of the imagination"- కేవలం పాతబడ్డ వుపమానాల్ని పల్లించినంత

మాత్రాన అది నిరాదరణీయం కాదు; వ్యాకరణం, తర్కం, మనశ్శాస్త్రాలకి సంబంధించి జరిగిన సరికొత్త ప్రయోగాలు - కొన్ని సంవదించేవి, మరికొన్ని భేదించేవి-, అనుభూతి, అభిరుచి, భావనాశక్తి మీద ఆధారపడి జరిగేమార్పులు మాత్రమే అని అంటారు.

కొత్తకావ్య పదజాలం రొమాంటిసిజంతో బయలుదేరింది. అది ఒక రకంగా వర్డ్స్‌వర్త్ కాలరిడ్జ్‌ల మధ్యనే ఎక్కువగా జరిగింది. [24]"......... the debate between Wordsworth and Coleridge was a significant event in English Literary history. It is part of the first romantic revolt against poetic diction in English" అన్న మాటలు వాళ్ళ వివాదాలు పాత Poetic Diction పై రొమాంటిసిజం ధ్వజం ఎత్తడాన్ని చూపిస్తున్నాయి.

పి. యస్. శాస్త్రి దీన్ని గుర్తించి చెప్తూ [25]"..... By Poetic Diction Wordsworth meant a fixed vocabulary which excludes what it deemed to be low or trivial. He rejects the specific features like personification, periphrasis, latinisms, frequent antitheses and the like" అన్న వాక్యాల్ని రాశారు.

రొమాంటిసిజంలో కావ్యపదజాలం మారడం పై పరిశీలనంవల్ల అర్థం అవుతూంది. అయితే ఇది మరి కొంత కాలానికి మరో Poetic Dictionగా రూపు దిద్దుకొంది.

Horace Epistle లో చెప్పిన[26]"A good poet will dig up long forgotton treasures of vocabulary and put them into circulation again- brilliantly old fashioned terms which lie hidden in the junk piles of neglect"ని అక్షరాలా అనుసరించి రూపం కల్పించిన వాడే అచ్చమైన కవి కాగలడు.

## ప్రకృతి వాతావరణం

భావకవిత్వంలోని ముఖ్య అంగాల్లో ప్రకృతిగత వాతావరణాన్ని ప్రతిబింబించడం ఒకటి. [27]"ప్రకృతి యనగ ప్రాచీన కావ్యముల ద్వారా దిగుమతి యైన 'లవలీలుంగ లవంగ' ప్రభృతి లతలు, చందన తమాల పనస ఖర్జూరాది వృక్షములేయను భావము ప్రబలిన రోజుల్లో చిరునిమ్మ చెట్లతో,

తాంబూల లతలతో, మధ్యాహ్న మల్లికలతో,కాశీరత్నములతో, కందిచొప్పలతో, అనాస మొక్కలతో, తులసి తోటలతో, తాటియాకు దడులతో .... తెలుగు నాటి పల్లీ పరిసరములను, ప్రకృతి చిత్రములను కావ్య ప్రాంగణమున ప్రవేశ పెట్టినారు"—అన్న వాక్యాల్ని చూసినపుడు భావకవిత్వంలో ప్రకృతికీ, ప్రకృతిగత వస్తువుకీ, భావానికీ ఎంత ప్రాముఖ్యం వుందో అర్థం కాగలదు.

[28] పృథివినే నవ్యులు సమాశ్రయింత్రు భక్తి

తల్లిగా ధాత్రిగా దేవతామతల్లి (గా)"

అని 'రమ్యాలోకము'లో రాయప్రోలు గారన్నారు. ఈ విషయాన్ని క్రోడీకరిస్తే భావకవిత్వంలో ప్రకృతి పాత్ర ఎంతటి 'బరువు' కల్గిందో అవగతం కాగలదు.

ఇలాంటి ప్రకృతిగత వాతావరణం రొమాంటిసిజంలో కూడా కనబడుతూంది. వర్డ్సువర్తు లిరికల్ బ్యాలడ్స్ వుపోద్ఘాతంలో, తమ కవిత్వాన్ని సమర్థించడంకోసం చాలా విషయాల్ని స్పృశించారు. [29] "The Principal object then, which I proposed to myself in these poems was to choose incidents and situations from common life and to relate or describe them throughout, as far as possible, in a selection of language really used by men, and, at the same time to throw over them a certain colourising imagination"- గ్రామీణ జీవితం నించి కావాల్సిన సంఘటనల్నీ, పరిస్థితుల్నీ తీసుకొనేందుకూ, గ్రామీణుల్ని వీలయినంతవరకు కవిత్వంలో ప్రవేశపెట్టుతూ, వాళ్ళ వాడుకభాషని వుపయోగిస్తూ, అదే సమయంలో భావనా శక్తి (imagination) చేత కొన్ని మెరుగుల్ని దిద్దుతూ, వాళ్ళని, వాళ్ళ వేషభాషల్ని కవిత్వంలో చొప్పించడం వర్డ్సువర్తు ధ్యేయమైనట్టు దీన్నిబట్టి తెలుస్తూంది వాళ్ళ వాడుక భాషనీ, వాళ్ళనీ వుపయోగించడంలోని ఆంతర్యం గ్రామీణులు ప్రకృతి సిద్ధంగానూ నిరాడంబరంగానూ వుంటారు కాబట్టి వాళ్ళ అలవాట్లు కూడా సహజంగానే అభివృద్ధి చెందుతూ వుంటాయి కనుక[30]. " Consequently when they communicate their feelings, their language is powerfully charged with vigour, life and sincerity" - వాళ్ళు అలా నిరాడంబరంగా వుండడంవల్ల, వాళ్ళ భావాల్ని తెలియ పర్చాల్సి వచ్చినపుడు, వాళ్ళ

భాష జవమూ జీవమూ కలివుంటుందనీ మనం అర్థం చేసుకోగలం. పిండి తార్థం - రొమాంటిసిజంలో గ్రామీణులు అన్ని విధాల ప్రకృతి సిద్ధంగా వుంటారు కనుక, వాళ్ళకీ, వాళ్ళ అలవాట్లకి తద్వారా ప్రకృతికీ రొమాంటిసిజంలో భాగస్వామ్యం కల్గిందని. అయితే ఇలా పరిచయం చేయాలనుకొన్న పాత్రలు గానీ, భాషగానీ వాళ్ళ కవిత్వంలో గ్రామీణులకి వాడుక అయింది మాత్రం కాకపోయింది [31] "The truth is that romantic nature poems are all poems of a certain symbolic furniture and of a certain philosophy" -- రొమాంటిక్ ప్రకృతిగత కవిత్వం అంతా నిదాన రూపంలో తీసుకొన్నదీ, మరి కొంత ఆధ్యాత్మికతని పుణికి పుచ్చుకొన్నదీ— అని విమర్శకులు గుర్తించారు. ఇది నారాయణరావు గారన్న [32]"యెంకి పాటల భాష ప్రజలభాష కాదు. అది ప్రజల భాషకి కాల్పనిక ప్రతిరూపం మాత్రమే" అన్న భావానికి మూలం.

ఇలా భావకవిత్వం రొమాంటిసిజంలోని అనుభూతి ప్రధానంగా కావ్య వస్తువుని తీసుకోవడం, ఛందస్సులో మార్పులు ప్రవేశపెట్టడం, కొత్త కావ్య పదజాలాన్ని నిర్మించడం, ప్రకృతి గత వాతావరణాన్ని, గ్రామీణుల్ని కవితలో పరిచయం చేయడం లాంటి లక్షణాల్ని అనుసరించింది.

-: o :-

# 2

# అభ్యుదయ కవిత్వం

భావకవిత్వోద్యమం తర్వాత స్వాతంత్ర్యానికి పూర్వం వున్న మరో వుద్యమం అభ్యుదయ కవిత్వోద్యమం.

[1]అభ్యుదయ కవిత్వం అన్న పేరు 1943 లో అభ్యుదయ రచయితల సంఘం ఏర్పడ్డప్పటి నించి వాడుకలోకి వచ్చింది - అంతకు ముందు శ్రీశ్రీ, శిష్ట్లా, నారాయణ బాబు, పఠాభిలు అభ్యుదయ కవిత్వం రాసినా, వాళ్ళ కవిత్వానికి 'నవ్య కవిత్వ' మన్న పేరు మాత్రమే వుండేది.

[2]ఆంధ్రరాష్ట్రంలోని అభ్యుదయ రచయితల సంఘం (అరసం) అఖిల భారతాభ్యుదయ రచయితల సంఘం (అభా అరసం)కి ఒక యూనిట్/శాఖ. అభా అరసం ప్రారంభించే నాటికి - 1936 లో - అది కమ్యూనిస్టుల కూటమి కాదు. [3]జవహర్‌లాల్ వంటి కాంగ్రెస్ నాయకులు కూడా దానికి తమ మద్దతుని వ్యక్తంచేయడమే కాకుండా, ఇతోధికంగా తోడ్పడ్డారు. అది ఆంధ్రరాష్ట్రంలో 1943 లో ఒక శాఖని ఏర్పర్చుకొంది. అభా అరసంలో మార్క్సిస్టు దృక్పథం గలవారే ఎక్కువగా వున్నందువల్ల దాని యూనిట్‌లో కూడా ఆ ప్రభావం పడటం అస్వాభావికం కాదు. అరసంలోని సభ్యులంతా కమ్యూనిస్ట్ పార్టీ సభ్యులే అని అనుకోవాల్సిన అవసరం కన్పడదు. కొత్త కావాలని, మార్పు రావాలని-సంఘంలో, సాహిత్యంలో-ఆశించేవారు. అలాంటి భావాలు కల అనేకులకి అరసం కొండంత ఆశని కల్పించింది. తమ భావాలకి రూపాన్నిచ్చింది.

భావకవిత్వం కేవలం, అనుభూతి ప్రధానం, ఆభ్యంతర సాధనాల ద్వారా విమర్శించడం, కొత్త కావ్యపదజాలం లాంటి గుణాల్ని మాత్రమే రొమాంటిసిజం నించి అనుసరించింది. అందుకే అది ఆనాటి భారతదేశంలో

ఆట్టుడుకుతున్న పరిస్థితుల్ని అంచనా వేయలేక పోయింది. అభ్యుదయ కవిత్వం భావకవిత్వంలాగా కేవలం [3]"సాహిత్య సంబంధమైన కృషితో తృప్తిపడక, యెప్పటికప్పుడు ఉవ్వెత్తుగా నెగయుచున్న జాతీయాంతర్జాతీయ [illegible]కో, ప్రతికూలముగనో పరిస్పందించిన సాహిత్యోద్యమం." ఇది ఆధునిక తెలుగు సాహిత్యంలో కేవలం సాహిత్యాన్నేగాక, రాజకీయాన్ని కూడ దరిచేర్చుకొన్న మొదటి వుద్యమం. వల్చేరు నారాయణ రావు గారన్నట్టు [4]"అనుభూతి నించి చైతన్యానికి" మారింది సాహిత్యం. ఈ మార్పు కేవలం తెలుగు వాతావరణంవల్ల ఏర్పడ్డది కాదు. సాంఘిక ఆర్థిక కారణాల ప్రాతిపదిక మీద, నిరంతర గవేషణ వల్లా, నిశిత పరిశీలనవల్లా, సాధించిన ఒకానొక సిద్ధాంతం దీనికి పునాది. అదే మార్క్సిజం. స్థూలంగా చెప్తే కార్ల్‌మార్క్స్, ఏంగెల్స్ కలిసి సంఘాన్ని పరిశీలించి, దానిలోని లోటు పాటుల్ని, వాటికి కారణాల్ని ప్రోదిచేస్తూ రాసిన "దాస్ కేపిటల్ (Das Capital) పునాది. ఇది కేవలం పుస్తకానికే పరిమితం అయిన అచేతనం కాదు. అందులోని అంశాలు సజీవాలు. ప్రతినిత్యం కళ్ళారా చూసేవి. అనుభవించేవి. సామాజిక చైతన్యాన్ని ప్రస్ఫుటించేవి. అలాంటి నగ్న సత్యాలు కనుకనే కేవలం పుస్తకంలోనే తలదాచుకోక అనుసరణకి అనువైనాయి. అలా మార్క్సిజాన్ని అనుసరించడం ప్రపంచం అంతా జరిగింది. ప్రపంచ యుద్ధాలు దేశదేశాల ప్రజల్ని అయోమయ స్థితిలో పడవేశాయి. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత ప్రపంచం అంతా ఆర్థిక మాంద్యం (Economic Crisis)లో పడ్డది. అయితే మార్క్సిజాన్ని పూర్తిగా ఆకళింపు చేసుకొని అనుసరించి, జారు చక్రవర్తుల నిర్బంధించి, పరిపాలనాన్ని చేజిక్కించుకొన్న రష్యా మాత్రం దీనికి అతీతం అయింది. ఆర్థిక మాంద్యం నించి తప్పించుకొంది. ప్రపంచ మానవాళికి ఆదర్శప్రాయమైంది. అదే, ఆలాంటి ప్రభావమే ప్రపంచాన్ని కదిలించివేసింది. శ్రీ దిగవల్లి వేంకట శివరావుగారు రష్యా గురించి ప్రస్తావిస్తూ [5]"దాస వృత్తియందు పడి, ధనికుల లాభము కొరకు కష్టించు రోజులు పోయి, సోవియట్ రష్యా దేశపు రైతులు సార్వజనిక ప్రభుత్వాధికారులైనారు. ప్రభుత్వోద్యోగుల నెన్నుకొనుటలో రైతులకి పలుకుబడి యుండుటయే గాక, వోటు కూడా కలదు.... . 1917 వ సంవత్సరపు విప్లవమువల్ల అంతకు పూర్వము ధనికుల వశమున నుండిన 15 కోట్ల ఎకరముల భూమి

రైతులకొరకు సాగు చేయబడుచున్నది. దేశములో సంఘస్వామ్య పద్ధతి స్థాపింపబడి, వివిధ కుటుంబములు కలిసిచేయు సమిష్టికృషి, ట్రాక్టరు యంత్ర కృషి స్థాపించబడినవి........ జాతితోగాని, తెగతోగాని నిమిత్తం లేకుండా, దేశంలోని పౌరులెల్లరు ఆర్థిక సాంఘిక వైజ్ఞానిక రాజకీయ జీవము నందు పాల్గొనుట కర్హత కలిగింపబడినది. ఈ హక్కులకు భంగము కలిగించుటయు, జాతిని తెగలను పురస్కరించుకొని ఎట్టి విచక్షణగాని చూపబడుటయు, దండనార్హమగు నేరముగా చేయబడినది" అన్నారు.

అలా రష్యా ప్రపంచ మానవాళికి ఆశాజ్యోతిగా కనబడుతున్నప్పుడు, ఇండియా అటు బ్రిటిష్ సామ్రాజ్య వైఖరిలో, ఇటు స్వదేశీ సంస్థానాల ద్వంద్వ పరిపాలనలో మగ్గుతూ వుంది. ఆ పరిస్థితుల్లో వెట్టిచాకిరీ నించి విముక్తిని పొంది, సార్వజనిక ప్రభుత్వాన్ని నిర్మించుకోవడం వీలుకాని పరిస్థితి ఆనాటి బ్రిటిష్ ఇండియాది. 'విభజించి పాలించు' అన్న ఆంగ్ల రాజనీతిని అక్షరాలా పాటించి రావుబహద్దరులు పేదోళ్ళ కడుపుని గొట్టుతూ, నోళ్ళని కట్టేస్తూన్న ఆ కాలంలో సమిష్టి వ్యవసాయం పేరైనా వినివుండని పరిస్థితి భారతదేశానిది. మతంకోసం ఒకరి నొకరు తన్నుకొంటూ నెత్తురుకాల్వలై పారిన అమానుష కృత్యాల్ని మనమైతే చూళ్ళేదు గాని, ప్రేమచంద్ 'నోరా' నవల్లో కనులారా కాంచగలం. ఆ సమయంలో మతాతీత (Secular) ప్రభుత్వాన్ని నిర్మించడం అంటే అర్థంకాని అయోమయంలో పడిపోయే పరిస్థితి నాటి ఇండియాది. ఇలాంటి పరిస్థితుల్లో రష్యా వాటిని ఆకళింపు చేసుకొంది. అనుసరించింది. దిగ్విజయంగా నెరవేర్చుకొంది. నాటి దిగ్విజయాలు ప్రపంచ ప్రజల్ని నోరూరించుకొనేట్టు చేసింది అనుకోవడం అతిశయోక్తి మాత్రంకాదు. మేధావుల్ని నిలబెట్టి మార్గాన్ని వెతకమంది. కవుల మనస్సుల్ని మళ్ళించింది.

7 "కూలివాని కిచ్చు కూలిడబ్బుల విలువకన్న ఎక్కువ విలువగల పనిని వానిచేత చేయించుట కొరకే యజమాని వానికి కూలి నిచ్చుచున్నాడు. కూలివాడు పుచ్చుకొను కూలియొక్క విలువకును, వాడుత్పత్తిచేయు అర్థము యొక్క విలువకును గల తారతమ్యపు విలువకే అర్థశాస్త్రజ్ఞులు 'మిగులు విలువ' లేక 'అదనపు విలువ' అని పేరు పెట్టియున్నారు. కాయకష్టము

చేయు...... వారిచేత పనిచేయించుటకు పురిగొల్పునది ఈ 'అదనపు విలువ' యే. ఉత్పత్తి సాధనములు కొద్దిమంది హస్తగతములై, లాభమునకే ఉపయోగింప బడునంత కాలం దేశములో దారిద్ర్యముండక తప్పదు" అన్న మూలసూత్రాన్ని ప్రోదిచేసిన మార్క్సిజం, దాన్ననుసరించిన రష్యా దేశము భారతదేశాన్ని కూడా ఆకర్షించాయి.

ఆ సమయంలో స్వాతంత్ర్య పోరాటం, బ్రిటిష్ పాలకుల అవినీతి, దుంతగాలు, రాష్ట్ర విభజన లాంటి వాటితోబాటు అక్కడక్కడా ఆనకట్ట నిర్మాణం, కొన్ని శాసనాలవల్ల జరిగిన మేళ్ళు ప్రజల్లో కొత్త జీవనానికి దారి తీశాయి. వాటితోబాటు వ్యక్తికి స్వాతంత్ర్యం కూడా ముందటికన్నా ఎక్కువగా దక్కింది. వీటి అన్నిటి స్వరూప స్వభావాలవల్ల ఏర్పడ్డ కొత్త సమాజాన్ని చిత్రీకరించేందుకు కొత్తభాష, కొత్తశైలి, కొత్త భావచిత్రణలు అవసరం అయ్యాయి. అందుకనే భావకవిత్వోద్యోమం స్వైర విహారంచేస్తూ కవుల్ని సమాజం నించి విడదీసి, అనుభూతుల్లోనే స్వర్గ నరకాల్ని చూపిస్తూ, శృంగార వియోగాల్ని కలిగిస్తూ "'దిగిరాను దిగిరాను దివినుండి భువికి' అనేటట్టు చేస్తూ ఎగిరే పక్షుల్తో స్నేహం చేయిస్తూవుంటే' ఆ కవుల్ని భూయానం పట్టించాల్సి వచ్చింది. అందుకని అరసం ఆరంభింప బడ్డది.

అరసం వేదిక నించి వచ్చిన కవిత్వం అభ్యుదయ కవిత్వంగా పిలవ బడ్డది. ఈ కవిత్వాన్ని సౌలభ్యం కోసం కొన్ని కొన్ని విభాగాలుగా విభజించి పరిశీలిద్దాం. అరసం ఏర్పడ్డానికి ముందుగా నవ్యకవిత్వంగా పేరుబడ్డ శ్రీశ్రీ, శిష్ట్లా ...... మొదలైన వాళ్ళ కవిత్వం, మార్క్సిజం ప్రభావం చేత, కేవలం మార్క్సిస్టు సిద్ధాంతాలకి లక్ష్య ప్రాయాలన దగ్గ కవిత్వం, తెలంగాణోద్యమం చేత చైతన్యం పొందిన కవిత్వం, ఉద్యమతాకిడులు తగ్గిన తర్వాత వచ్చిన అభ్యుదయ కవిత్వం, దిగంబర కవుల ధాటితో అరసం పునరుద్ధరింప బడ్డాక వచ్చిన కవిత్వం - అని.

## నవ్య కవిత్వం

నవ్య కవిత్వానికి మూల స్తంభాలన దగ్గ వాళ్ళు శ్రీశ్రీ, శ్రీరంగం నారాయణ బాబు, శిష్ట్లా ఉమామహేశ్వర రావు, పఠాభిలు. వీళ్ళు అప్పటికి

తిరుగుబాటు కవులు. వీళ్ళ తిరుగుబాటు ముందటి వుద్యమం అయిన భావ కవిత్వం మీద. వీళ్ళమీద సాహిత్యంపై విసిగిన యువకులు లేపిన దాదాయిజం, క్యూబిజం, సింబాలిజం, సర్రియలిజం, ఫ్యూచరిజం వంటి కవితా ద్యమాల isms) ప్రభావంతో బాటు మార్క్సిజం ప్రభావం కూడా వుంది. [9] "ఈ కాలంలో వాత్స్యాయనుడూ మనువు కారు మా ఋషులు, మార్క్స్, ఫ్రాయిడ్...... యథార్థాన్ని గుర్తించము. కలలు మాకు యథార్థాలు "అని నారాయణ బాబు అంటారు. దీన్నిబట్టి ఆ తరం కవుల మీద ఆ రెంటి కవితోద్యమాలు, మార్క్సిజం-ప్రభావం ఎంత తీవ్రతరమో అర్థం అవుతూంది.

శ్రీశ్రీకి మార్క్సిజం గురించి సరైన అవగాహన [10]వున్నా లేక పోయినా దానిపై అభిమానం, దాన్ని అనుసరించి, మంచి ఫలితాల్ని పొందిన రష్యాపై మరులు మాత్రం మెండుగా వున్నాయి. శ్రీశ్రీ దృష్టిలో "మరో ప్రపంచం" అంటే రష్యా మాత్రమే [11]"సామ్రాజ్య వాదమునకు వ్యతిరేకముగా కంచుకోటవలె నిలబడి ప్రతిఘటించు రష్యా వారిలో కొ ఆశలను రేకెత్తించినది" అన్న విషయం ఆ భావాన్నే బలపరుస్తూంది. శ్రీశ్రీయే అన్నట్టు ఆనాటి కవులకి [12]"రష్యా వైమానికుల నిర్విరామ గమనం, షిర్కార్ట్ మహాకాళయాత్ర, ఐన్‌స్టీన్ రెలెటివిటీ సిద్ధాంతం, ఫ్రాయిడ్ మనస్తత్వ పరిశోధనలు, గాంధి అహింస, స్పెయిన్‌లో చీనాలో స్వాతంత్ర్య సమరం..." ఇవి ఉత్తేజకాలు. వీటితోబాటు ప్రపంచ యుద్ధానంతరం పాశ్చాత్య దేశాల్లో వెల్లువెత్తిన కవితోద్యమాలు వీళ్ళని ప్రభావితుల్ని చేశాయి.

శ్రీశ్రీ కవిత్వంలో వస్తువు స్వదేశీయం కాదు. అది సర్వదేశాలకీ సమమైంది. అంటే అనుభూతి ప్రధానం అయిందన్నమాట. కొన్ని కొన్ని పరిస్థితులు ప్రపంచానికంతా మామూలుగా వుంటే వుండొచ్చుకాని, ప్రతిదేశానికీ, ప్రతి రాష్ట్రానికీ తమవైన కొన్ని పరిస్థితులు ప్రత్యేకంగా వుంటాయి. ఆ పరిస్థితులు రకరకాల భిన్నత్వాల నించి రావొచ్చు. ఇవి అన్నీ సామాజిక స్పృహకల్గి, సమాజంతో విడదీయరాని బంధం గల కవుల్కి సాధారణం. అలాంటి వాటికంతా శ్రీశ్రీ తన కవిత్వంలో చోటిచ్చినట్లు లేదు. ఎక్కడైనో ఒకటీ రెండూ సామాజిక స్పృహకల్గివున్నా అవి రాశికి వచ్చేవికావు. ఏ అను

భూతి ప్రధానమైన ఉద్యమం (భావకవితోద్యమం) నించి బయట పడ్డారో అలాంటి అనుభూతిని గాకపోయినా, ఒక రకమైన 'అనుభూతి' నే తమ కవిత్వంలో చూపెంచుకొన్నారు.

[13]"కనబడ లేదా మరో ప్రపంచపు
అగ్ని కిరీటపు ధగధగలు
ఎర్రని బావుటా నిగనిగలు"          రష్యాకు సంబంధించినవి.

భారతదేశంలో, గాంధీజీ నాయకత్వంలో సాగుతున్న స్వరాజ్యోద్యమం కవిని కదలించ లేకపోయింది. 'దూరపు కొండలు నునుపు' అన్న సామెతే, నగ్నసత్యం అయింది. అంతర్జాతీయ పరిస్థితుల్ని గురించి చెప్పడం అతని విశాల హృదయాన్ని గురించి చెప్తూందనడం నిజమే కాని, తన ఇంటిలో రామరావణ యుద్ధం జరుగుతుంటే చూడకుండా పోవడం, తాము భావకవులకు అంటగట్టిన 'పలాయనం' అని గుర్తించకుండా పోవడమే అవుతూంది. తమ కవిత్వానికి [14]"పులిచంపిన లేడి నెత్తూరూ, ఎగరేసిన ఎర్రజెండా" కావాల్సి వచ్చిందే కాని జలియన్‌వాలాబాగ్‌లో లాంటి దురంతాలు కావు.

[15]సమ్మె కట్టిన కూలీల
సమ్మె కట్టిన కూలీల భార్యల,బిడ్డల
ఆకటి చీకటి చిచ్చుల
హాహాకారం: ఆర్తారావం;
[16]ధనిక స్వామికి దాస్యం చేసే
యంత్ర భూతముల కోరలు తోమే
కార్మిక ధీరుల కన్నుల నిండా
కణ కణ మండే
గల గల తొణకే
విలాపాగ్నులు, విషాదాశ్రువులు"

సమ్మె కట్టే కూలీలు, యంత్రభూతముల కోరలు తోమే కార్మికధీరులు అప్పటికి ఆంధ్రప్రాంతంలో లేరు. ఏ మద్రాసు లాంటి నగరాల్లోనో కొన్ని కొన్ని యంత్రాలు వుండివుంటే వుండొచ్చును గాని, నైజాం పరిపాలనల్లో

వున్న హైదరాబాదు లాంటి నగరాల్లో కాదు. ఆంధ్రప్రదేశ్‌లో వున్న పేపరు మిల్లు, బహుళార్థ సాధక ప్రాజెక్టులు అన్నీ స్వాతంత్ర్యం తర్వాతనే వచ్చాయి కాని, అంగ్ల ప్రభువుల కాలంలో కాదు. విస్తారంగా వున్న చక్కెర మిల్లు లాంటివి కూడా తర్వాతనే. ఈ పరిస్థితుల్లో సమ్మెకట్టే కూలీలు..... మొదలైనవంతా విదేశీయ సరకుగానే భావించాలి.[17]

మార్క్సిజం[18] "నిజమైనచరిత్ర ప్రజల స్థితిగతులను గురించి చెప్పా లంటుంది. ప్రజల ఉద్యమంలో వ్యక్తులు ఏ పాత్రవహించారో తెలపాలంటుంది." ఆ తత్వం

[19]"సామ్రాజ్యపు దండయాత్రలో
సామాన్యుల సాహసమెట్టిది ?
ప్రభువెక్కిన పల్లకి కాదోయ్
అది మోసిన బోయీలెవ్వరు ?" గా రూపు దిద్దుకొంది.

దాంతోబాటు రష్యా,

[20]"వ్యక్తి స్వతస్సిద్ధ స్వాతంత్ర్యదాతా
పతిత నిర్గతిక ప్రపంచ త్రాతా
భావికాల స్వర్ణభవన నిర్మాతా" అయింది. భావకవులు

ప్రేయసికొరకు అంగలార్చితే, శ్రీశ్రీ రష్యాకొరకు ఆదేవని చేశారంటే అతిశయోక్తి కాదేమో !

ఇంత వరకు చెప్పినవన్నీ శ్రీశ్రీపై రష్యా, తద్వారా మార్క్సిజం ప్రభావం వల్ల కల్గినవాటిలో కొన్ని మాత్రమే. ఇక అతనిపై కవిత్వోద్యమాల ప్రభావం కూడా వుంది.

[21]"అర్థాన్ని అధ్వానపు అడవిలో వదలి
గద్యాన్ని పద్యానికి పెళ్ళిచేద్దాం
హోష్ హుష్, హుష్ హోష్ అని కేకలువేసి
కావ్ కావ్ మ్యావ్ మ్యావ్ అందాం గమ్మత్తుగా"

అన్నపాదాల్లో కేవలం శబ్దాలకే ప్రాముఖ్యం ఇచ్చి అర్థాలని పట్టించుకోవాల్సిన

అవసరంలేదన్న విషయంవుంది. ఇది భవభూతి [22]"శబ్దాలవెంట అర్థాలు పరిగెత్తుతాయి" అన్న భావానికి విరుద్ధం. ఈలాంటివి తెలుగు సాహిత్యానికి సుపరిచితాలు కాదు.

[23]"..... the cubo-futurists espoused the gospel of pure euphony; they favoured the sound, or more broadly the sensuous texture of the word at the expense of its semantic aspect", ఆ cubo-futurists ప్రభావం గానే దాన్ని గుర్తించాలి. ఈ వుద్యమస్థాపకుల్లోనే మయకోవస్కీ కూడా ఒకడు కనుక శ్రీశ్రీకి అతడు ఇష్టుడు కనుక, ఆ ప్రభావం అలాంటి గీతాల్ని రాసేందుకి ప్రోత్సాహం కల్గించివుండొచ్చు.

[24]'యుద్ధం రోజులలోనూ, యుద్ధం గడిచిన క్రొత్త దినాలలోనూ బయలుదేరిన ఉద్యమం డాడాయిజం (dadaism). ఇది కేవలం విధ్వంసనమే. నిరసనమే, నిరాకరణమే పనిగా కలది.... ఏదో ఒక అక్షరం తీసుకొని దానితో ప్రారంభించే మాటలతో ఒక రంగవల్లిక తయారుచెయ్యడం, ఒక్కొక్క మాటనుంచి ఎన్నో విధాల ఎన్నో అర్థాలు సాధించడం, వార్తా పత్రికల్లో మాటలు కత్తిరించి తిరిగి వాటిని ఇష్టంవచ్చిన క్రమంలో పేర్చి పద్యం అల్లడం'-ఇది డాడాయిజం తత్వం.

[25]"ఆటవెలది ద్విపద కర్తగారు
5, 3, 2 ఆముక్తమాల్యద

పేజీకొకలైను ప్రకారం అక్కడక్కడ తీసికొని, ఇష్టప్రకారం పేర్చి ఒక కవితని అల్లారు శ్రీశ్రీ. అది

[26]26 (టీకాతాత్పర్య సహితము)

శ్రీరంగం నారాయణబాబులో కూడా మార్క్సిజం కవితోద్యమాల ప్రభావం వుంది.

[27]"మిన్ను విప్పిన
రక్తపతాకం
మన్ను సత్తువె
తెలిపింది

అన్నప్పుడు "ఎర్రజెండా"

[28]"ముష్కరులెవరో
తస్కరించిరి
ముంగ్లసులానీ
పూలన్నిటినీ
మాయం చేసిన వారిని
గాయంచేస్తే రక్తసిక్త
గీతాలేతామే
తోడమంది" అన్నప్పుడు వర్గసంఘర్షణలాంటి

మార్క్సిజ తత్వం కనబడుతుంది. నారాయణబాబులో వాటి ప్రభావంతో బాటు స్వదేశాన్ని, స్వరాష్ట్రాన్ని పరామర్శించిన రీతి కూడా కన్పడుతుంది. రోణంకి అప్పలస్వామి[29] "ఇద్దరూ (శ్రీశ్రీ, నారాయణబాబు) పాశ్చాత్య కవితా సంప్రదాయాలను మననం చేసుకొనినవారే. కాని భారత సంప్రదాయం నారాయణబాబు కవితలో చక్కగా జాలువారుతూ వుంటుంది." అన్నారు.

విశాఖపట్నంలోని ప్లీడరు గుమాస్తాలు

[30]గుమాస్తాలంతా
గుల్లగాళ్ళు
బీదవాళ్ళ నెత్తురు
బీరులాగ తాగేస్తారు" అనీ
[31]ఆఫీసులు ఆశ్రమాలు
ఆఫీసర్లే ఋషులు
లంచంకోసం తపస్సు
అచ్చర కన్నెలు
రూపాయలు" అనీ, అంటారు.

లంచం నగ్నంగా సత్రిస్తాండడం, న్యాయం దిక్కూ మొక్కూ లేకుండా పోవడం అనాటి సంఘ పరిస్థితిని తెల్పుతూన్నాయి. వీటితోబాటు

చీకటి
కదన కుతూహలరాగం
చిందులు త్రొక్కి
చుక్కల చూపుల కూడ
సుడిగిన
మొండి రాత్రి ఆది

నీ గళమ్మున
నిరాకరణ సూత్రం
వైచి
నిలుపున ఉరితీశారా నా తండ్రీ" అంటూ

దేశస్వాతంత్ర్యం కోసం ప్రాణాలర్పించిన వీరత్యాగి భగత్సింగును గురించి కూడా ప్రేరణ పొందారు.

ఆయన కవితలో

మృత్యువొసంగి
మాతృ కరమ్ముల
విధవ కామపు
పెదిమ
వెలుగై వెలిగి
నలుపెక్కిందీ సంధ్య' ఆని సంధ్య వర్ణన వుంది.

ఇది అంతకుపూర్వంవున్న [32]"సంధ్యామనోజ్ఞచిత్ర సింధూరరేఖ, నంజముద్దు మొగంబు, సంజెవేళల పవడంపు చాయలు" అన్న మనోజ్ఞ భావ చిత్రణలని త్రోసిరాజనడం.

[33]"ఖ్యాతి గడించే
గీతం వ్రాసి
ప్రేయసి కంకిత

మీయాలంటూ

మూతి బిగించి

చేతులు నులుముతు

కూచున్నావ"        అనడం భావకవిని ఎదేవా చేయడం.

ఇలాంటిభావాలు అన్నీ భావకవిత్వంమీద చెణుకులు విసిరేందుకు పనికొచ్చాయి. వీటితో తెలుగు సాహిత్యంలో తమ ముందటి పద్యమాల్నీ కవుల్నీ సహా కవుల్నీ, తెగడ్డం ప్రారంభం అయింది. శ్రీశ్రీ-మూడుయాభైలు, మరోమూడు యాభైలులో-దిగంబరకవులూ,విప్లవ కవులూ, సి. విజయలక్ష్మి ఇదే పనిచేశారు.

[34]".... Futurism was intended as a violent rebellion against the whole tradition of the 19th century, ...In literature the main targets of futuris ו were the lingering sentimental traces of romanticism" అన్న వాక్యాలవల్ల రొమాంటిసిజం పై ధ్వజం ఎత్తడమే ఫ్యూచరిజం ధ్యేయమైనట్టు తెలుస్తూంది. ఆ ఫ్యూచరిజం ప్రభావం వల్ల నారాయణబాబు లాంటివాళ్లు భావకవిత్వం పై తిరుగుబాటు చేశారు.

నారాయణబాబు మీద స్యర్రియలిజం ప్రభావం కూడా వుంది.

[35]"మేడమీద నేను

మేడ కింద

పాకలోన నీవు

చైతన్య స్రవంతిలోన

మేడమీద

మేడకింద

నీతో నేను

వ్యక్తంలో

నీ నోటిని గడ్డిపరక

వ్యక్తావ్యక్తంలో

నా గీతం" అన్నపాదాలూ,

35 [illegible]ష్ట" అన్న గేయానికి నాందీ పలుకులుగా ఇచ్చిన "వ్యక్తం చేరు కుందామని చైతన్య స్రవంతిని ఈది, వ్యక్తం కంటబడకుండా వ్యక్తావ్యక్తంలో తలదాచుకొంటున్న తలపులు చెప్పేందుకే ఇందులో చేసిన ప్రయత్నం" అన్న మాటలూ స్యూరియలిజంవల్ల వచ్చినవే.

పఠాభిలో శ్రీ శ్రీ నారాయణ బాబుల్లోలాగ రెండిటి-మార్క్సిజం కవితోపాటు-ప్రభావం కాకుండా 'కవితోద్యమాల' ప్రభావం మాత్రం వుంది. దాన్ని కూడా దేశీయ వాతావరణానికి అన్వయించుకొన్న దిట్ట పఠాభి. పై ఇరుపుతిలాగా గాక స్వీయానుభవాల్కి రూపం కల్పించారు తన కవిత్వంలో. అయితే రొమాంటిసిజం మీద, వస్తువులో 'రచన'లో రెండిటి మీదా ధ్వజం ఎత్తిన వాడయినా, అదే ప్రధానంకాదు.

36"భావకవిత్వం మీద పనిగట్టుకొని దండయాత్ర చేసిన వాడు పఠాభి." అందులో సందేహంలేదు. భావకవిత్వం మీద వచ్చిన తిరుగుబాటు కేవలం Futurism ప్రభావం ఫలితమే అన్న విషయం ఇంతకుముందే తెల్సుకొన్నాం. ఈ విషయం దృష్ట్యా, చూసినపుడు పఠాభిపై కవితోద్యమాల ప్రభావం వుందన్న విషయం అర్థం అవుతూంది. అయితే పఠాభి కేవలం భావకవిత్వాన్ని హేళన చేయడం కోసమే, 'అకామ' తత్వాన్ని వెక్కిరించడం కోసమే కవిత్వం రాసి వుంటే అది పదికాలాలపాటు నిల్చివుండేది కాదు. పిచ్చివాళ్లలోకం అంటూ దాన్ని తోసేసి వుండేది కాలం. కాని వీటికన్నా బలీయంగా పఠాభిలో మానవతావాదం (humanism) వేరులు తన్నుకొని వుంది. రవీంద్రనాద్‌ఠాగూర్ అంతేవాసిగా వున్నంత మాత్రాన భావకవిత్వాన్నే రాయాలన్న నియమంలేదు. రవీంధ్రనాథ్ ఠాగూర్‌లో మానవతావాదం మహత్తరంగా వుంది. అయితే కాల్పనికతత్వం దాన్ని మింగేసింది. పఠాభిలో కాల్పనికతత్వం లేకపోలేదు. కాని అది భావచిత్రణకాదు, ఊహాచిత్రణ; హృదయ సంబంధికాదు, మనస్సంబంధి. అలాంటి భిన్నత్వం వల్ల పఠాభి కాల్పనిక కవినించి వేరవుతున్నారు.

ఆనాటి సమస్య ప్రేయసీ వియోగాన్ని ఎలా భరించడమా అన్న మీమాంస కాదు. 'వెండీ రూపాయి' మానవుని ఎలా వేజిక్కించుకొంటున్నదా? మానవుడు ఎలా దాని చేతిలో కీలుబొమ్మ అయిపోతున్నాడా? అని చెప్పడం

మాత్రమే పఠాభి చేయదల్చుకొంది. అంటే అనుభూతి నించి సామాజిక స్పృహతో రాయడం, ఊహాలోకం నించి ధ్యానం పట్టించడం, కవి చేసిన పని. ఆ విషయాన్ని కాంతాసమ్మితంగానో, కథాశ్రవణంగానో గాక, ఒక్కసారి జూలు దులుపుకొని పై కెగరే కంఠీరవం అలజడిలాగా చూపుకట్టించారు. అలజడివల్ల నిద్రాణమైన జాతి మేల్కొంటుందని తలచారు. మెల్లిగా, మృదు మధురంగా లేపితే, భావకవిత్వ మరంద మాధుర్యాలకి సొక్కి సొలసివుంటారు కనుక లేవరని 'గర్జిస్తూ, పెడబొబ్బలువేస్తూ' విధ్వంసకంగా - భావచిత్రణలు మొదలగునవి ద్వారా - అలజడిని కల్గించారు ఇది కేవలం అలజడికోసం కాదు. తద్వారా జాతిని మేల్కొల్పడం కోసం; ప్రేయసిని వదలి సంఘాన్ని స్పృశించమని చెప్పడంకోసం. పఠాభి ముప్పై నాలుగేండ్ల తర్వాత తన రచనకి రెండు మాటలు రాస్తూ [37]"Abuse would have served my purpose admirably ......... only out of friction can progress be achieved" అన్నారు.

[38]"ముఖరింపు చున్నది మా కర్ణాలలో
గుండియలందు గూడ వెండి రూపాయి
ఘలంఘలా శ్రావ్యసంగీతము కర్ణపేయముగా"

అన్నప్పుడు మనిషి "రూపాయినోట్లో తలదూర్చి దానికి కీలుబొమ్మ అయిన విధం" తెలుస్తుంది. ఇదే పఠాభి రచనలోని మూలసూత్రం. మానవత్వాన్ని దిగజార్చిన ప్రథమసూత్రం.

పఠాభిని గురించి చెప్తూ రమణారెడ్డిగారు [39]"ఒక ఆంగ్లో ఇండియన్ అమ్మాయినే తీసుకోండి. సినిమాహాల్లో తొమ్మిదణాలసీటుకు ప్రలోభపడుతున్నదంటే ఆ అక్కరల బతుకు మనకు కళ్ళకు కట్టవచ్చు. కాని ఈ "సహాయం చేసిన యువకునికి కృతజ్ఞతాసూచకంగా, తన శరీర తలాన్నంతా పరిశోధనకు సమర్పించుకొంది అన్నప్పుడు, ఆ అమ్మాయి మీద కోపానికి బదులు జాలి కలుగుతుంది" అని మానవతా బుద్ధితో వుదాహరించారు. అయితే ఇలాంటి భావం కవికూడా పొందివుండొచ్చు అనిపిస్తుంది. పై పై భావాల్ని మాత్రం వాచ్యంగా గ్రహించి అతని మనస్తత్వాన్ని ఒక వ్యాధి లక్షణంగా ఈసడిస్తూ,

39 "వాస్తవ ప్రపంచానికి కట్టుబడని శుద్ధస్వేచ్ఛాజీవి. తన కొక్కడికి తాను బానిస. తన సంచితనానికి మాత్రంకాదు. తనలో పేరుకొని పోయిన [illegible] అసూయమిత క్షుద్రోద్రేకాలకు బానిస" అంటూ రమణారెడ్డి అభాండాలు కూడా వేశారు. ఈ అభాండాలకి కారణం

40"అన్నం ముద్దకయి కక్కుర్తిపడి
శరీరాన్ని సవారికిచ్చే జవరాళ్ళు
తొమ్మిదణాల సినిమా టిక్కట్టుసకు
తమ బహిర్దేహము మీద
యాత్రచేయుటకు హక్కునిచ్చే
కొందరాంగ్లో ఇండియన్ అభాగినులు"

అన్నపాదాలే. కవిత ఇంతేకాదు. ఇంకా సాగుతుంది. "ఆంగ్లో ఇండియన్ అభాగినులు" అనీ, "మర్యాదస్తుల మంద" అనీ రెండు వర్గాల్ని వర్ణిస్తారు. రమణారెడ్డిగారన్నట్టు "బూర్జువాబోర్డమ్" నించే కవి వచ్చివుంటే, ఆంగ్లో ఇండియన్ వనితల్ని "అభాగినులు"గా గుర్తించి వుండేవారు కాదు. ఏదో శృంగారమో, కామమో స్ఫురించే పదాల్ని వాడి వుండేవారు. కాని మానవతావాదం కవిలో బలీయంగా వుందనుకొన్నాం. ఆ బలిమే కవిచేత "అభాగినులు" అన్పించింది. అది యాదృచ్ఛికం అని అనుకోడానికి వీల్లేదు. వెంటనే "మర్యాదస్తుల మంద" అంటారు. 'మంద' అన్నపదం ఇక్కడ నీచార్థం. 'మర్యాద" అన్న బురఖాని తగిలించుకొన్న నీచులుగా వాళ్ళని వర్ణించారు. అంతేకాదు, తాను గుర్తించడమేకాదు,

"ప్రకటించుచున్నవి తరంగాలు
బిగ్గరగా తమ యసమ్మతిని"

అంటూ అచేతన వస్తువుల చేతకూడా చూపించారు.

"........రసాల్మామిడి పండ్ల నమ్ము
ఏనాడ్దానిం జూడుము
పయ్యెంట తడిసి, కండ్లకు

పండుగ జేస్తున్నవి దాని
రసాల్మామిడి పండ లాంటి పాలిండు"

ఇలాంటి వాటి ఆధారంగా కవికి, ఫ్రాయిడ్ సిగ్మండుకి కొందరి విమర్శకుల చేత సంబంధం కల్పింప బడింది, [41]'సాహిత్యంలో సెక్సు, కామ చిత్రణ ప్రారంభం అయిందీ అన్నారు. నిజం కావచ్చు. కాని ఆ దృశ్యం కన బడ్డది కవికి కాదు. కామంతో కళ్ళు బైర్లు కమ్మిన కామాతుర్లకి. పయ్యెద తడవడం మామిడి పండ్లని అమ్మడం వల్ల. పొద్దుటనించి ఎండలో వుండడం వల్ల. తన పొట్ట కూటికోసం ఇతరులపై ఆధారపడకుండా ఏదో ఒక వ్యాపారం చేసుకుంటూ, అలా ఎండలో ఎండుతూ, వానలో తడుస్తూవున్న దాన్ని - దానిపై జాలి చూపించడం మాని ఏదో సాయం చేద్దాం అనడం మాని, ఆమెలో కూడా లోకం కామాన్ని చూస్తుంది. ఇది కామాతుర్లపై కవి విసరిన చెణుకు. అది వదలిపెట్టి కవికే దాన్ని ఆపాదించడం సబబు కాదు.

[42]"....... బూందీ పొట్లాలంబోలు వారి చను
లూగుచున్నవి, చేతుల్లేని
తోపురంగు మ్యాటీక్లాతు రవికల్లోన"

భావకవిత్వంలో అంగాంగ సౌందర్యం అంతస్సౌందర్యానికి మారిందనడం చర్విత చర్వణం. పతాభిలో ఇక్కడ తిరిగి అంగాంగ వర్ణన చోటు చేసు కుంది. ఇక్కడ వర్ణన వల్ల వారి రూపం అర్థం అవుతూంది. కాముకుల చేతుల్లో పడ్డందువల్ల, శరీరం అంతా నాశనం అయిపోయింది. "గుట్టలు"గా వుండిన వాళ్ళ స్తనాలు "బూందీపొట్లాలు." అయ్యాయి. అంటే సంఘం చేతిలో వాళ్ళు ఏ విధంగా నలగబడ్డారో అన్న విషయం అక్కడ ద్యోతకం అవు తూంది. దానికి కారణం.

"ఈవినింగ్ హ్యాట్ల కింద
ముడుచుకొని తమ ముఖాల వస్తున్నారు మునికాళ్ళ
జంటిల్మన్ అంటారే వారూ",

కొంతమంది విద్యార్థులూ దొంగలూ; త్రాగు బోతులు, లీడర్లు, పూజారులు, జారులు, తమ రూపాయి డబ్బులతో పలుపును పర్చేస్ చేయడానికి రావడం.

'ఓ భోగంధచానా, నీవు
సంఘానికి వేస్తు పేపరు బాస్కెటువా ?
మష్టమషాణము పడవేయ బడునట్టి డిబ్బివా ?

అనడంలో కూడా మానవత్వమే ఇమిడివుంది.

భావచిత్రణల ద్వారా, అకాము తత్వాన్ని వెక్కిరించడం ద్వారా పరాభి భావకవిత్వాన్ని విమర్శించారు. ఇది కవితోద్యమాల ప్రభావం.

## తెలంగాణోద్యమం :

చివరకుగా ఆంగ్లేయులు భారతదేశానికి స్వాతంత్ర్యం-1947, ఆగష్టు 15-ప్రకటించారు. హైదరాబాదు సంస్థానం లాంటి స్వదేశీ సంస్థానాల్ని తమ ఇష్టానికి వదిలేసి లూయీ మౌంట్‌బాటన్ అధికారం నించి తప్పుకొన్నారు. కొన్ని సంస్థానాలు ఇండియన్ యూనియన్‌లో చేరేందుకు తమ సమ్మతిని తెలియచేశాయి. హైదరాబాదు సంస్థానం నిరాకరించింది. అయితే ప్రజలు ఆ సంస్థానంపై తిరగబడ్డారు. నైజాంనవాబు పరిపాలనని గర్హించారు. ఇండియన్ యూనియన్‌లో చేరాలని పువ్విళ్ళూరారు. ఇలాంటి విప్లవకారుల్ని కమ్యూనిస్టు పార్టీ తన దరి చేర్చుకొంది. అది కమ్యూనిస్టు వుద్యమం అయింది. అలా ప్రత్యక్ష తెలంగాణోద్యమం ప్రభావం వల్ల అరసం సరికొత్త పదును పెట్టుకొంది. వల్లభాయి పటేలు నాయకత్వంలో సైన్యం సంస్థానాన్ని ఆక్రమించు కొంది. తెలంగాణాప్రజలు సైన్యానికి అఖండ స్వాగతం ఇచ్చారు. ప్రజల ఆశయం తీరింది. సంస్థానం ఇండియన్ యూనియన్‌లో చేరిపోయింది. వల్లభాయి పటేలుకీ, నెహ్రూకీ తద్వారా కాంగ్రెసుకి జేజేలు పలికారు ప్రజలు. అయితే మొదటి నించి అదే కార్యసిద్ధికి ప్రజలకి ధైర్యం చెప్తూ, నైజాంని ఎదిరించి, గెరిల్లా పోరాటాన్ని నడిపిన కమ్యూనిస్టు పార్టీ మాత్రం నిజాన్ని గ్రహింపక, నాయకత్వం చేసిన తప్పుడు అంచనా మూలంగా గెరిల్లా పోరాటాన్ని ఆపకుండా కొనసాగించింది. ఆశయం తీరిన ప్రజలు ఆ తరువాత కమ్యూనిస్టు పార్టీ కొనసాగిస్తూన్న గెరిల్లా పోరాటానికి తమ్మ మద్దతు ఇవ్వలేదు. అదీ ఆనాటి కథ.[43]

తెలంగాణా ప్రజల ఆశయం సిద్ధించిన తర్వాత, 1952 లో మొదటి ఎన్నికలు జరిగాయి. ఉద్యమ పాత్రధారులుగా గణుతికెక్కిన కమ్యూనిష్టుల్ని, ప్రజలు ఘనంగా గెలిపించారు. ఈ గెలుపు ఒక పెద్ద మలుపుగా గుర్తించారు. ఆరుద్ర[44]. ఇదీ నాటి రాజకీయం.

పై విషయాలన్నీ క్రోడీకరిస్తే, ఆంధ్ర మాగాణి స్వాతంత్ర్యం వస్తూనే రకరకాల అలజడులతో భాగం పంచుకొంది. ఒక పక్క రజాకార్ల విజృంభణా, ప్రజా శక్తుల ప్రతిఘటనా, పోలీసు చర్య, తెలంగాణా సాయుధ పోరాటం, కమ్యూనిస్ట్ పార్టీపై నిషేధం, అభ్యుదయ రచనలపై ఆంక్షలు, ప్రగతి శక్తులను అభిమానించే ప్రజలపై దురాగతాలూ[45]—ఇదీ ఆనాటి ఆంధ్ర మాగాణి పరిస్థితి. ఈ సంఘటనలతో కవి వుత్తేజం పొందాడు.

ఈ సమయంలో వచ్చిన కవితని రెండు భాగాలుగా గుర్తించొచ్చు. ఒకటి ఉద్యమం చేత ప్రభావితులై ఇటు నైజాంని గర్హిస్తూ అటు సాయుధ పోరాటాన్ని గణుతిస్తూ రాయబడ్డ కవిత. రెండు మార్క్సిజం ప్రభావం వల్ల ఏర్పడ్డ వర్గ సంఘర్షణ, సమసమాజం లాంటి వాటిని ఆధారంగా చేసుకొని రాయబడ్డ కవిత-అని

## తెలంగాణోద్యమ కవిత్వం

నైజాంని గర్హిస్తూ [46]"నా తెలంగాణ కోటి రత్నాల వీణ" అని గర్వంగా చాటిన కవికిశోరం దాశరథి. కేవలం కవిగానే గాక, వుద్యమంలో నడుంకట్టి నిలచిన వీరుడు దాశరథి.

> [47]'ప్రాణము లొడ్డి ఘోర గహనాటవులన్ బడగొట్టి మంచి మా
> గాణములన్ సృజించి ఎముకల్ నుసిజేసి పొలాలు దున్ని భో
> షాణము న్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే, తెలం
> గాణము రైతుదే, ముసలి నక్కకు రాజరికంబు దక్కునే."

అని నిర్భయంగా చాటిన పులిబిడ్డ దాశరథి. నిజాం రాజుని 'తరతరాల బూజు'గా చిత్రించిన ధైర్యశాలి ఆయన. దాశరథి కేవలం ఉద్యమోపజీవి. కవిగా వుత్తేజితుడయింది తెలంగాణోద్యమం వల్లనే. ఈ సమయంలో వచ్చిన

అలని రచనలు అగ్నిధార, రుద్రవీణలు. ఆ ఆశయం తీరినంతనే విశాలాంధ్రోద్యమం వైపుకి పరుగులెత్తి తెలుగు తల్లిని కీర్తించారు.

[48]వేయి స్తంభాల గుడి వ్రాయించు కొన్నది
నా చేత ఏక శిలా చరిత్ర
వీర రుద్రమ దేవి వినిపించు కొన్నది
నా చేత జన్మ జన్మాల కథలు —అని.

[49]"తే తెండి వడిసెలలు రాలు రువ్వండి
పోపొండి మిరప పొడి కళ్ళు కుప్పండి
కాల్చండి లారీలు గోరీలు పూడ్చండి
మృత్యువై మనము శవతాండవము నేడు"

అంటూ ప్రజల్ని నైజాంపై తిరగబడమంటూ వుద్బోధించారు కొంత మంది కవులు.

[50]"పామరు శిరస్సులతో బంతులాడు పాలకులను
ప్రగతి చక్ర ఘట్టనతో సంహరించ వలెనురా" అనీ,

[51]"గుండె గుండెకు చిచ్చుమండించి లేవండి
గుడిసె గుడిసెకు కోట నిర్మించి లేవండి"

అనీ ప్రజలకి చైతన్యం కలిగిస్తూ, వుత్సాహం పూరిస్తూ, విప్లవానికి వుసి గొల్పుతూ, కవులు వుద్యమంలో కీలకపాత్ర వహించారు. గంగినేగి వేంకటేశ్వరరావు దాశరథిలాగా స్వయంగా గెరిల్లా పోరాటంలో దిగిన వుద్యమ కవి.

[52]"జాగ్రత్త, భుజంపై తుపాకీ అదే మన పంచప్రాణం
మొలలో తూటా బెట్టు! అదే అదే మన సర్వస్వం"

అనీ గెరిల్లా యువకులకి పోరాటంలోని మెళకువల్ని చెప్తూ

[53]ఇంటి దగ్గర అంతా కులాసా రేపీ పాటికి ఈ ప్రాంతం మనది
తెలీదా, నిన్న ఆరు పరగణాలు మనవాళ్ళు విముక్తి చేశారు

అంటూ యువ వీరుల్కి ఆశకల్పిస్తూ, పురి ఎక్కిస్తూ రచనలు చేశారు గంగి నేని గారు.

తెలంగాణా ఇతివృత్తంగా రాయబడ్డ కావ్యాల్లో ఆరుద్ర త్వమేవాహం, కుందుర్తి తెలంగాణాని ముచ్చటించుకోవచ్చు.

[53]"........చారిత్రిక పరిమాణంలో మరీ పాతదై పోయిన ఫ్యూడల్ వ్యవస్థమీద ఒక పెద్ద తిరుగుబాటుగా తెలంగాణా వుద్యమాన్ని నేను భావిం చాను" అంటూ కుందుర్తి 'తెలంగాణా' విజ్ఞప్తిలో పేర్కొన్నారు. అలాంటి మార్క్సిస్టు దృక్పథమే కావ్యం అంతా కన్పడుతూంది. కావ్యాన్ని కొన్ని పర్వాలుగా విభజించి, భారతంతో పోలిక చేశారు. 'ఒకవేపున అధికోత్పత్తీ, మరోవేపు డొక్కల కరువూ' గల నైజాం ప్రభుత్వం-ఆ మాటకొస్తే బూర్జువా ప్రభుత్వం-నశించాలనీ, ప్రజలు సమసమాజస్థాపనలో పాలు పంచుకోవడంతో బాటు ఆనందం నింపుకోవాలనీ కవి ఆకాంక్షించారు.

## మార్క్సిజం-ప్రభావం వల్ల వచ్చిన కవిత్వం

కుందుర్తి, ఆరుద్రాదుల్లాగా మరి కొంతమంది - కాళోజీ, సోమసుందర్, రెంటాల, గంగినేని, రమణారెడ్డి లాంటి వాళ్ళు - కూడా తెలంగాణా వుద్యమాన్ని గూర్చి రాయడంతో బాటు మార్క్సిస్టు దృక్పథానికి లక్ష్యప్రాయా లనదగ్గ కవితల్ని రచించారు. ఒక రకంగా తెలంగాణోద్యమం, మార్క్సిస్టు దృక్పథం పడుగుపేకల్లాగా కల్సిపోయ్యాయి. కమ్యూనిస్ట్ పార్టీ అండదండలు వుద్యమానికి వుండడం వల్ల కవులు కూడా రెండిటి - తెలంగాణోద్యమం, మార్క్సిజం-జోడించుకొని చైతన్యం నింపుకొన్నారని అర్థంచేసుకోవాల్సి వుంది. అందుకనే స్వాతంత్ర్య యుగోదయంలో వెలసిన కవితలో అటు వుద్యమ ప్రభావం, ఇటు మార్క్సిస్టు దృక్పథం కన్పడుతూ వుంటుంది.

మార్క్సిస్టు తత్వశాస్త్రంలో మనకు కనబడే మొదటి సూత్రం వర్గాలు, వాటి సంఘర్షణలు. ప్రాచీన కాలంలో వాళ్ళుచేసే పనినిబట్టి, జాతులు ఏర్పడ్డాయి. అపుడు ఆ వర్గీకరణ వర్గానికి సంబంధించిందే కాని జాతికి కాదు. కాని అది కొన్ని తరాలు మారడం వల్ల జాతులుగా మారిపోయింది. సంఘంలో ఎపుడూ కొన్ని వర్గాలు వుంటూనే వుంటాయి. ఎమిలీ బరన్స్

అన్నట్టు 54"ఒకే రకమైన మార్గాన భుక్తిని సంపాదించే వారిని ఒక వర్గం" అంటాం. పల్లెటూళ్ళలో రైతులుంటారు. సమృద్ధి కలవారు. ధనధాన్యాల్తో ఎప్పుడు కళకళలాడుతూ వుంటారు. వీళ్ళు భూస్వాములు. వీళ్లకి వ్యవసాయంలో తమతమ పనుల్లో సాయపడుతూ, తమ సొంతపని కూడా చేసుకొంటూవున్న మరోవర్గం. వీళ్ళకి కొంచెంగా ఆస్తికూడా వుంటుంది. అయితే భూస్వాముల కిందికి రారు. ఇంకోవర్గం వుంది. వాళ్లకి స్థిరాస్తి వుండదు. చరాస్తి చెప్పుకో తగ్గంత వుండదు. వీళ్ల పని పై రెండువర్గాలకి సహాయపడటం, తద్వారా లభించే గ్రాసంతో కడుపునింపుకోవడం. మామూలుగా పల్లెటూళ్లలోవుండే వర్గాలు ఈ [illegible]డు. ఒకటి భూస్వామి వర్గం. చివరిది కూలి వర్గం. వీళ్ల మధ్యన వుండే వర్గం మధ్య తరగతి వర్గం. ఈ వర్గం ఎక్కువగా వుంటుంది. ఈ వర్గాలకి జాతుల్తో, కులాల్తో సంబంధంలేదు. వాళ్ళు చేసే పనితో మాత్రమే.

చివరి రెండు వర్గాలు మొదటి వర్గంతో, చివరి వర్గం మొదటి రెండు వర్గాలతో, మొదటివర్గం తర్వాతి రెండువర్గాలతో స్పర్ధిస్తూంటూంది. చివరి వర్గాలు శ్రమిస్తాయి. తగ్గ ఫలితం కావాలని కోర్తాయి. మొదటివర్గం తాము ఇచ్చేఫలానికి ఎక్కువ పని చేయించు కోవాలనుకొంటుంది. వాళ్లవాళ్ల దృష్టిలో వారి కోరిక సబబైనది. అయినా ఒకరిదృష్టిలో ఇంకోరిది పక్షపాతం. అలాంటప్పుడు సంఘర్షణ తప్పదు. దీన్నే వర్గసంఘర్షణ అంటారు. ఇది ఏ ఒక సంఘానికో, దేశానికో పరిమితం కాదు. వర్గాలు వున్నంతకాలం వర్గసంఘర్షణ జరగకుండాపోదు. మనుషులు మారొచ్చు, జాతులు మారొచ్చు, కులంమారొచ్చు అంతే తేడా. అయితే ఇలాంటి సంఘర్షణ ఒకటి వుందని, అది సంఘపరిస్థితుల్లో ముడిపెట్టబడి వుంటుందని మొదట తెల్పినవారు మార్క్స్, ఏంజిల్సులు-తమ దాస్ కాపిటల్‌లో. ఆ ప్రభావంతో మన కవులుకూడా స్వాతంత్ర్యయుగోదయంలో వర్గ సంఘర్షణని చిత్రించారు.

నైజాం నవాబుపై కారాలు మిరియాలు నూరుతూ కలాన్ని ఝళిపించిన దాశరథి,

55"అనాదిగా సాగుతోంది
అనంత సంగ్రామం
అనాథుడికి ఆగర్భ
శ్రీమంతుడికి మధ్య"

అని దాని ప్రాచీనత్వాన్ని చెప్పారు. కె. వి. రమణారెడ్డిగారు

[56]'అలకా పురానికీ అంగా జనానికీ ఇది సమరం సంకులం'

అని ఆ వర్గ సంఘర్షణ ఆధునిక కాలంలో జరుగుతూన్నట్లు చెప్పారు.

గగనంలో 'ఎర్రబావుటా నిగ నిగల్ని' చూసి 'యుగధర్మం చైతన్యం-జనహృదయం పోరాటం" అని తెల్సుకొని 'తిరుగుబాటు' వజ్రాయుధాన్ని ఝళిపించిన సోమ్‌సుందర్

[57]"ప్రతి నిత్యం ఫ్యాక్టరీ
కూలి యెముకల నెన్నో
సున్నంగా చిదుగ కొట్టి
రక్తంతో రంగరించి
ధనస్వామి పాదమ్ముల—
పారాణిని పూస్తున్నది ?"

అని ఆ వర్గ సంఘర్షణ కార్మికుల, పెట్టుబడిదారుల మధ్యన వున్నట్టు చిత్రించారు.

ఇలా వర్గ పోరాటంతో బాటు 'సమసమాజం' కావాలని కూడా కవులు కలలు కన్నారు.

సంఘంలో వర్గాలుంటాయని అనుకున్నాం. భూస్వామి, కూలీలు ఆ కోవకిందికి వస్తారు. భూస్వామి చేతిలో భూమి వుంది. కూలిపనిలో 'శ్రమ శక్తి' వుంది. రెంటిలో ఏది లోపించినా వుత్పత్తి రాదు. కనుక వుత్పత్తికి అటు సాధనం, ఇటు శ్రామిక శక్తి అవసరం. కూలి తన పొట్టకోసం కష్టిస్తాడు. భూస్వామి తన పొట్ట కోసమే - భూమిని సాగు చేయడం కోసమే-కూలీని పెట్టుకుంటాడు. అంత వరకు ఇద్దరి కోరికా ఒకటే. అయితే భూస్వామికి తనకు కావల్సిన దానికన్నా ఎక్కువ వస్తూంది. కూలీకి మిగలడం లేదు. అంటే తనకున్న సాధనానికి రావల్సిన దానికన్నా ఎక్కువ విలువ భూస్వామికి వస్తుంది. కూలీకి శ్రమకు తగ్గ ఫలితం మాత్రం వస్తూంది. వుత్పత్తి రెంటి మిశ్రమం వల్ల వస్తూంది కనుక వుత్పత్తి విలువ

కూడా ఇష్టానికే సమంగా రావలసి వున్నా రావడం లేదు. కూలివానికి కూలికి తగ్గ జీతం మాత్రం ఇచ్చి మిగతా 'మిగులు పుత్పత్తి' ని భూస్వామి స్వాధీనం చేసుకొంటున్నాడు. దీన్ని లాభం అందాం. ఈ లాభం వల్ల మరికొంత భూమి కొనొచ్చు. మరికొంతమంది కూలీల్ని పెట్టుకోవచ్చు. తద్వారా మరింత లాభం రావొచ్చు. ఇలాంటి లాభం మరో పనికి పెట్టుబడి కావొచ్చు. అలా గాకుండ వచ్చిన వుత్పత్తి కేవలం తన అవసరాలకే సరిపోతే దానికి పెట్ట బడ్డ ఖర్చు పెట్టుబడికాదు. పెట్టుబడిదారీ విధానానికీ సోషలిస్టు సమాజానికీ వున్న వ్యత్యాసాన్ని చెప్తూ [58]"పెట్టుబడిదారీ విధానంలో ఉత్పత్తి, సమాజం లోని అనేక మంది ప్రజల సమిష్టి కృషివల్ల జరిగినప్పటికీ, ఫలితం వ్యక్తికి గాని, కంపెనీకి గాని చెందుతుంది. సమాజం యొక్క అంతటి ఆస్తి అవడం లేదు. సోషలిస్టు సమాజం నిర్మించడానికి మొదటి మెట్టుగా ఉత్పత్తి చేయ బడిన సరుకును సమాజానికి ఇచ్చివేయాలి. అనగా పెట్టుబడిదారీ సమాజంలో వ్యక్తుల ఆస్తిగా వున్న ఉత్పత్తిసాధనాలు, ఫ్యాక్టరీలు, గనులు, యంత్రాలు, ఓడలు, రైల్వేలు వగయిరా సమాజం యొక్క సమిష్టి ఆస్తి కావాలి" అంటూ సమాజంలోని ప్రతిదీ సమాజపరం కావాలి, ఏ ఒక్కరి సొంతం కాకూడదని ఎమిలీ బరన్సు అంటున్నారు. [59]సమిష్టి వ్యవసాయంవల్ల, సమిష్టి వుత్పత్తి సాధ్యం అవుతుంది. అలా అయినపుడు వుత్పత్తిమీద సమాజానికంతటికీ అధికారం వుంటుంది. దీన్నే సోషలిస్టు సమాజం లేక సమసమాజం అని పిలుస్తాం. ఆలా సమాజం పరం అయిన వుత్పత్తి, ఎవడికి తగ్గంత వాడు తీసుకోవచ్చు. ఇందులో పంచుకోవాల్సిన అవసరంలేదు. ఏదయినా పరిమితంగా వుండి, మంది ఎక్కువయితే పంచాల్సిన అవసరం వస్తుంది. అలాగాక ఎవరి కెంత కావాలో అంత తీసుకొనేందుకు తగ్గంత వుంటే పంపకానికి అవసరమే లేదు. ప్రతి ఒక్కడు సమాజంకోసం పనిచేస్తుంటాడు. కావాల్సింది తీసు కొంటుంటాడు. ప్రతివాడు తన శక్తికొలదీ పనిచేయాలి. అవసరమైనంత అనుభవించాలి అన్నది సమసమాజ ముఖ్య లక్షణం.

ఈ లక్షణాన్ని దృష్టిలో పెట్టుకొని అరసం కవులు కూడా కవిత లల్లారు. అయితే ఈ సమసమాజం భారత దేశానికి ఎండమావి. కనబడేటివి అతివృష్టి, అనావృష్టి ప్రదేశాలు. తద్వారా ఎక్కడ చూసినా క్షామం, ఆకలి విలయ తాండవం. 'సమసమాజం' అయితే సామాన్యమానవుడు ఆకలి చావు

౦కి "గురికావల్సిన అవసరం వుండదు కదా అన్న ఆశ. ఆ ఆశాజ్యోతి కవుల్ని ప్రేరేపించింది.

సోమసుందర్

[60]"వృద్ధ జగతి సమాధిపై సమధర్మం ప్రభవించును
నిద్దుర చీకటి వెలుపల వేకువ మెళకువ పుట్టును"

అన్న ఆశాభావాన్ని వ్యక్తం చేయడంతో బాటు

[61]ఆకలి వేస్తోందమ్మా
అన్నం పెట్టమ్మా
స్వర్ణారుణా
సస్యశ్యామల మగు
ఈ జగతిని, దరిద్రమున,
ఆకలితో, చావలేను

అని ఆక్రోశించడం కూడా కనబడుతుంది.

## ఉద్యమదాడుల తర్వాతి కవిత్వం

ఈ సమయంలో చెదురు మదురుగా వున్న అరసం బలాన్ని పుంజు కొంది. కేవలం మార్క్సిజాన్ని నమ్మేవాళ్లేగాక, కొంతమంది భావ కవులు, సాంప్రదాయాన్ని అనుసరిస్తూ కరడు గట్టిన భావాలు గలవాళ్లూ, యువకులు- ఒకరేమిటి కలం పట్టిన ప్రతి ఒక్కడూ- ఒకరకంగా- అభ్యుదయ వేదికని అలంకరించారు. [62]దేవులపల్లి కృష్ణశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ కూడా అరసం సభల్లో పాల్గొంటూ వుండే వారంటే దీని ప్రాచుర్యం ఎంత వరకు విస్తరించిందో తెల్సుకోగలం. అయితే జ్వాలాముఖి అన్నట్టు [63].....ఆనాటి అభ్యుదయ సాహిత్యోద్యమంలో నానా గోత్రీకులు చేరడం మూలాన అది ధర్మ సత్రమే అయింది కాని, ప్రజల సాహిత్య వేదికగా మారి వర్గ రాజకీయాల్ని, నిర్విరామంగా సాహిత్యీకరించడం జరగలేదు." అరసం, చదలవాడపిచ్చయ లాంటి వారి కార్యనిర్వాహకత్వంలో చురుకుగా కొంత కాలం పని చేసింది. 1955 లో కారణాలు ఏమయినా-1952 లో ఆంధ్రలో అత్యధిక మెజారిటీతో గెల్చిన-కమ్యూనిస్టుపార్టీ, చిత్తుగా వోడిపోయింది. ఇది [64]తెలుగు కవిత్వం

మీద ఒక పరోక్ష ప్రభావాన్ని చూపెట్టింది. 1956 లో ఆంధ్రప్రజల ఆశాజ్యోతి విశాలాంధ్ర [65]వచ్చింది. ఇంతటితో వుద్యమదాడులు వెనకబడ్డాయి. అంటే స్వాతంత్ర్యం వచ్చిన మొదటి నాళ్లలోని ఆవేశాలూ, అలజడులూ అణిగి పొయ్యాయి. సంఘ పరిస్థితుల వల్ల చైతన్యాన్ని పొందుతూ వున్న అరసం కవులు కూడా, తమ కవిత్వంలో ఉద్యమ ప్రోత్సాహ రచనల్నీ, మార్క్సిజం సిద్ధాంత ప్రాతిపదికల్నీ ఏకరువు పెట్టడం మాని, సంఘ పరిస్థితుల్ని పరిశీలించ సాగారు. మధ్యతరగతి కుటుంబీకుడు కవితా నాయకుడయ్యాడు. శ్రీశ్రీ, నారాయణబాబు, పతాభిల్లో వున్న భిక్షగాడు, నిరుపేద, శ్రామికుడు. జెంటిల్‌మన్-లు ఇక్కడికి వచ్చేటప్పటికి 'రూపాయీ నోట్లో' తలదూరిచి, జీవితాన్ని వెళ్ళబోస్తూన్న మధ్యతరగతి జీవి 'అయ్యాడు. [66]ఎస్జీవో' కవిత్వ నాయకుడయ్యాడు. అరసం మాత్రం వుండింది—కాని పేరుకు మాత్రమే. కవిత్వ రచనలో మార్పు స్పష్టంగా కన్పడ సాగింది.

[67]"ఆఫీసులు ఆవలించిన పిమ్మట
కార్ఖానాలు రగ్గు కప్పుకొన్న తరువాత
పట్టపగ్గాలు లేని బైసికిళ్ళు
మతి చలించిన మోటారు సైకిళ్ళు
పట్టాలతో చెట్ట పట్టాలు వేసుకొన్న ట్రాంబళ్ళు
కార్లు కాళ్ళు పోటెక్కిన ఆటో రిక్షాలు
పట్టణంలో పరిశ్రమించే వాళ్ళను
వలపు సోచని మెదళ్ళను నిండని నోళ్ళను
అలసి పోయిన కళ్ళను వాళ్ళను వీళ్ళను
భద్రంగా యిళ్ళకి మోసుకొచ్చిన పిమ్మట
వాళ్ళ మెదళ్ళ నోళ్ళ కళ్ల కన్నీళ్లను
కావ్యంగా శ్రావ్యంగా ఆలపిస్తా"

అంటూ ఆరుద్ర తన కావ్యానికి ఎస్జీవోని నాయకుణ్ణి చేశారు. [67]'మేజాల భూజముల మేదిని లోంచి / చితాల చీటాల చిట్టడవిలోంచి / రొప్పుకొని, రోజుకొని, రోజెల్ల గడిపి, ఆయాసంగా బయటపడే క్లార్కు సూర్యారావు, సినీవాలిలో ఒక కావ్య నాయకుడు.

[67]"క్లార్కు సూర్యారావు అక్కడేగాని
కోర్కెల ఊబిలో కూరుకు పోయె"

అంతకు మించి చేసేది లేదు. చేయడానికి వీల్లేదు. ఎన్నో కోరికలున్నాయి. తీరేదారే లేదు. కలలు తప్ప. కలలుకనడం ఎన్జీవో సొత్తు అన్నంత వరకు సమాజం తీసుకొచ్చింది. కలతోనే తన వాళ్లందరికీ కావాల్సింది చేకూర్చు తాడు ఈ సూర్యారావు.

ఇంకో వుద్యోగి [67]'ఇంక్రిమెంటు ఇవ్వగానే పెళ్ళి చేసుకొందాం" అంత వరకు కల్సుకుంటూవుందా మంటాడు-తన ప్రేయసితో

[68]పంచదారలేదు
పాలడబ్బాలేదు
బొగ్గులేవు-రాత్రికి
రగ్గుల్లేవు'

అన్న మాటలు ఎన్జీవో కోటేశ్వరరావుకి పాతమాటలయిపొయ్యాయి. భార్యామణి తాపీగా నడిచి వచ్చి ఇలా ఒప్పచెప్పినా, వినికూడా కదలకుండా గొంగళిపురుగు కోటేశ్వరరావు 'సగం సగం తిన్న కలల్ని నెమరేస్తూ' నిద్రపోతాడు.

[68]రాత్రి రెండో ఆట సినిమాచూసి
రత్తమ్మ ఇంటిముందాగిన రిక్షాలోంచి
దిగిన జరీ కండువా పెద్దపులి జేబులోంచి పడిన
పర్సుతీసి జాగ్రత్త పెట్టి
అక్కడే వెయిట్ చేసి
తిరిగి ధోవతిని సరిచేసుకొంటూ తూలుతూవచ్చే
పెద్దపులి చేతికి యిచ్చి
"థాంక్యూ" అనే పదాన్ని సంపాదించుకొని, సంతోషించుకొని,

నీతిగా నిజాయితీగా బతికినా, ఏమీలేని వీరేశ్వరరావు మరో హీరో ఎన్జీవో.

'ఆఫీసులోకి ఆఫీసరు వస్తూనే గబగబా లేవడం, సెల్యూట్ చేయడం, ఆకలేస్తే చకచకా రాయడం, తోచకపోతే ప్యాంటులోని సెకండ్ హ్యాండ్ సిగరెట్టుముక్కల్ని తీసి తాగడం,[౬౬]మధ్యతరగతి క్లర్కు వీరేశ్వరరావు పని.

'బియ్యం బ్లాక్ మార్కెట్‌లో అమ్ముడు పోతున్నా, థియేటర్లో కొత్త సినిమా రిలీజ్ అవుతున్నా, రేడియోలో శ్రావ్యంగా పాటలు వినిపిస్తున్నా, ఖరీదైన కార్లు ఊపిరాడకుండా రోడ్లలో తిరుగుతున్నా, ఎన్నికల్లో నెగ్గినవాడి వూరేగింపు కళ్లకు మిరుమిట్లు గొల్పుతూ వున్నా, వీనులుండి వినక, కళ్ళుండి చూడక నిటార్నా నేరుగా యోగీశ్వరుడిలా నడుస్తూంటాడు'-మరో వుద్యోగి [౬౭] జోగీశ్వరరావు.

[౬౮]"రసహీనమైన తమ జీవితాన్ని నివాళించి
నీడల మాటున పీడకలల చాటున నీరసంగా నుంచుని
చనిపోయిన కోర్కెల్ని పాతిపెట్టిన శ్మశానాలదాటుకువి
.... .... .... .... .... ....
యౌవనంలో వృద్ధాప్యాన్ని తగుల్చుకుని
భయాల చాటున ఏడుపు కొండల మాటున
గుమాస్తాలు, టీచర్లు చిన్న చిన్న సంసారులు"

లక్షలు లక్షలుగా వున్నారు. వీళ్ళంతా కవిత్వంలో నాయకులయ్యారు. వీళ్లంతా సమాజ ప్రతినిధులు. ఒక్కోసారికవులు వీళ్లని చూసి నిరాశవైపుకి కూడా మొగ్గారు.

[౬౯]'దరిద్రం సముద్రంలో వేదనల తెరచాపలెత్తి
ప్రయాణించే జీవన నౌకలకి మృత్యువే లైట్‌హౌస్'

అని డీలా పడిపోయ్యారు. అయితే అన్ని వేళలా ఇలాంటి గమ్యస్థానాన్నే కోరలేదు. ఏదో కొంత ఆశ మినుకు మినుకు మంటుంది. కనీసం కలలన్నా కందాం అన్న దృష్టి కన్పడుతుంది. తిలక్

[69]"కొంచెం సేపు స్వప్నంలోకి
గోరువంకల రెక్కలతో
ఎగిరిపోదా మన్సీ మరచి
అబద్ధాన్ని ఆశ్రయించిన సుఖం
నిజాన్ని నిరూపించే నరకం
కన్న వెయ్యి రెట్లు నయం
కల ఎప్పుడూ మనిషికి బలం
మిథ్యాజీవన రథ్యలలో
స్వప్నం ఒక సుందర తనుమధ్య" అంటారు.

1960 లో ప్రపంచ ప్రసిద్ధిగాంచిన 'మాస్కో మహాసభ' జరిగింది. అప్పటికే ఇండియా, చైనాలకి మనస్పర్థలు తలచూపుతూ వుండేవి. అవి 1962 లో చైనా దండయాత్రకు దారితీశాయి. భారతకమ్యూనిస్టుపార్టీ (సిపిఐ) చైనాతో స్పర్థించింది. మాస్కో సమ్మేళనంలో అజెండాని ఏకగ్రీవంగా ఒప్పుకొన్నా, అది తాత్కాలికమే. కమ్యూనిస్ట్‌పార్టీ ఇండియాలోని రాజకీయ వుద్యమాల్ని బాగా పరిశీలించడం వల్లా, చైనా ఇండియాపై దండెత్తి రావడం వల్లా, 1962 ఏప్రిల్ విజయవాడలో జరిగిన ఆరవ మహాసభలో కమ్యూనిస్ట్ పార్టీలో చీలిక [70]అనివార్యమైంది. ఈ చీలికతో అరసంలో కూడా భిన్నాభిప్రాయాలు చెలరేగాయి. ఇంతకు మునుపు అరసంతో చేతులు కలిపిన భిన్న అభిప్రాయాల వారూ, భిన్న వుద్యమాల వారు కొంతమంది ఈ పరిస్థితిలో జాతీయత, దేశీయత కవిత్వానికి కావాలన్నారు. కాదు మార్క్సిజం అనుసరించడమే సరియైన దారి అన్నారు మరికొంతమంది. అలాంటి రెండు వర్గాలు అరసంలో ఏర్పడ్డాయి. [71]"చారిత్రక అవసరాల రంగస్థలం మీద అభ్యుదయ కవులు తమ పాత్ర నిర్వహించి side curtain లోకి వెళ్ళిపోయారు ఆధునిక కవులు కొందరు అడుగుపెట్టడానికి మొహమాట పడుతున్నారు. అడుగుపెట్టిన వాళ్ళలో కొందరి కనుభవం తక్కువ. ఉబలాటం ఎక్కువ. మరికొందరికి Stage fear ;ఒద్దికలు (rehearsals) లేని ప్రదర్శనం"-ఆపరిస్థితుల్లో ఆరుద్ర గారి అవగాహన అది.

[72]"అభ్యుదయ కవిత్వం పీడావిరగడైందని కలలు గన్న పెద్దన్నల కలల్ని కల్లలుగా జేసింది, 'విషాదభారత' కావ్యావతరణం" అంటూ 'విషాద భారతం' రెండో ముద్రణలో 'కృతజ్ఞత' పలుకుల్లో కావ్యకర్త సి. విజయ లక్ష్మి గారన్నారు. అరసంలోని రెండో వర్గం-మార్క్సిజం అనుసరణీ కావాలన్న వర్గం-నించి వచ్చారు విజయలక్ష్మి. [73]"ప్రగతి శక్తులు చీలిపోయినా అందులోని ఒకవర్గంలో కవులు రానున్న ఉపద్రవాన్ని పసికట్టారు. విషాద భావాన్ని కళ్ళారా చూశారు........ప్రగతి శక్తులు మళ్ళీ 'కారుచీకట్లలో కాంతి కిరణాల్ని చూడకలిగాయి" అన్న ఆరుద్ర మాటలు, [74]ఆత్మద్రోహానికి ఆహుతైపోయిన అభ్యుదయ సాహితీ పతాకను తిరిగి ఆధునికాంధ్ర సాహితీ గగన వీధుల్లో ఎగురవేసే సత్సంకల్పముతోనూ, వర్తమాన భారత ప్రజాతంత్రంలోని చీకటి వెలుగులపై టార్చిలైటువేసి ఆ కఠోర సత్యాలను చేతనైనంతవరకు సామాన్యపాఠకుల ముందు పెట్టే ఉద్దేశంతోనూ విషాద భారత కావ్యావతరణం జరిగింది." అన్న రామిరెడ్డి మాటలు అరసంలోని రెండోవర్గాన్ని గురించి చెప్పేవే.

సి. విజయలక్ష్మి, దిగంబరకవులూ దాదాపు ఒకే కాలంలో కారాలు మిరియాలు నూరుతూ వచ్చారు. 'విషాదభారతం' 1965 జూలైలో మొదటి ప్రచురణ పొందింది. దిగంబరకవుల మొదటి సంపుటం 1965 మే నెలలో ప్రచురింపబడ్డది. ఇరువురికీ కొన్ని సామ్యాలున్నా, ఇద్దరిదీ చెరోబాట. విషాద భారతం, కారుచీకటిలో కాంతిరేఖ-విజయలక్ష్మి కృతులు; వీటిలో సామాజిక చైతన్య ప్రతిబింబం కనబడుతుంది. ఆ ప్రతిబింబం లేంది కవితగాక మరేమైనా కావొచ్చు. ఆ సత్యాన్ని తెల్సుకొన్న కవి కనుక

[75]"మదోన్మత్త నితాంత నిరంకుశాధికారంతో
సూది మోపినంత నేలనైనా ఇవ్వని రారాజులునాడుంటే
వేలాది వేల ఎకరాలు భూమాతను
తమ ఉంపుడుకత్తెను జేసుకొని
గంజి దాగడానికైనా గతిలేని కోట్లాది జనతాసందోహం కడుపులు
నిలువునా మాడ్చేసే భూస్వాములూ బహద్దర్లూ నేడున్నారు"

అని చెప్పగల్గారు. కవి ఉబుసుపోకకి కవితని రాసుకోవడంగాక సంఘ పరిస్థితుల్ని, సాధకబాధకాల్ని ప్రతిబింబించాలి.

[75]'ప్రతీప శక్తుల్ని చెండాడి ప్రగతిని పరిరక్షించేందుకోసం
ప్రళయరుద్రుని లాంటి నరుడు తెరుస్తాడు కవిత్వత్రినేత్రం'

అనడం [75]"శోకమే శ్లోకమైనట్టు బాధే కవిత్వానికి పర్యాయపదం" అనడం వల్ల కవిదృష్టి అర్థం అవుతుంది. ఇది యాదృచ్ఛికం కాదు. అరసం మొదటి తరం కవుల్లోని సాంఘిక చైతన్యం మధ్యలో జావగారి పొయ్యింది. అది తిరిగీ ఈ రూపంలో సరికొత్త రూపాన్ని సంతరించుకొంది. 'బాధ' తన బాధకాదు. సంఘపు బాధ. 'విషాద భారతం' పూర్తిగా ఎన్నికల రంగానికి సంబంధించింది.

'విషాదభారతం'కి ప్రాణాగ్ని జోడిస్తూ రమణారెడ్డిగారు [76]"ఈ కావ్యాన్ని చదువుతూవుంటే' నాదేశం, నాకాలం నాకు కళ్ళకు కట్టినట్లయింది, నామనుషులు నాతో మాట్లాడుతున్నట్లనిపించింది. కావ్యకర్త తాను కరిగారు. నన్ను కరిగించారు" అన్నారు.

విజయలక్ష్మిగారి మరో కావ్యం 'కారుచీకటిలో కాంతిరేఖ' సంఘంలోని అనేక విషయాల మీద ధ్వజం ఎత్తింది. వేశ్యలు సంఘానికి చీడపురుగులు. సందేహంలేదు. కాని వాళ్ళ వృత్తిని నేరుగా ఈసడించే దానికన్నా దానికి కారకులెవరు అన్న ఆలోచన అవసరం. వాళ్లెందుకు పడుపువృత్తిని స్వీకరించాల్సివచ్చిందో "శోకంలో అశోకనిలయం" అన్న కవిత తెల్పుతూంది-

[77]"అమ్మలేని వాళ్ళూ, అయ్యలేని వాళ్ళూ
దిక్కులేని వాళ్ళూ, కుక్కబతుకు వాళ్ళూ
కట్నం డబ్బులు పిగలక, పెళ్ళిగాక
ఉద్రేకం పట్టలేక వూళ్ళకెక్కినాళ్ళూ
విధవలయి వెధవల్తో పురికెత్తిన వాళ్ళూ
అమ్మ అయ్య ఎవరో తెలియని కూతుళ్లు
ఎదిగినదానికి పెళ్ళిని తలపెట్టని దౌర్భాగ్యుల చెల్లెళ్ళూ
అత్తమామల పోరుకు అయ్యగార పొగరుకూ

తాళలేక, నుయ్యో గొయ్యో చేతగాక
కడుపుకొరకు పడుపువృత్తి చేపట్టిన కోడళ్ళు
కోటి కోటి హేతువులచే కులంలేని భోగంవాళ్లూ"-

ఒకసారి లెనిన్ క్రామేడ్స్‌ని ఒక మహాసభలో సంబోధిస్తూ, ప్రతి కవినీ ప్రజల దగ్గరికి వెళ్ళమంటాడు. వారి ప్రతి పనినీ, ప్రతి కదలికనీ, ప్రతి మాటనీ సూక్ష్మంగా పరిశీలించమంటాడు. అలా పరిశీలన చేసిందాన్నే కావ్యోపయోగి చేయమంటాడు. విజయలక్ష్మి ఆమాటలకి సరికొత్త రూపుగా కవితారంగంలో కనబడుతున్నారు. ఒక లాడ్జింగ్‌లో జరిగే సంభాషణని చూస్తే కవి సమాజాన్ని ఎంత నిశితంగా పరిశీలించారో తెలుస్తుంది.

[77]"నైటంతా పాతిక్కి, అద్దం రేత్రికి పది, వొక్కసారి కైదు
ఫేన్‌తో డబల్‌రూమ్ పోరు, లేకుండా చింగిల్‌రూమ్ రెండు
'పాసింజరొచ్చాడు, పియ్ రండి'
'సైమెంత ? తెలీదు. అమ్మానాన్నా ? ఎవరూ లేదు
'ఏం కులం ?' ఖేమ్మర్లం, యెందుకొచ్చావ్ ? డబ్బిచ్చావూ ?
'ఏంటీ బతుకు' ? ? యెవ్-వొచ్చినపని సక్కా చేసుకపో
ఆవిలిస్తున్నావే, రేత్రి రెండైంది, నిదరొత్తున్నాది."

అయితే ఈ కవి సమాజంలోని తోటి కవుల్ని కూడా వ్యక్తిగతంగా విమర్శించడం కనబడుతుంది. వీరి దృష్టిలో

[77]"తత్వవేత్త తరువాత లోకంలో అబ్జర్వర్
కవి కంటె ఎవడూ లేడు."

అని, దాన్ని అక్షరాలా అనుసరించిన కవి సి. విజయలక్ష్మి.

## అరసం పునరుద్ధరణ తర్వాతి కవిత్వం

ఒకపక్క దిగంబర కవులు, మరో ప్రక్క అరసంలోని విజయలక్ష్మి లాంటి ప్రగతివాద కవులూ, తెలుగు కవితా రంగంలో 1969 వరకు రాజ్యం చేశారు. ప్రముఖకవి, శ్రీశ్రీషష్టిపూర్తి జరిపించాలని సన్నాహం జరిగింది ఆ సంవత్సరం. దాన్ని అసరాగా తీసుకొని కొన్ని సదస్సులు ఏర్పాటుచేశారు. [78]"శ్రీశ్రీ షష్టిపూర్తి సంవత్సరంతో రెండు దశాబ్దాల సాహిత్య ప్రగతిని

సమీక్షించుకొనడానికి ఒక అభ్యుదయ సాహిత్యసదస్సు ఏర్పాటయింది. దీనిని సాహిత్య ఉగ్రవాదులు బాయ్‌కాట్ చేశారు". అరసంని పునరుద్ధరించాలనే వాళ్ళూ, దాన్ని త్రోసిరాజని వేరే సంస్థని ఆరంభించాలనే వాళ్లూ అని రెండు భిన్నాభిప్రాయాల వాళ్లు వుండేవాళ్లు. ఈ రెండో అభిప్రాయం గలవాళ్లనే ఆరుద్ర సాహిత్య ఉగ్రవాదులుగా చిత్రించారు. ఈ ఉగ్రవాదులు దిగంబర కవులతో, మరికొంత మంది యువకులతో కలసి 'విప్లవ రచయితల సంఘం'ని స్థాపించారు.

అరసం ని పునరుద్ధరించాలనే అభిప్రాయం గలవాళ్లు అరసం శాఖలని పునరుద్ధరించి, కొన్నికొన్ని కవితా సంకలనాల్ని ప్రకటించారు. ఇలా పునరుద్ధరింప బడ్డ అరసం ముందటి అరసం కన్నాభిన్నమైంది. సంగాల కోటేశ్వరరావు

[79]"అది అస్తమించిన తమస్సు
నేను ఉదయించిన ఉషస్సును
నేను విశ్వాంతరాళాన
విహరించే క్రాంతి
శాంతి కపోతాన్ని
ప్రపంచ పీడిత నిగళ విచ్ఛేదక
సామ్యవాద సిద్ధాంతాన్ని నేను" అని ఆ రెండిటి

మధ్యనున్న భిన్నత్వాని చెప్పారు.

"ఆంధ్ర అభ్యుదయ రచయితల సంఘం-విజయవాడ" వాళ్లు 1976 అక్టోబరులో 'ఉదయతార' ని తమ కవితా సంకలనంగా ప్రకటించారు. ఇది 1970 నవంబరు 16-20 తేదీలో జరిగిన ఆఫ్రో-ఆసియారచయితల చతుర్థ మహాసభ సందర్భంలో ప్రచురింపబడ్డట్టుగా మున్నుడిలో చెప్పుకొన్నారు. ఈ సంకలనంలో రాంభట్ల కృష్ణమూర్తి, గజ్జెల మల్లారెడ్డి, కీ. శే. బాలగంగాదర తిలక్, సోమసుందర్, సి. నారాయణరెడ్డి, నార్ల చిరంజీవి, దాశరథి, శశాంక, అనిసెట్టి, రెంటాల, కొనకళ్ళ, బొల్లిముంత, ఇంద్ర గంటి శ్రీకాంత శర్మలాంటి ప్రముఖ కవుల రచనల్తో పాటు మరికొన్ని యువకవుల రచనల్లు కూడా వున్నాయి.

"ఆధునిక రచయితల సమాఖ్య"-మద్రాసు వారు ఒక సంకలనం తెచ్చారు. పేరు క్రాంతిగీతి.[80] ఇది వేరుగా అరసంనించి గాక ఆధునిక రచయితల సమాఖ్యనించి వచ్చింది. శ్రీకాంత్, అట్లూరి చౌదరాణి, తల్లావజ్ఝల పద్మపాణి సంకలన కర్తలు. ఇది అరసం ప్రథమ సభకు అధ్యక్షత వహించిన పూజ్య తాతాజీ (తాపి ధర్మారావు) గార్కి అంకితం చేయబడ్డది. 89వ జన్మదినోత్సవ కానుకగా సమర్పింపబడ్డది. [80]"కొన్నాళ్ల క్రితం కుళ్ళి గబ్బుకొట్టే కుసంస్కార సాహిత్యం. తుపాకి గొట్టపు కుహనావిప్లవ సాహిత్యమూ, ముతాకట్టి అభ్యుదయ సాహిత్యోద్యమం పైని దాడి చెయ్యగా ప్రాపకాల ద్వారా అర్హతకు మించిన కీర్తి, ధనం సంపాదించుకొని, విపరీతంగా అహంకారాన్ని, కుళ్లుబోతుతనాన్ని పెంచుకున్న కొద్దిమంది అభ్యుదయ వేషధారులూ, ఆషాఢభూతులూ అభ్యుదయ సాహిత్యోద్యమాన్ని విచ్ఛిన్నం చేయడానికి శ్రీరంగనీతులు వల్లిస్తోన్న ఈ తరుణంలో సంయమనం, సమ్యక్ దృష్టి, అచంచలమైన అభ్యుదయ దృక్పథమూగల తాతాజీ సారస్వత సేవ ఆదర్శంగా, ఉత్తేజనంగా వుండ దగ్గవి." అని ఆధునిక రచయితల సమాఖ్య ఆ పుస్తకంలో కోరింది. ఈ సంకలనంలో తుమ్మల వెంకటరామయ్య, డా. సి. నారాయణరెడ్డి, ఏల్చూరి సుబ్రహ్మణ్యం, గజ్జెల మల్లారెడ్డి, శ్రీకాంత్, కె. రాజేశ్వరరావు, ఇంద్రగంటి శ్రీకాంత శర్మ కవితల్తో బాటు మిగతా కవుల కవితలు కూడా ఉన్నాయి.

[81]మద మత్తుల దురాగతాన్ని చూసినపుడు
రగిలిన యువకులు సాయుధులై బలియైనప్పుడు
వాళ్లది పెడదోవని తెలిసినా చిత్తశుద్ధికి అంజలిస్తాను"

అంటూ విప్లవ కవుల దమ్ముని మెచ్చుకొంటూనే, వాళ్లనుసరించిన దారిని నిరసిస్తూ వీళ్ళు కవిత అల్లారు.

[82]"దిగ్దిగంతముల వ్యాపించేది
నవరసాలతో నింపేసేది
తమస్సు నిండిన జీవితాలలో
ఉషస్సు మెండుగ వెదజల్లేది

రాతి గుండెలను కరిగించేది
ప్రకృతినంతా ఊయలలూపే
విచిత్ర నాదం"

**కవితకి కావాలన్నారు వీళ్లు.**

అరసం కవితా సంకలనాల్లో పేర్కొనదగ్గ మరో సంకలనం హైదరాబాదు శాఖ వారిది, అలజడి. [83]దానిలో

[83]"సమాజం మార్చాలన్న విషయంలో నేటి యువతరం రాజీలేని పోరాటం సాగించడానికి సిద్ధపడింది శ్రమశక్తిని దోచే సంఘ వ్యతిరేక శక్తులపై ఎట్టి మినహాయింపులూ లేకుండా శ్రామిక జన పక్షపాతంతో నేటి యువత కలం కత్తి పట్టింది. భూ నభోంతరాలు దద్దరిల్లేలా-పెను నిద్దుర మత్తు వదిలేలా యువత తన కోటి కోటి కంఠాల నెత్తి గర్జిస్తోంది " అంటూ "నేడు ప్రసిద్ధులైన కవులు పాతిక సంవత్సరాల క్రితం తాము రాసిన కవితల కన్నా ఈ సంకలనం లోని కవితలెంతో మిన్న. ఇందుకు సమాజంలో వచ్చిన మార్పులే కారణమవచ్చు, మరేవో కావచ్చు." అని అంటున్నారు.

[84]'నిరంతరం శ్రమిస్తూ
నెత్తుర్ని రూపాయ బిళ్లలుగా మార్చి
యజమానుల ఖజానాలు నింపే
నిర్భాగ్యుల శ్రమజీవుల
నివురు గప్పిన
నిప్పు గుండెల్ని'. చూస్తూ,

[84]'(అ) పుట్టిన బిడ్డలకు
పట్టెడన్నం పెట్టలేక
ఉరిపోసుకు చస్తున్న
ఉద్యోగుల ఉదంతాలు" వింటూ,

[84](అ) అర్థముతో డిగ్రీలు కొన్న "అమేధావులు"
విత్తాన్ని, అత్తసొత్తులా అనుభవించే "వినాయకులు"

అధికార మదాంధుల కీర్తించే వస్తాదు వందిమాగధులు
ఆస్థాన రబ్బరు స్టాంపు నట, గాయక "విషముఖులు"
తమ చుట్టూ ఒక పరిధి నియమించుకొని
పని ఉన్నా లేక పోయినా, సమాజాన్ని
లేని సుందరంగా చిత్రించుకొని

కళ్లను చూచి, చూడనట్టూరుకునే "విచిత్రకారులు" ని ఈసడించుకొంటూ, సంఘ విద్రోహకులకీ స్వార్థ రాజకీయులకీ, సకల రాజలాంఛనాల్తో, సామాన్యుల కన్నీటిచే పాదాభిషేకం చేయిస్తూ

[81](ఇ) దగా చేసిన దారిద్ర్యంతో
దస్తావేజులు వ్రాయించుకొని
సుఖాన్ని వడ్డీగా దోచుకొంటున్న
ఆసాముల
వ్యాపారుల
గుండెల గుస-గుసల ఉదంతాలు వింటూ

ఈ కవులు రచనలు జేశారు.

ఈ కోవలోకి వచ్చే మరో సంకలనం [85]'ఎర్రపూలు, కృష్ణాజిల్లా అభ్యుదయ రచయితల సంఘం-విజయవాడ వాళ్ళది. సంకలన కర్త గజ్జెల మల్లారెడ్డి. ఇందులో పురిపండా అప్పలస్వామి, తుమ్మల, డా. సి. నారాయణరెడ్డి, రాంభట్ల కృష్ణమూర్తి, గజ్జెల మల్లారెడ్డి, కె. రాజేశ్వరరావు లాంటి ప్రముఖ కవుల్తో బాటు యువకవుల రచనలు కూడా వున్నాయి.

[85](అ) ఆరుకాలం రెక్కలు ముక్కలుగా కష్టించే కర్షకుల్ని, కాయమమ్ముకొని భూమందుల కింద హేయమైన బ్రతుకు బ్రతికి, నీరుపోసి నారుపెట్టి పుడమితల్లి పండించిన కూలి అన్నల్ని,

[85] (అ) సంక్రాంతి వొచ్చెనని
సంబరం మనకేది
పండ గందరి పాలు
పస్తులే మనపాలు

పున్నోళ్ళ పండగిది ఓరన్నా

అంటూ నిరాశా నిస్పృహల్ని వూపిరిపోసుకొంటూ

[85] "(ఇ) "ధరిత్రి యేరె సొత్తురా శ్రమైక వీర భుక్తిరా"
అంటూ దాన్ని సంపాదించడానికి

బలాల కూడలాగరా హలాల పూన్చి సాగరా
ఇదెర్ర యేరువాకరా మరో జగత్తు కేకరా
ప్రహర్ష కర్షక ప్రజా పవిత్ర జైత్ర యాత్ర కి
ప్రశాంత జీవన ప్రభా ప్రభాత నూత్న ధాత్రికీ,

జయం అంటూ, మిగులు భూముల్ని సంపాదించేందుకి రండంటూ వుద్బోధిస్తూ వున్న రచనలు ఈ సంకలనంలో కనబడుతున్నాయి.

ఇంతవరకు ఈ అధ్యాయంలో అరసం ఆరంభంనించి ఇంతవరకు పొందిన మార్పులు, వచ్చిన కవిత్వంని గురించి వివరించబడింది.

ఈ కాలంలో అభ్యుదయ కవిత్వం మాత్రమే గాకుండా, ఇతరమైనది కూడా వచ్చింది. అయితే ఆ కవిత్వానికి భావ కవిత్వం, అభ్యుదయ కవిత్వం, దిగంబర కవిత్వం, విప్లవ కవిత్వం—లకి లాగా ఒక వుద్యమ రూపంలేదు. ఆ కవిత్వాన్ని గురించి దిఙ్మాత్రంగా పరిశీలిద్దాం.

1960 నాటికే మేరువుగా నిలబడ్డ విశ్వనాథ సత్యనారాయణ గారు శ్రీమద్రామాయణ కల్పవృక్షాన్ని' పూర్తిచేశారు. కలుగోడు అశ్వత్థరావు గారు మహాభారతాన్ని తెనుగు చేశారు. ఇంతకు ముందటి కవుల కుంతికన్నా అశ్వత్థరావు గారి కుంతి 'ఆత్మవిమర్శ' కలది. శ్రీ కృష్ణ దుర్యోధన సంవాదాల్లో ధర్మరాజునకు రాజ్యార్హత కలదని వాదించడం, కుంతీ సంవాదంలో కుంతి

తాను కర్ణుని విడనాడడం మొదలుగా గల కథని స్మరించి బాధపడినట్లు రచించడం, కేవలం కవి స్వకపోల కల్పితమే. తన కుమారుల రక్షించమని అడగవచ్చిన కుంతితో కర్ణుడు అర్జునుని తప్ప మిగిలిన వారిని దొరికినా చంపనని అభయం ఇస్తాడు. అందుకు అంగీకరిస్తుంది కుంతి. అంతలోనే కర్ణుడు కూడా తన కొడుకే గదా! పాండవులని రక్షించమని కర్ణుని కోరినట్లు, కర్ణుని రక్షించమని పాండవుల్ని ఆమె కోరలేదు. కుంతిలో ఈ అభిప్రాయం కలినటు అశ్వత్థరావు గారు రచించారు.

[26]"రణమున పుత్రులన్ దునుమరాదని యాతని కోరినట్లె యా
తనయుల 'వీని మానుడ' ని తల్లి వరంబును గోరరాదా! యా
కనికరమిందు లేదా? కని కాంచిన దానను గానా? భేదమా
జననికి మాత్రమేటి కిద జాలితివో? వివరింపు దుర్విధీ!

ఇలాంటి సంప్రదాయ ముద్రకల్గిన కావ్యాల్లో మధ్యయుగ వైభవ స్మరణకూడా కన్పడుతూంది. గతం కాలంలోని వీరుల్ని, వారి కథల్ని ఇతివృత్తంగా తీసుకొని కావ్యాలల్లడం జరిగింది. ఈ కోవలో వచ్చిన వాటిలో గాడేపల్లి కుక్కుటేశ్వరరావు గారి 'విజయముద్ర' పేర్కొనతగ్గది. ఇది ఒక వీరరస కావ్యం. గ్రీకు సామ్రాజ్యాన్ని ప్రపంచంలో ప్రతిచోటా స్థాపించాలనే ధ్యేయంతో అలెగ్జాండరు హిందూదేశానికి కూడా వస్తాడు. ఆ సమయంలో జీలం నది ఒడ్డున పురుషోత్తముడనే రాజు అతన్ని ఎదిరిస్తాడు. వాళ్ల యుద్ధం, ఆ యుద్ధానికి పూర్వరంగం ఈ కావ్యానికి ఇతివృత్తం. కల్లూరు వేంకటనారాయణ రావు గారి 'అశోక చరిత్రము', శ్రీపాద లక్ష్మీనారాయణమూర్తి గారి శ్రీ తులసీదాసు', బండ్ల సుబ్రహ్మణ్యకవి రచించిన 'ఆంధ్ర మహాభ్యుదయం', బొడ్డు ప్రకాశం గారి 'రక్షరేఖ', శ్రీ వావిలాల రామమూర్తి గారి 'ఇహ పర ములు', కె. సత్యనారాయణ గారి 'కరుణాసాగరము'-లుకొన్ని. ఆంధ్ర రాష్ట్రావతరణకి అసువులు అర్పించిన శ్రీ పొట్టి శ్రీరాములు గారి జీవితం 'ఆంధ్ర మహాభ్యుదయం' లోని ఇతివృత్తం. క్రైస్తవ మత ప్రవక్త ఏసుక్రీస్తు జీవిత గాథని వర్ణించడం 'రక్షరేఖ' లోని వస్తువు. 'ఇహపరములు' ఒక ఖండ కావ్య సంపుటి. 'ఇహపరములు', 'శాంతి సందేశము', 'రాణిసంయుక్త' అన్న మూడిటి సంకలనం అది. భారతదేశ స్వాతంత్రానానికై సాగినపోరాటంలో చివరి ఘట్టం

హిందూ మహమ్మదీయ సంఘర్షణ. అందు గాంధీగారు నిర్వహించిన పాత్రని, గురించి తెల్పేది 'శాంతి సందేశము'. జయచంద్రుని కూతురుగా, పృథ్వీరాజు చెల్లిగా ప్రతి ఒక్కరిలో రూపు కట్టుకొన్న రాణీ సంయుక్త 'రాణి సంయుక్త' అయింది. బుద్ధుని చరిత్రని వర్ణించేది 'కరుణాసాగరము'. ఈ కావ్యంలో వచ్చే 'సుగతుని' పాత్ర కరుణ పూరితం కాబట్టి కావ్యానికి 'కరుణాసాగరము' అన్న పేరు పెట్టారు. పద్యాలలో కావ్యాన్ని రసవంతంగా తీర్చిదిద్దిన వారి సరసన వీరు కూర్చునేందుకు తగ్గవారు

మధ్యయుగ వైభవస్మరణే గాక పురాణాంతర్గతమైన కొన్ని కథల్ని, పాత్రల్ని ఆధారంగా తీసుకొని రాసిన కావ్యాలు కూడా కొన్ని వున్నాయి. 'హరివంశ పురాణము' తిరిగి రాయబడ్డది. కర్త శ్రీ విశ్వనాథ నరసింహము. నరసింహదేవర ఉమా మహేశ్వరరావు 'విరాటపర్వ యక్ష గానం'ని రచించారు. ఎపుడో, నాయకయుగంలో రాయబడ్డ యక్షగానం పక్రియ తిరిగీ వెలుగు లోనికి రావడం, ఈ కావ్య ప్రత్యేకత. 'మనువు పుట్టువు, అన్న పేరుతో వారు నాగనార్య మనుచరిత్రని వివరించారు. పది హేడో శతాబ్దం లోనే అంతరించి పోయిన అచ్చతెనుగు ప్రక్రియలో రాయ బడడం కావ్యం గొప్పతనాల్లో ఒకటిగా గుర్తించొచ్చు. మహావాది వేంకటరత్నం 'విక్రమాదిత్య' అన్న గ్రంథాన్ని రచించారు. తెలుగులో కథా కావ్య ప్రక్రియ చాలా పాతది. ఆ కోవలో వచ్చింది జక్కన విక్రమార్క చరిత్ర. దాని వల్ల ప్రభావితుడై అయిదాశ్వాసాలుగా విభజించి ఒక స్వతంత్ర గ్రంథంగా దీన్ని రచించారు. సంప్రదాయ మార్గాన్ని ఆద్యంతం అనుసరిస్తూ శ్రీవిద్యా తత్వాన్ని స్వానుభవాన్ని భావించి విశ్వనాథ వేంకటేశ్వరులు 'కాళిందీ పరి ణయము', శ్రీ పరా ప్రాసాదము' అన్న కావ్యాల్ని రచించారు. బౌద్ధమత ప్రభావంచే బోడేపూడి వెంకటరావుగారు 'కళాక్షేత్రము ను రచించారు. ఛంద స్సుల్ని త్రోసి వేస్తున్న నేటి కాలంలో వాటి అంతస్తత్వాల మీద ప్రయోగం చేయడం ఇక్కడ కన్పడుతుంది. ఇదే కోవలో రాయబడ్డది మోటూరి వేంకట రావుగారి 'పద్మినీ భాస్కరము', నారు నాగనార్య "దేవయాని". చేబ్రోలు సుబ్రహ్మణ్య కవి రాసిన 'శ్రీ విజయాంకురము' భారతం ఆధారంగా రాయ బడ్డది. విరటుని కుమార్తె ఉత్తర చరిత్రని తెల్పే గ్రంథం 'శ్రీ విజయాంకు

రము. 'దేవయాని' సరేసరి. భాగవతంతార్గతమైన రుక్మిణీ కళ్యాణాన్ని ద్విపదలో రాయడం ఈ కాలంలోని మరో ప్రత్యేకత. అది శ్రీ నిష్టల సీతా రామస్వా ... రుక్మిణీ కళ్యాణము. ఋగ్వేదం లోని 5వ మండలం మంత్ర మండలము. దానిలో అర్చనానస సూక్తాలు రెండు (63-64), వాశా శ్వని సూక్తాలు పన్నెండు (52-61-81-82)60వ సూక్తంలో శ్యావాశ్వని కథాంశం సూచింప బడ్డది. దాన్ని ఆధారంగా సూరంపూడి భాస్కరరావు గారు 'మనోరమా శ్యావాశ్వము' అన్న కావ్యాన్ని రచించారు శ్యావాశ్వుడు ముని కుమారుడు. మనోరమ రాకుమారి. వీరిద్దరి వివాహం కావ్యం లోని ముఖ్య కథ. ఇందులో ఆర్యా, సంగతా, గురుహితా, రథ్యా, తరళితా ద్రుతము, పూర్వా, సీసకము — మొదలైన అరుదైన వృత్తాల్ని వాడారు, కవి. గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి మాఘుని కావ్యాన్ని 'శిశుపాల వధము' అన్న పేరుతో తెనుగు చేశారు. ఇంతకు పూర్వం వీరు 'గాథా సప్తశతి' ని ప్రాకృతం నించి అనువదించారు. ఛందస్సుతో ప్రయోగం చేస్తూ రచింపబడ్డ గ్రంథాల్లో మోటూరి వేంకటరావు గారి 'పద్మినీ భాస్కరము' కూడా వొకటి మొత్తం నాల్గు వందల పద్యాల్లో ఎనభై శీర్షికలున్నాయి. ప్రతి శీర్షికా అటు కథేతి వృత్తంతో బాటు ఆ శీర్షిక పద్యం ఛందస్సుతో సంవదించు నట్లుగా సమకూర్చ బడ్డది. పద్మినీ భాస్కరులకున్న భార్యా భర్తృభావం అన్న కవి సమయాన్ని ఆధారంగా చేసుకొని రాయబడ్డది. ఈ కాలంలో వచ్చిన కావ్యాల్లో డా. తంగిరాల వేంకట సుబ్బారావు గారు రాసిన 'హంస పదిక కూడా వుంది.

వీటితో బాటు చైతన్యం నింపుకొని కళాఖండాలుగా రూపు నిల్పుకొన్న కవితలు కూడా ఈ కాలంలో వున్నాయి. వరవరరావు — చలి నెగళ్ళు, 'జీవ' నాడి కావ్యాల కర్త. ప్రజల్తో స్నేహం చేసి, వాళ్ళ కష్టనష్టాల్లో భాగం పంచు కొని అలా అనుభవించింది, కావ్యోపయోగ్యం చేయాలనే మనస్తత్వం కల వారు. జీవనాడి, విప్లవ రచయితల సంఘంలో 1970 చేరక ముందు రాయ బడ్డ రచనల సంకలనం. కవి అన్నట్టు 1970 కి తర్వాత రాయబడి వుంటే ఎలా వుండేవో. ఆత్మాశ్రియ పరంగా వుంటుంది వీరి రచన. ఎక్కువగా మధ్య తరగతి వాళ్ళ జీవితాలు ఇతని రచనల్లో చోటు చేసుకొంటుంటాయి.

చలినెగళ్ళు, జీవనాడి రెండిటి లోనూ అతని వ్యక్తిత్వం బయట పడుతూ వుంటుంది. వరవరరావు అభ్యుదయవాది. అభ్యుదయ కవి. 'జీవనాడి'లో తను పొందే మార్పు స్ఫుటంగా కన్పడుతుంది. ఫలించే విధానం స్పష్టంగా కన్పడదు. సంఘం ఎందుకు ఇలా మారిందో తెల్సు. దానికి కారకులెవరో తెల్సు. దాన్ని బాగు చేసేందుకు ఏం చెయ్యాలి? అన్న విషయంలో ఒక తడబాటు, అంతలోనే ఒక నిశ్చయం ఈ కవితా సంకలనంలో కన్పడుతూంది. అయినా కవి అచ్చమైన ఆశాజీవి.

89 "పగటి కలల ప్రతిఫలాల్ని
రాత్రి స్వప్నంలో మాత్రమే
అనుభవిస్తే మాత్రం ఏం?
ఈ దినమంతా నెత్తుటితో చెమటతో
కళ్ళు తడిసి పోతే మాత్రం ఏం?
రేపటి వెలుగు పై విశ్వాసం వీడవి వాణ్ణి" అంటారు.

పేర్వారం జగన్నాథం, వే. నరసింహా రెడ్డి సాంఘిక చైతన్యం గల కవుల్లో పేర్కో తగ్గవారు జగన్నాథంది కార్టూన్ కవిత, వచన కవితలో గుక్క తిప్పుకో నీకుండా ఏకధాటిగా రాయగల సత్తా గలవారు. పైకి సంఘాన్ని గురించి చెప్పినట్టు వుండదు. ఏదో ఉబుసు పోకకి కవిత్వం అల్లినట్లు వుంటుంది. అయితే అంతస్స్రోతంగా సంఘానికి ప్రతిరూపం కన్పడుతుంది.

90 యముడు మునుపు టంత
ధర్మరాజు కాడు
మగడి ప్రాణాలు మళ్ళీ యివ్వడానికి
తెగించి వెంట బడితివా
యమునితో లేచి పోయిందంటుంది లోకం
అదంతా ఔట్ ఆఫ్ డేట్

యముడు యమధర్మరాజు కాడట. యముణ్ణి, భర్త ప్రాణాల కోసం వెంటా డితే లేచిపోయిందని అంటుందట లోకం, ఎంత చమత్కృతి. నేటి

సంఘంలో దేవుళ్ళు కూడా పాషాణులయ్యారన్న మాట. దయా సముద్రులు కరుణాత్ములు అయిన దేవుళ్ళే మారిపోతే ఇక మానవుడు మారక ఏం చేస్తాడు అన్న ధ్వని. స్త్రీ ఎవరితో మాట్లాడినా, ఏ విషయం మాట్లాడినా అపార్థం చేసుకొనే సంఘం. అసహ్యించుకొనే సంఘం, స్త్రీని ఒక వస్తువుగా చూసే సంఘం ఇక్కడ గర్హితం. రాక్షసులంటే పురాణాల్లో చెప్పబడ్డవారు కాదట, మనలోకం లోనే, మనతోనే నివసించే వారట.

[90] వాళ్ళు
మా తోటి వాళ్ళే
మా మనుష్యకోటిలోని వాళ్ళే
మా కన్నా నాజూకుగా కన్పిస్తారు
మధురంగా మాట్లాడుతారు
మల్లెపూల లాంటి వస్త్రాలు తప్ప
మరేవీ తొడిగే రకం కాదు

ఇలాంటి పాత్ర చిత్రణ. కనులకు కట్టినట్లు వుండే ఆ రాక్షసు 'రాజకీయ నాయకు'ల చేష్టలు చక్కగా కన్పడుతుంటాయి అతని కవితలో. అసలు ఒక్క మాట చాలు. రాజకీయ నాయకులు రాక్షసులట. దిగంబర కవులు చెప్పింది అదే. అయితే చెప్పే విధానంలో వ్యత్యాసం. ఒకరు దుందుడుకు తనం గలవారు. వేరొకరు చల్లగా సాగే మననం కలవారు. ఒకరు ఉద్రేకం మాత్రమే కలవారు. వుద్రేకాన్ని అణచుకొని శాంతంగా స్పష్టంగా చెప్పగల వారు ఒకరు. ఇద్దరిదీ ఒకే విషయం. చెప్పేతీరులో హస్తి మశకాంతరం. ఇద్దరిదీ ఒకే బాట. నడకలో వ్యత్యాసం. ఒకరిది ప్రజ్వలించే కోపం. ఇంకొరిది 'చురుక్కు' మనిపించే వ్యంగ్యం.

[91]. అర్ధాంగిలా 'వెన్నం' టే ఆకలిని భరింప లేక
అయస్కాంత కాంతవంటి అవినీతిని వరింప లేక
మోపులై తూపులై వచ్చే ఆపదల వారింప లేక
బ్రతుకు బాటలోన పడిన గతుకుల పూరింప లేక

జీవఫలం చేదు రసం తాగేవేందుకు చేవలేక
చావలేక, మునుముందుకు పోవలేక
ఊత లేక, చేతగాక, సతమత మవుతా వెందుకు
నే నున్నా నిక, అన్నా పద ముందుకు
డగా పడిన సోదరుడా దిగులు పడకు" అని

వెన్ను తట్టే వేణుముద్దల నరసింహా రెడ్డి మరో కవి. ఇతని రచనల్లో విప్లవం అడుగడుగున కన్పడుతుంది. దాన్ని ఎలా సాధించాలో అడుగడుగున చెప్తుంటారు. ఈ జీవభారాన్ని మోయలేక నిర్వీర్యుడైన మానవుణ్ణి వెన్ను తట్టి వుత్తేజాన్ని కల్గిస్తారు.

[91] పడిన గోతిలోన పడకు
ఏడ కొడితే రావణుడు పడతాడో చూడు
పట్టు విడువకు
తుప్పు పట్టిన కత్తికి పదునుండదు
నిప్పు కణిక కెప్పుడూ చెదలుండదు
విప్లవం విహంగంలా ఎక్కణ్ణించో ఎగిరి రాదు
మన దేహంలో రక్తం ఇంకా ఇగిరి పోలేదు, పోదు
విప్లవం వసంతం వలెనే
వేయి విధాలయి ప్రభవిస్తుంది"

ఇంత కన్నా అతని మనస్తత్వాన్ని, కవితా ధ్యేయాన్ని తెల్సుకోవాలంటే సరైన దాఖలా మరొకటి లేదు.

ఈ కోవకు చెందిన మరో కవి గజ్జెల మల్లారెడ్డి. నూతన జవంతో, జీవంతో వూపే కవిత్వంతో ప్రతి అంగుళమూ వ్యాపించిన అవినీతినీ మనిషి నర నరానా వ్యాపిస్తున్న అన్కృతాన్ని తూర్పార పట్టారు మల్లారెడ్డి. [92] కమ్యూ నిజమే తనను కవిని చేసినదని నమ్మువాడు. విరివిగా వచనకవిత రాయబడు తున్న నేటి కాలంలో విప్లవ బోధని, సంఘ చైతన్యాన్ని మాత్రా బద్ధ ఛందస్సుల్లో రాయడం ఇతని ప్రత్యేకత.

ఇక ఈ కోవకే చెందిన కవులు అనేకులు వున్నారు. 1962 సంవత్సరంలో చైనా భారత దేశంపై దురాక్రమణ చేయడం వల్ల, దాన్ని గర్హిస్తూ 1963వ సంవత్సరంలో "సమర కవితా" సంకలనాలు కొన్ని వచ్చాయి. వాటిలో సంఘచైతన్యాన్ని ఆధునిక చైతన్యంగా గుర్తించి కవులు రచనలు చేశారు. బాంగ్లాదేశ్ యుద్ధంలో యాహ్యాఖాన్‌ని తదితరుల్ని తెగనాడుతూ, ముక్తి వాహిని సైనికుల్ని ఉత్తేజపరిచే గీతాలు పాడుతూ, పాకిస్తాన్ సేనలతో పోరాడి ప్రాణాలర్పించిన [93] 'పపీహా' లాంటి వీరగాయని లని స్మరిస్తూ ముజిబుర్ రహ్మాన్‌ని కీర్తిస్తూ "బంగ్లాదేశ్ కవితాంజలి "అన్న కవితా సంకలనం వచ్చింది. అలాగే రెండు వేర్పాటు వుద్యమాలు ఉవ్వెత్తుగా ఎగసి. విశాలాంధ్రని రెండుగా కోయాలని చూస్తుంటే, ఒకటిగా వుందామని 'సమైక్యవాణి" ని అభ్యుదయ రచయితల సంఘం - విజయవాడ వాళ్ళు ప్రకటించారు. ఇవి అన్నీ కూడా సాంఘిక చైతన్యాన్ని వూపిరిగా పోసుకొని వచ్చినవి.

మరోకవి సి. వి. కృష్ణారావు. వీరి దృష్టిలో అనిన వారు మురికి కొంపల్లో నివసించే బీదా బిక్కీ. వాళ్ళ జీవితం ఎలా వుందో తెలియ బరుస్తారు, కాని దానికి కారకులెవరో తానుగా చెప్పరు. అయితే పాఠకులకి తప్పక స్ఫురిస్తుంది. ఇలాంటి ధ్వని కావ్యాల్నే గొప్పవని మన ప్రాచీనాలంకారికులు చెప్పారు. 'వైతరణి' కావ్యం కవి సాంఘిక చైతన్యానికి ప్రతిబింబం. వరవరరావు [94] "స్వచ్ఛంద ప్రయోజనాన్ని అవగాహన చేసుకొన్న కవులు, ఈనాడు రాస్తున్న వాళ్ళలో, నాకు ముగ్గురే కనిపించారు," అంటూ వాళ్ళలో ఒకరుగా సి. వి. కృష్ణారావుని ఎన్నిక చేశారు. 'వైతరణి'కి ముందుమాట రాస్తూ [95] "మురికి వాడల్లో నివసించే బీదా బిక్కీ ప్రజల జీవితంలోని కఠోర సత్యాలను ప్రజల దృష్టికి తీసికొని రావడానికి, తద్వారా వ్యంగ్యంగా సంఘం చేస్తున్న మహాపరాధాన్ని స్ఫురింప చేయడానికి చేసిన ఈ ప్రయత్నం నూటికి నూరు పాళ్ళు అభ్యుదయ ప్రయత్నం" అన్నారు కుందుర్తి. 'మాదీ మీవూరే మహారాజా' అన్న గేయంలో వూరి బయట, ఇల్లు వాకిలీ లేక బ్రతుకుతున్న ఒక బాలుని ఆవేదన కన్పడుతుంది.

[96] 'మాదీ మీవూరే మహారాజ కుమారా
గోచికి పేలిక లేక

సుడిశల సంపులలో పెరిగిన
బాలురలో ఒకణ్ణి నేను

మా ముత్తాతలు ముప్పయి మందట
మరి నేడు మువ్వల గజ్జల మెలతాశ్రిళ్ళను
చూచుకొని మురిసే దిగంబరులం
మూడొందల మందిమి
ముసు పిచ్చిన జాగాలోనే
మురికిన ఈగలాగా"                ఈసురోమని వున్నా మనీ.

దానికి కారణం వ్యంగ్యం చేస్తున్నాడా బాలుడు. ఇలాంటి వ్యంగానానికి కవికి చైతన్యం, వుద్రేకం వుండాలి. అంతేకాదు, సంయమించుకోగల సంయమన శక్తి వుండాలి. ఈ శక్తి వూరికే రాదు. పరిసరాల్తో పరిచయం ఏర్పరచుకొంటే, ఏర్పరచుకున్న పరిచయం కాస్త పరిపుష్టమయితే, పరిపుష్టమయింది నిశ్చలంగా ఏకాగ్రత కల్గివుంటే - అప్పుడొస్తుంది సంయమనం. ఆ సమయంలో వచ్చేది గొప్ప కవిత, సంఘానికి పనికి వచ్చే కవిత. అందులో వుద్రేకం వుంటుంది. సంయమనం వుంటుంది. రెండిటి కలయికలో ధ్వని వ్యంజమాన మవుతుంటుంది.

ఇలా సంఘ చైతన్యం గల కవుల్తో బాటు అంతశ్చైతన్యం ప్రధానంగా గల కవులు కూడా వున్నారు. 'మనస్సుకీ, సంఘానికీ ఉన్న సంఘర్షణ' ని ప్రతిబింబించే వాళ్ళని 'సంఘ చైతన్యం గల కవులుగా, 'మనస్సుకి అంతశ్చైతన్యానికి ఉన్న సంఘర్షణ'ని ప్రతిబింబించే కవుల్ని 'అంతశ్చైతన్యం గల కవులుగా పేర్కొనవచ్చు.[97] చివరి కవులు సంఘ పరివర్తనం కన్నా ఆత్మ పరివర్తనాన్నే ఎక్కువగా కోరుకొంటారు. అంటే సంఘ పరివర్తనాన్ని కోరుకోరు అని కాదు కాని దాని మీద అంత నిఘాలేదని వీళ్ళు ఎక్కువగా ఏ సుదూర తీరాల్లోనో విహరిస్తుంటారు. భావకవులు చేసింది కూడా ఇదే. అయితే వారిది ప్రేమతత్వం, వీరిది నైరాశ్యం. ఏదో వుందనే ప్రేమ తత్వం వారిది. ఏముంది అన్న నైరాశ్యం వీరిది. ఇద్దరూ ఒక రకంగా పలాయనవాదం చిత్రగించిన వారే. సంఘం అనేక రక

ఏకాకైన ఒత్తిడులకి కుంగి పోతూంటే కవి పలాయనం చేయడం సబబేనా అన్నది సమస్య. వ్యక్తికన్నా సంఘం గొప్పది. కాబట్టి ప్రతికవీ సంఘాన్ని ప్రతిబింబింప చెయ్యాలి. అయితే సంఘం పటిష్టంగా వుండాలంటే వ్యక్తి పటిష్టంగా వుండాలి. వ్యక్తి పటిష్టంగా వుండాలంటే ఆత్మ విమర్శ వుండాలి. ఆత్మ విమర్శ చేసుకోవడం పలాయనమా? అలా అర్థం చేసుకొన్నప్పుడు ప్రతి కళా ఒక పలాయనమే. సంఘంలో అనుభవించే అనేక అనుభవాల్ని మననం చేసుకొంటాడు కవి. అంటే బాహ్య ప్రకృతిని అంతర ప్రకృతిగా మార్చుకొంటాడు. అంతర ప్రకృతిలో, కావల్సిన దానిని తగ్గ రూపంలో బయట పెట్టుతాడు ఇదే కళాకారుడైనా చేసే పని. ఉదాహరణకు - కవి వస్తువుని చూస్తాడు. వెంటనే అనేక రకాల వూహలు ఒక దానికొకటి ఒరుసు కొంటూ, ఒరవడి దిద్దుకొంటూ వుంటాయి. అంటే ప్రత్యక్ష వస్తువుని గురించి వూహలు బయలు దేర్తాయన్నమాట. ప్రత్యక్షంగా కన్పడుతూంటే దాన్ని గురించి వూహించడం లాంటి పలాయనం వుంటుందన్న మాట. ఇలాంటి పలాయనం కవికి అవసరం. ఇది లేకపోతే కవి ప్రత్యక్ష వస్తువుని యథా తథంగా చెప్తాడు తప్ప కవిత్వాన్ని జోడించలేడు. బాహ్య రూపుని చూపిస్తాడు తప్ప అంతరంగిక సౌందర్యాన్ని కన్నులకు కట్టలేడు. కాబట్టి ఇలాంటి పలాయనం కవులకు అవసరం. ఇది ఎంతవరకు అవసరం అన్న దానిలో ప్రతి ఒక్కరిలోనూ భేదం కన్పడుతూ వుంటుంది. అలా మననం చేయడంలోనే, మనోలోకంలో విహరించడంలోనే తప్ప మన లోకంలో వారికి తృప్తి లేదు.

ఇలాంటి కోవలో రచించే వాళ్ళు నేడు తెలుగు కవిత్వంలో వున్నారు. వారిలో వేగుంట మోహన ప్రసాదు ఒకరు.

> ౧౪ "కోళ్ళ అరుపులు పొగమంచుని చీల్చుకుని నాదాకా రావు
> రాత్రిలోంచి ఆబగా లాక్కున్న చీకటిని
> ఉదయపు మేఘమేదీ నా మీదికి విసిరెయ్యదు
> నా కోసం దుఃఖాలు, నానించి దు:ఖాలు
> ఏవీ నన్నంటవు కాల్చవు ఎవరికీ జవాబుదారి కాను

కోళ్ళ అరుపులు 'సంఘచైతన్యా' నికి నిదానం. కవి బాహ్యప్రకృతికి అంతర ప్రకృతికి మధ్య వున్న దాన్నే 'పొగమంచు' గా తీసుకొంటే యీ విషయం అర్థం అవుతుంది. పొగమంచు ఎలాగ అడ్డం వుందో అలాగే బాహ్య ప్రకృతులైన సంఘం తనదాకా వచ్చేందుకు ధ్యాసం అడ్డం వుందని చెప్పడం ఇక్కడ స్పష్టం. ఇకపోతే దుఃఖాలు ఇలాంటివి ఏవీ తనను అంటవు. కారణం తన ప్రకృతే వేరు కనుక.

98 'ముఖ్యంగా నన్ను ఆడక్కు
సౌఖ్య సంతోషానందోత్సాహ మహోత్సవాల సంగతి
ధ్యాన నైరాశ్య సమాధిలో ఉన్న వాణ్ణి'

అని తన కవిత్వ ధర్మాన్ని పరోక్షంగా చెప్తారు. 'సౌఖ్య సంతోషానందం' బావ కవిత్వం సొత్తు. అయితే ఆవేవీ తనకు తెలీవనడంలో కవి దృష్టి అవగతం కాగలదు. మరొకరు సంపత్కుమార.

99 ప్రత్యక్ష మానస మయ్యే అనుభవం కన్న
ఊహా స్మృతి యుగళానికే ఎందుకో జనంలో బలం" అని చెప్తుపోయే

వారు. సంపత్కుమారది మోహన ప్రసాదు లాగా కేవలం నైరాశ్యంతో కూడు కొన్న ఊహాలోకం కాదు. మంచి చెడు ఆలోచించి నడిచేలోకం. వర్తమానంలో నిలబడి భూతాన్ని అండగా తీసుకొని భవిష్యత్తుని తీర్చిదిద్దుకోవా లనడం ఇతని కిష్టం.

99 'భవిష్యదాశలతోనే బతికేవాళ్ళను బతుకనీ
గతం పరిష్వంగం లోనే కరిగేవాళ్ళను కరుగనీ
ఉభయులనూ ఊహాస్మృతులతో ఊరేగనీ" అని అంటారు.

అంతేకాదు 99 "క్షణం క్షణాని కనవరతం గతాన్ని పెంచుతూ
క్షణం క్షణం భవిష్యత్పరిధిని కుదించుతూ
ఏ మాత్రం కన్పించని వర్తమాన వలయాలను
బిగితుక్కి కల్పిస్తూ కాలం ప్రవహిస్తూ ఉన్నది.

అన్న విషయాన్ని అర్థం చేసుకొన్నవారు. సుఖ దుఃఖాల్తో కూడుకొన్న అనుభవాల్ని తన రచనల్కి వస్తువుగా గ్రహించారు.

99. 'వర్తమాన జ్ఞాన శిఖరాగ్రంపై నిటారుగా నిలబడి
భూత భవిష్యత్తుల్ని సమీక్షించటానికి మారుగా"

వాటిని విడి విడిగా చూపి వాటిని తన పరిధిలోకి తీసుకోలేదు. తన పంథాని పట్టా తప్పనీలేదు.

"చేతనావర్తం" మొదటి సంపుటం రచనల్ని, రెండో సంపుటం రచనల్ని పోల్చి చూస్తే సంపత్కుమార దృక్పథం కొంత సడలినట్లు తెలుస్తూ వుంది. మొదటి సంపుటంలోని రచనలన్నీ - కేవలం అంతశ్చైతన్యానికి లోబడ్డవే. వాటిలో వూహాలోకాల్లో విహరించటం తప్ప భూలోకం లోని విషయాల ప్రసక్తి కానరాదు. కాని రెండో సంపుటికి కొంత మ్మారారు. ఆ వూహ ఉంది; ఆవూహకి అనుభవాన్ని జోడించారు. 100'అంతర్లయం' (చేతనావర్తం)- అన్న గేయంలో ఆకాశాన్ని. మరుత్తునాకీలని వీటోపవరణం నిత్యానుస్రుత కర్మగా జీవనం రూపొందించిన జీవనాన్ని, ధరణిని తనని తాకవద్దని, తన నిర్మాణంలో పాల్గొన వద్దని అర్థిస్తారు.

100. 'నేను మళ్ళీ నిద్ర లేవదలచుకోలేదు
వ్యర్థ జీవన భాండం నెత్తికెత్తడం కుదరదు

అనీ భూలోకం నించి పలాయనం చిత్తగించి

100. నన్ను నే బాగా పరీక్షించుకొని
నేను కానిదాన్ని దులుపుకొని
నన్ను నాలో లయం కానీండి'

అనే సంపత్కుమార్ కనపడతారు, మొదటి సంపుటంలో.

100పూవుల్లోంచి పైకెగసిన వాసనలా
గాలిలో తేలిపోదామనుకొన్నాను
ప్రథమంగా దూసుకొచ్చిన కిరణంలా
సప్తవర్ణ కాంతుల్లో కలుద్దామనుకొన్నాను,
ఎగిసి పడే తరంగాలపై సొర చేపలా
రసాభిషేకం పొందుదామను కొన్నాను'

అన్న మనస్తత్వం మొదటి సంపుటం నిండా కన్పడుతుంది.

ఈ జాబితాలో వచ్చే మహాకవి సుప్రసన్న, 'ఆత్మస్పందన' వల్ల కవిత లల్లిన వారు. 'ఆవర్త విభ్రమణ' గేయంలో

[101]'ఆత్మలోని స్పందమైన చైతన్యం
అవధులు దాటి, అంతఃకరణాన దూకి
మనో బుద్ధులలో లయించి
జడములైన ఇంద్రియాల మార్గాల్లో
చేతన జ్వాల మండించిన
ఒక అవ్యక్తమైన క్షణం
ఒక ఆనంద విద్యుద్వల్లిక"

అంటారు. అదే ఆంతశ్చైతన్యం అంటే, ఆత్మ స్పందన అంటే; ఇలాంటి పరిస్థితుల్లో వచ్చినకవితలే అతని రచనలన్నీ. 'తేజోరేఖ'లో

[101]జీవితానికి దుర్వ్యాఖ్య చేయకు
చిక్కని మనస్సు యొక్క అనుభూతి దాచకు'

అంటారు. వీరి భావనలో భావ కవితాచ్ఛాయలు మిగతా వారికన్నా చాలా ప్రస్ఫుటంగా కన్పడుతుంటాయి. 'ఆనంద మోహిని'లో

[101](అ) విచ్చీ విచ్చని వసంతమున
విచ్చుకొన్న నా కన్నులకు
ఆరు ఋతువుల సరోవరము కన్న
ఆమె తనువు లావణ్యములే మిన్న' అంటారు

ఇది అచ్చంగా వర్డ్సువర్తు చెప్పిన రొమాంటిక్ లక్షణాన్ని కల్గివుంది. కవులు ఏ విషయాన్ని తీసుకొన్నా. ఎలా వర్ణించినా ప్రకృతి నించి అది విడదీయ రానిదిగా వుండాలి' అన్న భావన వర్డ్సువర్తుది. సుప్రసిద్ధ మలయాళ భావకవి కుమారన్ ఆశాన్ [102]"చింతావిష్టయాయి సీత'లో సీతచే "కృతి కళ్కు వెడుం తపస్సినాం క్షితివాసం" అని చెప్పిస్తాడు. అంటే కృతులు తపస్సు చేసేందుకు మిక్కిలి యోగ్యమైన వాసం క్షితి

వాసం (ప్రకృతి) అని అర్థం. సృజన గల ఏ రచనైన ఇలా ప్రకృతిని వదల కుండా దాని పరిసరాల్లోనే పరిభ్రమిస్తూ వుండాలని కవి కోరిక. కవి కోరికే కాదు రొమాంటిక్ లక్షణం కూడా. దీన్ని మనకవులు ఎంత వరకు వాడుకున్నా రన్నది వేరే విషయం. సుప్రసన్న మాత్రం యీ గేయంలో అచ్చం వర్డ్స్ వర్త్[103] చెప్పిన భావకవిగా కన్పడతారు. ఆరు ఋతువుల సరోవరము కన్నా అంటే ఆరు ఋతువులు ఒక దగ్గర చేరితే, ఎంత అందమో అంతటి అందం కన్నా ఆమె తనూలావణ్యం గొప్పదట. 'తనువు'ని గొప్పగా వర్ణించి వుంటే ప్రబంధ కవుల జాబితాలో తోసివేయబడి వుండే వారు కాని తనూలావణ్యాన్ని గుర్తించారు కనుక భావకవుల్లో చేరారు. సుప్రసన్న 'సమ న్వయం'ని చాలా బాగా నిర్వచించారు. [10]'అనవధి'లో

గతం గాయం వర్తమాన మపాయం
భవిష్యత్తూ హేయం అనుకొన్న చోట

ఒక్కొక్క మాటలో నుంచి
ఒక వేయి మనసుల్ని తీసి
హృదయ దర్పణల ముందు నిలబెడితే
అదరి పోయే అల్ప మనస్సుల మధ్య
ఏ ఒక్క సాధు చేతస్సుల మధ్య
ఏ మధుర గీతమె పలుక వచ్చు
ఒక జలసూత్రములా ఆ గీతి
సకల మనో వీథుల నందించి
సాగు ప్రసన్న భావనాసుస్థితి' అంటారు. అలా

వీరు 'మార్పు' కి అంటే విప్లవానికి విముఖులు మాత్రం కారు. కాకపోతే తెచ్చే విధానంలో వీరి దృక్పథం వేరు [104]'ఎదిగి పో' లో ఇలా అంటారు.

శ్మశానం లోంచే రానక్కరలేదు మార్పు
సౌందర్య నిరంతరాన్వేషణ లోంచి రావచ్చు

సంపూర్ణత కోసం, సమగ్రత కోసం మనం చేసే
తపస్సు లోంచి రావచ్చు, రమణీయ ఫలం నిశ్చయంగా.

అంతేకాదు

శాంతి లోంచి క్రాంతి
ప్రసవ పరిమళం నుండి ఫలమాధుర్యం
ఉన్న భూమిక నుండి ఉన్నత భూమికి మీదికి
అధిరోహించు నిశ్రేణిక' అన్న భావం కలవారు.

మాదిరాజు రంగారావు ఇలాంటి వారి దరికి వచ్చేవారు మాత్రమే కాదు. విశిష్టమైన స్థానం కలవారు కూడా; ఈ కవులందరూ విప్లవం పేరుతో విధ్వంసక వాదాల్ని ప్రవేశపెట్టే వారిని ఖండించారు. ప్రతి ఒక్కరు శాంతిని ప్రతిపాదించారు. అలాగే రంగారావు కూడా

[105]'విప్లవ కంఠంలో శాంతి స్వరమై ఎగసి
శ్మశాన వేదికపై ప్రాణ స్పందమై సాగి
మంచు పొరలలో వెలుగు రేకై విరిసి
నింగి సిగపైన దినమణియై వెలిగి'

శాంతిగీతంగా ఉగాదిని కదలి రమ్మంటారు. కవి అంతశ్చైతన్యం ప్రభావం వల్ల రాసేవారు. అతను అంటారు

[105](అ) 'అర్ధ రాత్రం గాలుల సవ్వడి వలె
మనో భూమినుండి స్మృతులు,'

అప్పుడప్పుడు దాగిన కవితా నిధుల్ని బయటికి పంపుతున్నాయట అయితే కేవలం మనోభూముల్లోనే వ్యవసాయం చేసే ప్రవృత్తి గలవారు కాదు; వర్తమానం లోని సంఘాన్ని కూడా వీక్షిస్తారు. గతంలోకి వెళ్లే సమస్యలేదు; అలజడి కవుల్లాగా భవిష్యత్తులో ఎగిరే ఆలోచనా లేదు.

[105](ఆ)'అంగార కణం వంటి
వర్తమానం వీక్షించకుండా

ఏలా ఊహించగలం

భవిష్యత్ సువర్ణఖాండం' అని వర్తమానంని వదలి భవిష్యత్తుని వూహించలేమంటారు. మాదిరాజు రంగారావు అంటే మినీ కవితలు జ్ఞాపకం వస్తాయి. ప్రాచీన కాలంలోని చాటువుల్లాగా మినీ కవితలు వుంటాయి. మచ్చుకు కొన్ని

[105](ఇ) అనుభూతి కాంతిని ప్రసరింప కవిత్వం .
ఆలోచనా రూపమైన మనస్సులో నభోమణి
.... .... ....
కళ్ళు రెండూ చెరువులైతే చాలదు
ఉండాలి ఎదలో ఉత్సాహం నిలిపే అగ్ని.

ఈ కాలంలో వచ్చిన కవుల్లో సమన్వయ కవులు కొందరు. [106]"ముందు చూపు కోల్పోయిన గత దృష్టిగాని. వెనుక చూపును నిరసించిన భవిష్యద్దృష్టిగాని మానవ పురోభివృద్ధికి దోహదకారులు కాలేవను అభి ప్రాయము బలపడినది. అంతర్జాతీయ రంగములోని సహజీవన విధానము, జాతీయ జీవన క్షేత్రమున నెహ్రూగారు చూపిన సమన్వయ మార్గము ఈ తరపు కవులను ప్రబలముగా ఆకర్షించినవి. తత్ఫలితముగా ఈ కాలపు నవ కవులు పల్వురు సాహిత్య రంగమున విభిన్న దృక్పథముల సమన్వయ ధోరణిని కాంక్షించిరి" అన్నారు నారాయణరెడ్డి గారు. ఆ కవులే సమన్వయ కవులుగా పిలవబడ్డారు. వీళ్ళలో దాశరథి, సోమసుందర్, విశ్వం, నారా యణ రెడ్డి, పుట్టపర్తి, దుర్గానంద్‌లతో బాటు బోయి భీమన్న, తిలక్, నూతల పాటి లాంటి వాళ్ళు కూడా కన్పడుతున్నారు.

తిలక్ ఆధునిక కవుల్లో చైతన్యం గల కవి. [107]కుందుర్తి అన్నట్లు 'తిలక్ కవిత అభ్యుదయ కవిత్వం కొన్ని పాళ్ళు, భావకవిత్వం కొన్ని పాళ్ళు కలసిన మిశ్రిమ రూపం. ఇకపోతే కవేఅన్నట్టు 'నాకు మీ సాహిత్య వివా దాలు తెలియవు. నలుగుర్ని మంచి చేసుకోవడం అంతకన్నా తెలియదు' సాహిత్య వివాదాలలో కూరుకోని మన స్తత్వం గలవారు. "నాకవిత్వం" అన్న గేయంలో తన కవితాధ్యేయాన్ని చెప్తారు.

107(అ) అగాధ బాధా పాథః పతంగాలూ
ధర్మవీరుల కృత్త రక్త నాళాలు
త్యాగ శక్తి, ప్రేమరక్తి, శాంతి సూక్తి
నా కళా కరవాల ధగద్ధగ రవాలు
నా అక్షరాలు కన్నీటి జడులలో తడిసే దయా పారావతాలు,
నా అక్షరాలు ప్రజాశక్తుల వహించే విజయ ఐరావతాలు
నా అక్షరాలు వెన్నెలలో ఆడుకొనే అందమైన ఆడపిల్లలు.

'బాధాపాథః పతంగాలు' ఆకలి బాధల్లో అలమటించే బీద జనానికి, 'త్యాగ శక్తి' దేశంకోసం, ఇంకా చెప్తే ఒక ధర్మం కోసం ప్రాణాలొడ్డిన ధర్మవీరులకీ, భావ కవుల జాడల్లో నర్తించి రక్తి కట్టించిన 'ప్రేమరక్తి' భావకవిత్వానికీ, నవ్య కవుల్లో అంతశ్చైతన్యం ప్రభావం గల వారిలాగా శాంతాన్ని ప్రబోధించేందుకు, అనుసరించేందుకు 'శాంతి సూక్తి' ని నిదానాలు (Symbols) గా తీసుకొంటే అతని కవితాధర్మం అర్థం అవుతూంది. అతని సమన్వయ తత్వం రూపు కట్టుతుం . అంతే కాదు, అతని అక్షరాలు ఒకసారి కన్నీటి జడుల్లో తడిస్తే, ఇంకోసారి ప్రజా శక్తుల్కి విజయాన్ని కోరుతాయి. మరోసారి వెన్నెలతో ఆడుకొంటాయి. అంటే సాంఘిక చైతన్యం గల అనేక కవుల్లాగా తిలక్ అక్షరాలు ఒక బాటలోనే వర్తించవు. విభిన్న దారుల్ని వెతుక్కొంటాయి. ఇదే సమన్వయం అంటే. 'కఠినోపనిషత్' లో రెండు తెగల మధ్య తనదైన దానిని వెతుక్కునేందుకు మూడోవాడు ఎలా మథన పడుతున్నాడో చెప్తున్నాడు. ఆ మూడో వాడే సమన్వయ మార్గంలోని వాడు. తిలక్ దృష్టిలో కవిత్వం.

107(ఆ) "విస్తరించాలి చైతన్య పరిధి
అగ్ని జల్లినా అమృతం కురిసినా
అందం ఆనందం దాని పరమావధి"

అందం ఆనందం కవిత్వపు పరమావధి అనడంలో అచ్చం భావకవి అయ్యారు. రొమాంటిక్ లక్షణాల్లో సద్యఃపర నిర్వృతి(immediate pleasure) ఒకటి. ఆ విషయాన్ని చెప్తూ కాలరిడ్జి (Coleridge) 'The Poet must always aim at pleasure as his specific means' (Misc. Criticism 320-1) అని అంటాడు. 108అలా కవి తన రచనల్లో ఆనం

దాన్ని దృష్టిలో పెట్టుకోవాలంటాడు. బి. ప్రసాద్ [109]"....its Criterion of literary excellence was its capacity to delight which manifested itself in more ways than one" అంటాడు సౌధ్యం మాత్రం ఆనందం, సాధనాలు రకరకాలు కావొచ్చు. ఆ విషయాన్ని దృష్టిలో పెట్టుకొనే తిలక్ అగ్నిజల్లినా, అమృతం కురిసినా అందం, ఆనందం దాని పరమావధి అన్నారు అని తెలుస్తుంది.

ఇక ఈ కాలంలో తెలుగు కవితా రంగంలో మేరువులాగా నిలబడ్డ వారు దాశరథి, నారాయణరెడ్డిలు. రామకోటి శాస్త్రిగారు [110]"...కవితా మంటపమునకు దాశరథి, బాలగంగాధర్ తిలక్, కుందుర్తి, నారాయణ రెడ్డి నలుగురును నాలుగు స్తంభములు" అన్నారు. దాశరథిని 'వరదగోదావరి'గా చిత్రించారు. నైజాం నవాబుని ఎదిరించడానికి నిదర్శనగా అగ్నిధార, రుద్ర వీణలు ఒక కోవకు చేరితే తర్వాతి మహేంద్రోదయం, పునర్నవం, అమృతాభిషేకం మరో కోవకు చేర్తాయి. ఈ మూడు ఆరుపదులు కాలం లోనే ప్రచురింపబడ్డవి. ఈ మూడూ [111]"చక్కని భావనాశక్తికీ, చతుర రచనానైపుణికి తార్కాణలుగా వున్నాయి" అంటూ నారాయణ రెడ్డి గారు కీర్తించారు. తరువాతి కాలంలో బుద్ధ జయంత్యుత్సవం సందర్భంగా 'మహాబోధి'ని రచించారు. శాంతరసంతో బాటు శృంగారం కూడా ఇందు చోటు చేసుకొంది. తథాగతుని దర్శనార్థం వచ్చే వాళ్లని వర్ణిస్తూ

[112]"ఒకతె నగ్నో రోజయుగ్మ మూటాడంగ
ప్రభువు సమక్షాన ప్రాలి మ్రొక్కు
వొకతె జారెడి చీర వొక కేల గీలించి
వేరొంటి సంజ్ఞతో పిలుచు చుండ
వొకతె శ్రోణి తలమ్ము లుబ్బి కన్పింపంగ
వెన్క పెన్కడుగులు వేసి వచ్చు
ఒకతె యూరువులపై నున్న వల్వ తొలంగ
నృత్య మాడును మేని రీతి మరచి
ఒకతె స్వామిని చుంబించునో యనంగ
పెదవులను చక్రమట్టుల పెట్టి వచ్చు

నొకతె ప్రభు కవుంగిలి సేర్చునో యనంగ
బాహువులు సాచి పైపైని ప్రాల వమ్ము"

అంటూ ప్రబంధ కవుల పక్క నీతాన్ని వేసుకొంటారు. ఇతని మరో సంపుటి 'కవితా పుష్పకం' (1966) తత్పూర్వ కవితల కన్నా నవ్యత కలది. చాలా కాలం తర్వాత 1973 లో 'తిమిరంతో సమరం'ని ప్రచురించారు.

[13]'పచ్చ నోట్ల నెదిరించాలి
కత్తి పోట్ల నెదిరించాలి
ప్రజల వోట్లను గెలిపించాలి
ప్రజాస్వామ్య, సామ్యవాద
ధ్వజం ఎగుర గలగాలి'

అన్న ఆశతో వచ్చింది ఈ కవితా సంకలనం.

వస్తువు, భావం, రచనలో మార్పుని స్పష్టంగా చూపిన కవి నారాయణ రెడ్డి. ఉద్యమాల్ని వదిలేస్తే, ఇంత విస్తారంగా తెలుగు కవితా రంగంలో ఎగర కల్గిన కవి మరొకడు కానరాడు. అసలు సిసలైన సమన్వయ కవిగానే నారాయణ రెడ్డి కన్పడతారు. నాగార్జున సాగరం, కర్పూర వసంత రాయలు, విశ్వనాథనాయకుడు అతని గేయ కథా కావ్యాల్లో బహుళ ప్రచారం పొందాయి. గేయ కవిగా, రస కవిగా నారాయణరెడ్డిని చూపించాయి ఆ కావ్యాలు. [11]'బౌద్ధమత ప్రచారం జరిగే కాలంలో బుద్ధుని కథల్ని చెప్పేందుకు, శిల్పాల్లో చెక్కేందుకు నియమించబడ్డ శాంతిశ్రీ, పద్మదేవుల ప్రేమ, తత్పర్యవసానం — నాగార్జునసాగరం లోని కథ. కర్పూర వసంత రాయలు లోని ఇతివృత్తం పధ్నాలుగో శతాబ్దిలో ఆంధ్రదేశాన్ని పాలించిన కుమార గిరిరెడ్డి (1386-1402), అతని ఆస్థాన నర్తకి లకుమాదేవిల ప్రణయాను రాగం. విశ్వనాథనాయకుడు 'మధుర'లో నాయక రాజ్య స్థాపకుడు. తండ్రి నాగమనాయని ఎదిరించి, ఓడించి రాజభక్తిని నిరూపించుకోవడం ఇందలి కథ. ఈ మూడూ మూడు రసాలకి ఆలంబనాలు. 'మంటలూ మానవుడు' వరకు చాలా కావ్యాల్ని రాశారు. అవి అన్నీ గేయాల్లోనో, గేయ వాసనల్తోనో రాయబడ్డవి; 'మంటలూ మానవుడు' పూర్తిగా వచన కవితలో రాయబడ్డ

రచన. ఒకటి కవిత్వాన్ని నిర్ణయించడంలో విశిష్టమైందీ, ఒక కవి రచనని సరియైన దారిలోకి తిప్పిందీ, అటూ ఇటూ పూగుతున్న కవి భావానికి, కవితా వాహికకి ఒక నిర్దిష్ట రూపుని ఇచ్చిందీ—మంచి రచనకు నిర్వచనమైతే—మంటలూ మానవుడు అక్షరాలా అలాంటి గుణాల్ని కల్గివుంది. నారాయణ రెడ్డిని ఒక వచన కవితా రచయితగా నిలబెట్టింది.

ఈ కవుల్లో కొంతమంది అరసంలో సభ్యులుగా కొనసాగిన వాళ్ళే. ఆ వూపిరితో రచించిన వాళ్ళే. కాని కాలం మారేకొద్దీ తమతమ వస్తువుల్ని, భావనల్ని, రచనల్ని, కవితా వాహికల్ని మార్చుకొంటూ అరసం నించి విడివడి వచ్చేశారు.

ఈ కాలంలో ఒకటి సభ్యుదయ కవిత్వం, రెండు భిన్న రీతుల్లో వచ్చిన కవిత్వంతో బాటు పద్యము రూపంలో మరో కవిత్వం వచ్చింది. అది దిగంబర కవిత్వం. దాన్ని గురించి తర్వాతి అధ్యాయం

-: o :-

# దిగంబర కవిత్వం

స్వాతంత్ర్యం వచ్చాక తెలుగు సాహిత్యంలో అవతరించిన వుద్యమం దిగంబర కవితోద్యమం. దీనికి సన్నిహితంగా [1]అమెరికాలోని బీట్ జెనరేషన్, గ్రే జనరేషన్, బ్రిటనులో యాంగ్రీ యంగ్ మెన్ ; హంగరీలోని 'గాయపడ్డ యువకులు', హాలెండులోని ప్రోవో వుద్యమాల్ని గుర్తించడం జరిగింది. అయితే పై వుద్యమాలకి, దిగంబర కవుల్కి, ఏలాంటి సంబంధం వున్నట్టు కనబడటం లేదు. పై వుద్యమాల్లోని యువకులు మరిజువానా మత్తు జాజ్ సంగీతపు గుప్పింతల్తో హరేరామ, హరేకృష్ణ పాడుకొన్న వాళ్లు. కొన్ని ప్రదేశాల్లో బట్టలిప్పి నడిరోడ్లో గంతులేసిన వాళ్లు. ఆ విషయంలో దిగంబర కవులు అలాంటి బాహ్య చేష్టల్ని ఎక్కడా ప్రదర్శించ లేదు. వీళ్ళు చేసింది అంతా సాహిత్యం ద్వారానే. అయితే ఇన్నిటికీ మూల ప్రాతిపదిక సాహిత్యంపై సమాజంపై కల్గిన నిరాశా, నిస్పృహ, అసంతృప్తులుగా గుర్తింపగలం.

ఇండియాలో — దిగంబర కవితోద్యమంతో బాటు 'ఆకలితరం యువకులు (**Hungry generation**) — 1964 ప్రాంతంలో — కూడా వున్నారు. బ్రిటిష్ ఇండియా పౌరులు స్వతంత్ర భారతంలో ఏవేవో కలలు గన్నారు. స్వాతంత్ర్యం సిద్ధించింది. రెండు మూడు పంచవర్ష ప్రణాళికలు అమలు పర్చబడ్డాయి అయినా భారత పౌరుడు తాను కన్న కలల్ని నిజం చేసుకోలేక పోతున్నాడు. ఆద భ్రమగా తోస్తుంది భ్రమ, వాస్తవం అయ్యే సమయం వూహకి తట్టడం లేదు. అలాంటి కలలు, వూహలు, కోర్కెలు, గొంతెమ కోరికలయి కూర్చోవడంవల్ల పై వుద్యమాలు భారత దేశంలో వచ్చాయి. ప్రణాళికలు ఒకదాని మీద ఒకటి వచ్చినా ఆహార సమస్య, నిరుద్యోగ సమస్య మేధావుల చర్చల్లో. సామాన్య పౌరుల నిత్య జీవితంలో సమస్యలుగానే వున్నాయి. అన్ని రాజ్యాలు కల్సి అనుకొన్న పంచశీల సూత్రాలు కేవలం ప్రాణం లేని పక్షులయ్యాయి. 1962లో చైనా, 1965లో పాకిస్థాన్ భారతదేశంపై యుద్ధం ప్రకటించాయి. ముందటి తరం కవులు

అకాడమీలకు ఆస్థానకవి పదవులకు ఎన్నికోబడ్డారు. కొంతమంది కవులు సినిమా ప్రపంచంలో స్థానం ఏర్పర్చుకొన్నారు. యువకవులకు ఎలాంటి స్థానం దక్కలేదు. ఇలాంటి పరిస్థితుల్లో యువతరం విసిగి వేసారి పోయింది. బెంగాల్ లో 'ఆకలితరం యువకులు', ఆంధ్రదేశంలో 'దిగంబర కవులు' అలాంటి విసుగుదలకు ప్రతిబింబాలు మాత్రమే.

[2]'సంఘ దుఃస్థితికి పిచ్చెత్తి, రోదించి ప్రవచించిన కవిత 'దిగంబర కవిత'. ఇజాలతోను, మతాలతోను సంబంధం లేంది ఇది. కేవలం సాంఘిక, పరిస్థితుల మీదా, ఆర్థిక సూత్రాల మీదా, రాజకీయ నంగి వెధవల మీదా, వెన్నెముక లేని యువకుల మీదా, కుళ్ళి పోయిన కళాకారుల మీదా — ఒక పేమిటి ?-ఒక లేవెత్తిగా మొత్తం సంఘం మీద ధ్వజం ఎత్తిన కవిత ఇది.

దిగంబర శకం, నగ్ననామ సంవత్సరం, ఆశ ఋతువు (సరిగ్గా క్రీ.శ. 1965 మే) న ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరం హైదరాబాద్ న దిగంబర కవిత - ప్రథమ సంపుటం నాంపల్లి పాండు అన్న రిక్షావాని మూలంగా ప్రకటింప బడింది.

[2]'మతాలతోను, ఇజాలతోను తమకు నిమిత్తం లేదంటూ, ఆదినించి అనువాదానికీ, అనుకరణకీ అలవాటు పడి, నేడు పాశ్చాత్య స్వరాలకు ప్రతిధ్వనిగా మారిన తెలుగు సాహిత్యానికి మౌలికమైన ధ్వనిని కోరుతూ, ఈ జీవితం తాటస్థ్యాన్ని వరించకూడదు, మనిషి జీవితం దీపం లాగా కాకుండా తోటివారి ప్రేరణా స్రోతస్సుగా వుండడం కావాలి' — అంటూ, ఏ ఆచ్ఛాదనకీ తల వొగ్గని, ఏ భయాలకి లొంగని నిరంతర సజీవ మానవుడి కోసం ఎలుగెత్తి పిలుస్తూ రెండో సంపుటం, నిఖిలేశ్వర నామ సంవత్సరం, మదిర ఋతువు (సరిగ్గా క్రీ. శ. 1966 డిశంబరు) లో ఇంకా, భయం భయంగా, బానిసత్వంగా దుర్భరంగా, హేయంగా, ఛండాలంగా వున్న ఆంధ్ర దేశమనే మురిగ్గుంట లోంచి ఒక హోటలు క్లీనరు ద్వారా సమర్పింప బడింది.

[3]ప్రపంచ పౌరుడుగా తన బాధ్యత లేమిటో ఆలోచించ వలసిన, పట్టించుకోవలసిన అవసరం అటుండనిచ్చి, దేశం ఒక లేవత్రీగా తయారయి

కంపు కొడుతుంటే దానికి కారణాలేమిటో, ఏ మాత్రం చూడకుండా పేద పురుగు కన్నా హీనంగా బతికేస్తున్న ఆంధ్రుడు ఇప్పటికైనా తన ముందమోపి బతుకును గురించి తెల్సుకోవడం అవసరం అని హెచ్చరిస్తూ, ప్రజల అజ్ఞానాన్ని మూఢ నమ్మకాల్ని, ఆసరాగా తీసుకొని ప్రజల డబ్బుపై భోగాలు అనుభవిస్తూ దేశానికి పనికివచ్చే పని ఏ ఒక్కటీ చెయ్యని ఈ మతాధిపతుల్ని బాబాల్ని సన్యాసుల్ని బట్టలొలిచి గాడిదం మీద పూరేగించి తరిమి తన్న టానికి, కళ పేరుతో ప్రజల్ని మరింతగా అవినీతి వైపు ప్రోత్సహిస్తున్న మన సినీ కళాకారుల్ని బహిరంగంగా అవమాన పర్చటానికి, సినీ రాజకీయ, అనాథమీ మార్కు రచయితలు యీ కుష్ఠు వ్యవస్థకి ఏ విధంగా పతాకం ఎత్తుతున్నారో ప్రజలకు తెలియజెయ్య డానికి యువతరం ముందుకు రావా లంటూ, అవిద్యని, అవిజ్ఞానాన్ని, అశక్తతని ఆసరాగా తీసుకొని దేశాన్ని దోచుకు తినడం మరిగిన పరిపాలకులు, సంఘంలోని వివిధ వర్గాల వాళ్ళు నేడు ప్రజలపై రుద్దుతున్న కుష్ఠు వ్యవస్థని ఎదుర్కొంటూ జ్వాలానామ సంవత్సరం విషాద ఋతువు (సరిగ్గా క్రీ. శ. 1966 జూన్) తో మూడో సంపుటం బిచ్చకత్తె యశోద చేత ఆవిష్కరింప బడింది.

ఈ దిగంబర కవితోద్యమానికి కారకులు ఆరుగురు కవులు. దిగం బరం అంటే నగ్నత్వం. కాని దిగంబర కవులంటే నగ్నంగా నడిరోడ్లో పరిగెత్తే కవులు అని అర్థం చేసుకోరాదు. ఎలాంటి ఆచ్ఛాదనలు లేకుండా సంఘంలోని కుళ్ళునీ, కశ్మలాన్నీ వున్నదున్నట్టు ప్రతిబింబించేట్టు రాసే కవులుగా గుర్తించాలి. 'దిగంబరం' కవితా విషయంలోనే కాని, బహి రంగంగా కాదు. ఈ అధ్యాయంలో దిగంబర కవిత్వం గురించి

1. దిగంబర కవులు ఎవరు
2. ఏం చెప్పారు ? ఎలా చెప్పారు
3. ఎందుకు చెప్పారు
4. దిగంబర కవిత్వం గొప్ప కవిత్వం అవుతుందా ?
5. తెలుగు సాహిత్యం పై దిగంబర కవుల ప్రభావం - అన్న వాటి ఆధారంగా వివరించ బడుతుంది.

## దిగంబర కవులు ఎవరు ?

దిగంబర కవులు ఆరుగురు. ఆంధ్ర దేశంలో పుట్టి పెరిగిన వారు. [2] తెనాలిలో పుట్టి బందరు హైదరాబాదుల్లో పెరిగిన నగ్నముని, 'నల్లగొండ' లోని వీరవల్లిలో గాలి పీల్చిన నిఖిలేశ్వర్, బహుధాన్య చైత్ర పూర్ణిమ నాడు భాగ్యనగరంలో కళ్ళు తెర్చిన జ్వాలాముఖి, హైదరాబాదు తూర్పున అంకుశాపురంలో జన్మించి బంగారమొడ్డించే పల్లెవాసుల చల్లని చూపుల్లో, పచ్చని పొలాల గట్లమీద కాలిబాటల చీలికల్లో పెరిగిన చెరబండరాజు, గోదావరి సుళ్ళు తిరిగే దేశం, నరసాపురంలో పుట్టిన భైరవయ్య, నెల్లూరు జిల్లా లింగసముద్రంలో కళ్ళు తెర్చి, కావలి హైదరాబాదుల్లో ఆకాశాన్ని, భూమినీ చదువుకున్న మహాస్వప్న — వీళ్ళు దిగంబర కవులు. పూర్వాశ్రమంలో వీళ్ల పేర్లు — వరుసగా యం. హెచ్. కేశవరావు, కె. మాధవరెడ్డి, వీరరాఘవాచారి. బద్దం భాస్కరరెడ్డి, మన్‌మోహన్ సహాయ్, కమ్మిశెట్టి వెంకటేశ్వరరావు.

వాళ్ళ మాటల్లోనే చెప్పాలంటే —

[3]"నేటి చెత్త వ్యవస్థని సమూలంగా తొలగించి, నిత్య నూతన మహత్తర వ్యవస్థకోసం తపన పడుతున్న" వాళ్లు దిగంబర కవులు.

[4]"మంచికోసం, మనిషిలోని నిప్పులాంటి నిజమైన మనిషి కోసం, కపటం లేని చిరునవ్వులు చిందే సమాజం కోసం" ఎలుగెత్తి నిల్చిన వాళ్లు దిగంబర కవులు.

[5]"జీవితానికి అర్థం లేదని, నిరర్థక జీవన విధానంతో మనిషి జీవించలేడు. శూన్యంలో ఎక్కడో ఒకమూల లేశమైనా కానీ ఆశాకిరణం దాగి వుంది", అన్న అభిప్రాయం గలవారు దిగంబర కవులు.

దిగంబర కవులు మొత్తం మీద 'సంఘ పరిస్థితికి పిచ్చెత్తి రోదించిన వాళ్ళు. ప్రపంచంలో రెండు ప్రపంచ యుద్ధాలు సంఘాన్ని, సారస్వతాన్ని మార్పులకు పెట్టాయి. కట్టుబాటులకీ, సంప్రదాయాలకీ విసిగెత్తిన యువకులు సంఘంలో, సాహిత్యంలో తిరుగుబాటు చేశారనడం, వాళ్ళలో దిగంబర కవులు కూడా ఒక తెగ అనడం చర్విత చర్వణమే అవుతుంది.

[6]‘విజ్ఞానం విరజిమ్ముతున్న విషపవనాల్లో, వేడికలు వెదజల్లుతున్న చీకటి పొగల్లో, పుస్తకాల పుటల బంజరు బీళ్ళలో, నాగరికత మత్తు ఇంజక్షన్లలో సమాజం జీవచ్ఛవమయినపుడు, మానవత మసిపాతలా మారిపోయినపుడు, మాసిపోయినపుడు’ సంఘమనెడి సముద్రానికి తుఫాను అవసరం అయింది.

[6]‘అసంపూర్ణ జ్ఞానుల అహంభావ సిద్ధాంతాల అజ్ఞాన ప్రవాహాల్లో ప్రమాదాల జలావర్తాల్లో జనత ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నపుడు, కీర్తి కాముకుల, నియంతల, అహంతల దౌర్జన్య బాహువుల దురాక్రమణలో దేశదేశాల సుఖవ్యాధి పుండ్లతో, చీడపురుగులు నిండిన మేడి పండ్లతో నిండినపుడు సమాజాన్ని ప్రస్తుతం సజావుగా నడిపించాలంటే వాయులీనం పలికించే కమానులాంటిది అవసరం అయింది.

ఇలా సంఘానికి అవసరమైన తుఫాను లాగా, కాలం వాయులీనం మీద కమాను లాగా దిగంబర కవులు తెలుగు కవితోద్యానవనంలో అడుగు పెట్టారు.

ఇదీ ‘దిగంబరకవి’ని గురించి దిగంబరకవుల దృష్టి. ఇక ఇతరుల దృష్టి ఇది.

శ్రీశ్రీ వీళ్లని గురించి చెప్తూ

[7]దిగంబర కవులు
ముళ్ళ గులాబి పువులు
ఆగ్రహ భార్గవులు
ప్రభువుల శిరసులపై పరశువులు
పగబట్టిన చక్షుశ్శ్రవులు’ అంటారు

[8]‘ఏల్చూరి మురళీధరరావు

“...... ఈ కవులు విశేష జీవితానుభవాన్ని, దానితో సమానస్థాయి గల శైలిని, అసమానమైన ఆవేశాన్ని, వచనగేయంలో మూసపోసిన ప్రతిభావంతులు ...... దిగంబర కవులు ప్రజల దుర్దశకు వాస్తవంగా బాధ పడుతున్నారు. దాని నుంచి బయట పడేందుకు సాయం చెయ్యాలని హృదయ

పూర్వకంగా వాంఛిస్తున్నారు. అహంభావుకులైన మధ్యతరగతి యువ మేధావులలో తరచు కనిపించే చాపల్యం దిగంబర కవుల్లో ఎక్కువ. కాని వారి కవితలలో చాపల్యం కన్న సిన్సియారిటీ చాల బలంగా వుంది" అనీ.

[9]కె.వి. రమణారెడ్డి —

"......దిగంబర కవులు నవజీవన విధానాన్ని సృజించ గోరుతున్నారు. అయితే అది ఎలాంటిదో వారిలో వారికే ఒక నిర్దిష్టమైన అభిప్రాయం ఏర్పడినట్లు లేదు." అనీ

[10]సుపాణి —

"కవులకు 'కమిట్‌మెంట్' అవసరమని భావిస్తూ అభ్యుదయ కవులందరినీ అభాసుపాలు చేస్తూ, సాహితీ చరిత్రలో నూతన శకం ప్రారంభించాలని తాపత్రయ పడిన ఇటీవలి కాలంలో 'దిగంబర కవులు' ముఖ్యులు" అనీ.

[9]కె.వి. రమణారెడ్డి తిరిగి —

" ....అమెరికను బీట్నిక్కులకూ, ఇంగ్లీష్ యాంగ్రీ యంగ్‌మెన్‌కూ మన దిగంబర కవులు నిస్సార ప్రతిధ్వనులను కల్పిస్తున్నారని నమ్మమంటే నేను నమ్మను. వీరి చిత్తశుద్ధిని నేను శంకించను .... పాశ్చాత్యమైన నాజూకులకు మనస్సులప్పగించి ఏదో మ్లేచ్ఛమయిన సరుకును దిగుమతి చేస్తున్నారని చేసే ఆరోపణ, జాత్యహంకార పూరితమైన అంధవైఖరి. మన తన అని, స్వ పర అని సంస్కృతికి ఈనాడు అరమరలు లేవు. అంతర్జాతీయ సంస్కృతి ఇప్పటికే ఒకటి రూపొందింది. వివిధ దేశాల యువజనుల ఆందోళనలాంటిదే మన దేశపు, ఈ కాలపు యువకుల ఈ మనస్తాపం, ఈ చిత్తక్షోభ" అనీ వాళ్ళని, వాళ్ళ చేష్టల్నీ సమర్థించారు

[11]రాంబట్ల కృష్ణమూర్తి —

"....విసుగుదల, దారుణ నీరస జీవితం వల్లనే తమలో రచనా నైపుణ్యం పొటమరించిందని భావించే యువకవులు ఈనాడు మన సాహిత్య రంగంలో కోకొల్లలుగా కన్పిస్తారు. అలాంటి ఒక యువకవి బృందం తమ విసుగును అక్షరాల్లో వ్యక్తీకరిస్తూ ... తమ కవితా సంపుటాలను ఆర్భాటంగా వెలువరించారు. - వాస్తవాన్ని ప్రసక్తాన్ని విడిచి ఊహాలోకంలోకి

పరుగులు పెట్టిన తర్వాత వెయ్యేళ్ల ఏధ్యయుగం అయినా ఒకటే, పది వేలేళ్ళ ఆదిమయుగం అయినా ఒకటే. వేయిపడగల కవి సామ్రాట్టు గతం లోనికి నడిచి వెళితే, విప్లవ కవిచక్రవర్తులు భూతంలోకి పరుగులు పెడు తున్నారు. వేయిపడగల రచయిత శాస్త్ర విజ్ఞాన ప్రగతిని నిరోధించాలంటే విప్లవ కవికుమారులు దాన్ని సమూలంగా విధ్వంసమే చేయాలంటున్నారు.... సాహిత్య శీలం ఏదయినా ఉదాసీన కాల్పనికతను చేపట్టడం వల్ల వేయి పడగల కవిసామ్రాట్టు, విప్లవ మహాకవులు కూడా భూతంలోకి పరుగు పందేలు వేసుకొంటున్నారు" అని నిక్కచ్చిగా వాళ్ళది విధ్వంసమే కాని విప్లవం కాదని ఈసడించుకొన్నారు.

దిగంబర కవులంటేనే ఒక ప్రత్యేకత కొట్టొచ్చినట్టు కనబడుతుంది- సాహిత్యంలో. అదేమిటంటే, ఒక్కరుగాక ఆరుగురు చేరి ఒకటిగా ఒక వుద్య మాన్ని లేవతీయడం. తమ ప్రత్యేకతని చాటుకొనేందుకేనేమో తెలీదు కాని, శాలివాహనాది పూర్వశకాల్ని, ప్రస్తుత క్రీస్తు శకాన్ని కాలదన్ని దిగంబర శకాన్ని చేపట్టారు వీళ్ళు. ప్రభవ విభవాది సంవత్సరాలకు తిలోదకాలు అర్పించి, నగ్ననామాది వత్సరాలకి నీరాజనం ఇచ్చారు. గ్రీష్మ వసంతాది ఋతువుల్ని త్రోసిరాజని ఆశ, మదిరాది ఋతువులకి హారతులెత్తారు. ఆది, సోమ వారాలను వారనబెట్టి, స్నేహ, విశృంఖలాది వారాలకు కైవారాలు పలికారు. అయితే వీటినన్నిటినీ సూక్ష్మంగా పరిశీలిస్తే బాల్య చేష్టలుగానే కనబడుతున్నాయి కాని మరోటి కాదు. 'ఇతి శాసనమ్' అంటూ ప్రథమ సంపుటిలో "దిగంబరశకం నగ్ననామ సంవత్సరం ఆశ ఋతువు (సరిగ్గా క్రీ. శ. 1965 మే)న దిగంబర కవితా ప్రచురణ—సమర్పణ" అన్నారు. రెండో సంపుటిలో "దిక్కులు 30, దిగంబర కవులు అంటూ 'దిగంబర శకం నిఖిలేశ్వర నామ సంవత్సరం మదిర ఋతువు (సరిగ్గా క్రీ. శ. 1966 డిశంబరు)లో....దిగంబర కవితా ప్రచురణ' అనీ, 'నేటి కుష్టు వ్యవస్థపై దిగంబర కవులు' సంపుటి - 3 లో "దిగ్జ్వలన జ్వాలా నామ సంవత్సరం విషాద ఋతువు (సరిగ్గా క్రీ. శ. 1968 జూన్)లో దిగంబర కవితా ప్రచురణ" అనీ తమ సంపుటాల ద్వారా వాటి కాలనిర్ణయం చేయడం జరిగింది.

ఈ మూడు సంపుటాల మున్నుడి చూస్తూంటే వీరికొక ధ్యేయం కానీ, ఏర్పర్చుకొన్న ధ్యేయాన్ని అనుసరించాలనే ధ్యాస కాని వున్నట్టు కన్పడటం లేదు.

ప్రథమ సంపుటి చివర—
దిగంబర శకం—
కాలమానం

సంవత్సరాలు

ఆరు
నగ్ననామ సంవత్సరం
నిఖిలేశ్వర నామ సంవత్సరం
జ్వాలాముఖి నామ సంవత్సరం
చెరబండ నామ సంవత్సరం
భైరవ నామ సంవత్సరం
మహాస్వప్న నామ సంవత్సరం

ఋతువులు

ఆరు
ఆశ ఋతువు
తపన ఋతువు
అశ్రు ఋతువు
మదిర ఋతువు
విరహ ఋతువు
విషాద ఋతువు

వారాలు

ఆరు
స్నేహవారం
విశృంఖల వారం

క్రాంతి వారం
సృజన వారం
వికాస వారం
అనంత వారం -అని చెప్పబడింది.

## సంవత్సరం

మొదటి సంపుటి 1965 (నగ్ననామ సంవత్సరం) లోనూ, రెండో సంపుటం 1966 (నిఖిలేశ్వర నామ సంవత్సరం) లోనూ, మూడోసంపుటి 1968 (జ్వాలా నామ సంవత్సరం) లోనూ ప్రచురింప బడ్డాయి.

1965 నగ్ననామ సంవత్సరం అయితే, 1966 నిఖిలేశ్వర నామ సంవత్సరం అనడం సామాన్యం. కాని జ్వాలనామ సంవత్సరం 1967 అవుతుందే కాని 1968 అయేందుకు వీలులేదు పోనీ వారేర్పర్చుకొన్న సంవత్సరనామం రెండు సంవత్సరాలకి పరిమితం అని సర్దుకొంటామంటే మొదటి రెండు సంపుటాల ఆవిష్కరణలు అడ్డు వస్తాయి. కారణం అక్కడ సంవత్సరానికే ఆ పేరు పరిమితం కనుక.

## ఋతువు

ఇక ఋతువుల్లో కూడా ఇలాంటి అవకతవకలు కనబడుతున్నాయి. మొదటి సంపుటి ఆశ ఋతువు (సరిగ్గా క్రీ.శ. 1965 మే)లో ప్రచురింపబడితే రెండో సంపుటి మదిర ఋతువు (క్రీ.శ. 1966 డిశంబరు) లోనూ, మూడో సంపుటి విషాద ఋతువు (క్రీ.శ. 1968 జూన్)లోనూ ప్రచురింప బడ్డాయి.

వారిచ్చిన వరుస ప్రకారం 'ఆశ ఋతువు' మే మాసం అయితే మదిర ఋతువు డిశంబరు అవుతుంది అలాగే విషాదఋతువు మార్చి—ఏప్రిలు అవుతూందే కాని జూన్ అయేందుకు వీలు లేదు.

మూడో సంపుటిలో వాళ్లు కావాలని మార్పు చేశారని అనుకొందామంటే. మరి ఈ తతంగం అంతా — సంవత్సర ఋత్వాదికాలు — ఎందుకు జరిపించినట్లో తెలీదు. వారాలకు పేర్లు ఇచ్చారు కాని, వాటికి ఈ సంపుటాల్లో

ఎక్కడా స్థానం కల్పించినట్టు కానరాదు—వాటి రూపకల్పన జాబితాలో తప్ప.

ఇలాంటి బాల్య చేష్టలు దిగంబర కవుల్లో కనబడుతున్నాయి. అయితే ఇది కవిత్వానికి ఏలాంటి బాదరబందీ కల్గించడం లేదు.

దిగంబర కవులు మూడు సంపుటాల్లో కల్సి రాసిన దిక్కులు (వాళ్ళు కవితల్ని దిక్కులని ముద్దుగా పిల్చుకొన్నారు) = 93

వాటి వివరాలు ఇవి :

| | | సం॥ 1 | సం॥ 2 | సం॥ 3 | మొత్తం |
|---|---|---|---|---|---|
| నగ్నముని | — | 4 | 7 | 14 | 25 |
| నిఖిలేశ్వర్ | — | 4 | 9 | 11 | 24 |
| చెరబండరాజు | — | 4 | 7 | 9 | 20 |
| భైరవయ్య | — | 4 | 4 | 4 | 12 |
| జ్వాలాముఖి | — | 2 | 2 | 2 | 6 |
| మహాస్వప్న | — | 3 | 1 | 2 | 6 |

## ఏం చెప్పారు ? ఎలా చెప్పారు ?

దిగంబర కవులు తమ రచనల్లో, రాజకీయ, సాంఘికాది రంగాల్ని విమర్శించారు. ఏం చెప్పారు ? ఎలా చెప్పారు ?అన్న ఈ భాగం కింద రాజకీయ నాయకులు, చోటా నాయకులు, ధనం పిశాచి బాబాలు, మతోన్మాదులు, ప్రభుత్వతొత్తులుగా మారిన కవులు, కళ పేరుతో వ్యాపారంలోకి దిగిన కళాకారులు, సినీహీరోలు మొదలైన వస్తువుల్ని, వాటిని రచనల్లో ఎలా ప్రతిబింబించారు అని ఇక్కడ వివరింపబడుతుంది. మొదట రాజకీయ రంగం గురించి చెప్పబడుతుంది.

## రాజకీయ రంగం

నేటి వ్యవస్థకి మూల కారణం ఆర్థిక వ్యవస్థ. ఆ వ్యవస్థని పక్కకు పెట్టి రాజకీయం సంఘాన్ని అజమాయిషీ చేస్తూంది. డబ్బున్న ప్రతి ఒక్కడూ

ఒక రాజకీయ నాయకుడు. ఎన్నికలు పేదల పాలిట కల్ప వృక్షంగా ప్రవేశ పెట్టబడితే కాటేసే విషనాగులుగా తయారయ్యాయి ఇప్పుడు. ఎన్నికల్లో గెల్చిన రాజకీయ నాయకులు ప్రభుత్వాన్ని పరిపాలిద్దాం, ప్రజల యోగ క్షేమాలు తెల్సుకొని, అనువైన సౌకర్యాల్ని కల్పిద్దాం అని తలవడం మర్చిపోయి, డబ్బు ఎలా సంపాదించడం అని ప్లానులు వేసుకొంటున్నారు. రాజకీయం ఒక వ్యాపారంగా మారిపోయింది. వీళ్ళవల్ల సామాన్య మానవుడికీ వీళ్ళకీ మధ్యన అగాధం పెద్దదవుతూంది. దిగంబర కవుల దృష్టిలో బాగా ఆనినవారు రాజకీయ నాయకులే. రాజకీయ నాయకుల విమర్శ పరంపరలే మనకు అనేక దిక్కుల్లో (దిగంబరకవి గేయాలు) దర్శనమిస్తాయి.

జడలు కటిన శిరోజాల కొసలు
పట్టుకు వేళ్ళాడుతున్న
పేలు
నాయకులు

జడలు కొనలు పట్టుకు వేలాడుతున్న పేలు కింద పడటమే తరువాయి. కారణం చివర దశలో వున్నాయి కనుక అదీగాక వేళ్లాడుతున్నాయి. వేళ్ళాడేవి ఎంతసేపు స్థిరంగా వుండ కలుగుతాయి. ఎపుడో ఒకప్పుడు అందునా కొద్ది సేపులోనే స్థిరత్వం తప్పి కింద బడటం ఖాయం. అలాగే రాజకీయ నాయకులకీ కూడ కాలం సమీపించింది అన్న భావం కవి ఈ వుపమానం ద్వారా వూహిస్తున్నాడు.

రాజకీయ నాయకులు వేసే వేషాల్ని, అనుకరించే విధానాల్ని విమర్శిస్తున్నాడు కవి. ఐదేళ్ల కొకసారి వచ్చి అనురాగం అంతా చొల్లు (జొల్లు) కింద కార్చి ప్రజలకీ, పరంధామునికీ వంగి వంగి దండాలు పెట్టుతూ, ఓట్లివ్వమని అభ్యర్థిస్తూ వస్తారు. ఇది అచ్చంగా కొజ్జాలమేళాగా వున్నట్లు చిత్రిస్తున్నాడు, పూర్వం కొజ్జాలు ఒకటిగా చేరి సంవత్సరాని కొకసారి వూరి మీద పడేవాళ్ళు. వెన్నెలపై తమలపాకు వూస్తూ మద్దెళ్లూ, తాళాల్లూ మ్రోయిస్తూ, పదాలు చిందిస్తూ ఆదిమరాత్రుల భయ మిశ్రమ, సంభ్రమ సంతతిగా ప్రతి ఇంటిముందూ ఆడి పాడి డబ్బు దండుకొని పోయేవారు. అదేవిధంగా

(149-150) 'ఇప్పుడు కొత్తరకం కొజ్జాలు దిగారు
లజ్జలేని బొజ్జలున్న కొజ్జాలు దిగారు
యూనిఫారం సరిచేసుకుంటూ
అయిదేళ్ల కొకసారి ప్రేమ వొలకబోసూ
కాలతో భజంత్రీలతో మందీ మార్బలంతో వస్తున్నారు'

వచ్చి ఓటివ్వమని అడుక్కోవడమే గాక, తమని ఎన్నుకొంటే ఏమేమో చేసేస్తామనీ, ప్రజల్ని ఆకాశానికి ఎత్తేస్తామనీ చెప్తుంటారు కాని వాళ్ళు దిగుతుండేది వ్యాపారంలోకి.

(150) 'చెయ్యని పన్ని వివరంగా చేస్తామని చెబుతున్నారు
డబ్బు చల్లి డబ్బు పండించే వ్యాపారంలోకి దిగుతున్నారు'.

పోనీ వీళ్ళకి డబ్బు సంపాదిద్దామనే ఆశేనా, ఇంకేమీ లేదా ? అంటే దేశ
యవ్వనం మెత్తం పట్టేద్దామనే ప్రయత్నం, అందుకే

(150) 'దేశాన్ని జుట్టుపట్టి యీడ్చుకొచ్చారు రోడ్డు మీదికి
బరబరా లాక్కొచ్చారు కంకర రోడ్డు మీదికి
నలుగురు చూస్తారనే లజ్జయినా లేదు యీ కొజ్జాలకి
పదవీ పరాక్రమంతో ఏమైనా చెయ్యొచ్చనే ధైర్యం కొజ్జాలకి

(150) అక్కడితో ఆగలేదు కొజ్జాల పరాక్రమం
కుళ్ళి పోయిన, పుచ్చి పోయిన
తమ పయోరియా పళ్ళతో పెదవులు కొరికి కొరికి
రక్తం చిందించి నవ్వారు
వాళ్ళ కుష్ఠు చేతుల్తో రొమ్ములు పిసికి పిసికి గెంతారు'

ఇలా రాజకీయనాయకులు దేశాన్ని జనజీవనాన్ని చిందర వందర చేశారు. సారవంతమైన దేశాన్ని చవుటి పర్రగా మార్చారు. మానవత్వంతో జీవించాల్సిన యువతని అగ్గి పాల్జేశారు. వీళ్ళ అధికార దాహంలో తామేంచేస్తున్నామనే ధ్యాసకూడా లేదు. రాజకీయ నాయకులు దేశాన్ని చిందర వందర

చేయడంలోనే కాలం గడపడం లేదు. ఈ పార్టీలో వుంటే మన కంత ప్రయో జనం లేదని అనిపిస్తే వెంటనే ఇంకో పార్టీలో చేరడం, పాత పార్టీని విమర్శిస్తూ కొత్తపార్టీని పొగడుతూ వుండడం. దిగంబర కవులు దీన్ని నీచోపమతో సూచించారు.

(155) మజిలి మజిలీకి వేశ్య
కొత్తచీర మార్చుకున్నట్టు
నపుంసకుడు పురీషాన్ని
ప్రతి నిమిషం నలిపినట్టు
పార్టీలు మారే పగిటి వేషగాళ్ల —అని.

యం. యల్. ఏ. గా పోటీచేసే వ్యక్తి కొత్తలో ఎన్నికల ముందు తమ దగ్గరికి వచ్చినపుడు ఆదరించి తమకు వీరివల్ల చాలా లాభాలు కలుగుతాయని ఆశిస్తారు.

(172) 'మమ్మల్ని ఉద్ధరిస్తావని
కొక్కాలకు వేళ్ళాడే మా కోర్కెలు
నేరుగా అధికారానికి వినిపిస్తావని
మా అవిసిన ఆశల నేద తీర్చి
మా బతుకుల్లో లేమి మాట మాన్పిస్తావని
నిద్రాహారాలు మాని మా కోసం
అహోరాత్రాలు శ్రమిస్తా(ద)వని-

తలచి ఎన్నుకొంటారు. గెల్చిన తర్వాత వారి సంతృప్తికి సూచకంగా బంతి పూల మల్లెల మాలలు కురిపించి, హారతి కర్పూరాలు వెలిగించి, సన్నాయి బాండు మేళాలతో దేవుడిలా వూరేగించి పంపిస్తారు. కాని వారనుకొన్న ఏ ఒక్కటీ ఈ నాయకులవల్ల జరగదు. కాగా

(173) 'నల్ల బజారు వ్యాపారిని రక్షిస్తూ
వేదికలెక్కి అధిక ధరల్ని
అరికట్టాలంటున్నాడని

(173) కైపెక్కిన కళ్ళతో
కనిపించిన స్త్రీ నల్లా కరిచి
కారు చీకట్లో కార్లో
నగరం అపకల కన్నెపిల్లలకు
కడుపుల ముడుపులు కడుతున్నావ(ద)ని

తెల్సుకొంటారు.

దిగంబర కవుల దృష్టిలో రాజకీయనాయకులు దేశానికి పట్టిన చీడ పురుగులు దేశాన్ని నాశనం చేసే భయంకర విషనాగులు. దొరికింది దొరికి నట్టు చేజిక్కించుకొనే పిండారి దోపిడీగాళ్లు. దయ, సత్యం అన్నీ ధన సము పార్జన వాహినిలో కొట్టుకపోయ్యాయి. దేశాన్ని నామరూపాలు లేకుండా చేశారు.

(224) ఆవయవాల పట్లు తప్పి కార్చుకున్న విరేచనాలు గాక మరేమిటి
రాజకీయాలు అని దిగంబర కవులు ప్రశ్నిస్తున్నారు. ఇలాంటి పరి స్థితుల్లో దిగంబర కవులు ఏం కోరుతున్నారు?

(144-145) 'ఐదేళ్ళలో ఒక్కసారి ఒక్కక్షణం మాత్రమే
నీ కాగితం వోటు హక్కుతో
ఐదేళ్ల సొంతం బానిసగా
రాజకీయాల రంకుకు బలికాకుండా
ప్రజాస్వామ్యం - స్వేచ్ఛ
కొందరి ఖద్దరు గావంచాల వెనుక
నల్లని విషనాగుల కారుల కింది
కొనప్రాణాన్ని
ఒక్కసారి రక్తార్చనతో ఆదుకొమ్మని

....సుందర సమతా వ్యవస్థకై
బలాలను తేల్చుకోమని'

దిగంబర కవులు కోరుతున్నారు.

## సాంఘిక వ్యవస్థ :

రాజకీయ వ్యవస్థతో పాటు దిగంబరకవులు సాంఘిక వ్యవస్థని కూడా గర్హించారు. ఈ వ్యవస్థలో వాళ్ళు 'ధనపిశాచి'ని, "ఆడది అంటే రాత్రి తన కింద పండుకొనే డన్‌లప్ పిల్లో" అన్న మనస్తత్వాన్ని, కట్నాలు, వ్యభిచార గృహాలు మొదలైన మచ్చల్ని, యాంత్రికజీవనం గడుపుతున్న ప్రజల్ని, అన్నిటికన్నా ఎక్కువగా వెన్నెముక లేని యువకుల్ని, వీళ్ళు ఎక్కువగా విమర్శించారు.

## ధనం పిశాచి :

నేటి మానవుడు 'ధనం పిశాచి' చేతిలో కీలుబొమ్మ అయ్యాడు. [12] రూపాయి నోట్లో తలదూర్చి తన్నుకుంటుంది లోకం. ఏ పని చెయ్యాలన్నా లాభనష్టాలు బేరీజు వేసుకోవడంలోనే వున్నాడు. ధనం మోహంలో పడి దానధర్మాల్ని కూడా మరిచాడు. కనీసం ఎదుటివాని పరిస్థితుల్ని కూడా అర్థం చేసుకోలేని పరిస్థితికి వచ్చారు. బిచ్చగాళ్ళ పరిస్థితి ఎరిగినా దానం చేసేందుకు సుముఖులుగా లేరు. కంట్రాక్టర్లు, అధికార్లు పర్సెంటేజీ లెక్కన డబ్బు పంచుకుంటే; కూలీలు గుంటల్లోనే గుంటలు తవ్వి లెక్కలు చూపిస్తున్నారు. ఏమీ అడగని దేవుడికి మాత్రం ముడుపులు చెల్లిస్తారు. ప్రతిభక్తుణ్ణి కాళ్ళావేళ్ళా పడి అడుక్కునే బిచ్చగాళ్ళకు కాణి ముక్క ఇవ్వరు. కారణం లాభనష్టాల బేరీజులే. దేవుడికి చెల్లిస్తే మరికొంత వస్తుందనే ఆశ అతన్ని ఆవహించడమే.

(56) 'కన్నీటికి కట్టుబడీ
ఎదుటి వాని యెద కుంపటి దించాలని
జీవంతో హృదయంతో
రొమ్మిరుచుక తిరిగే మనుషుల
లో మనిషిని పీల్చుక తినే
క్షణం క్షణం చేతులు మారే
వేశ్యాంశ ధనపిశాచికి'

వ్యక్తి జానిస అయ్యాడు అంటున్నారు దిగంబర కవులు. ఒక తరగతి మనిషి ఎపుడయితే ధనం చేతిలో కీలుబొమ్మ అయ్యాడో, అపుడే ఇంకో తరగతి మనిషి ఆకలి జంతువుని చూసి జడుసుకోవాల్సి వచ్చింది. ఒకపక్క వేశ్యాంశ అయిన ధనం కులుకుతూ, కొంతమందిని మాత్రం సంతృప్తి పరుస్తూంటే, ఇంకోపక్క ఆకలి జంతువు అనేకుల మీద విరుచుక పడుతూంది. ధనానికి ఆకలికి పొత్తు ఎప్పుడైతే లేకుండా పోయిందో, ఆ రెంటి మధ్యా అగాధం ఏర్పడ సాగింది. అగాధం పూడ్చాలని ఒకరికి అన్పించదు. ఇంకొకరికి శక్తి చాలదు. ఆకలి ఇలా స్వైరవిహారం చేయడానికి కారణం: ఒకటి-వున్న భూమి కొద్దిమంది చేతుల్లోనో తగులక పోవడం. రెండు నిరుద్యోగం. డబ్బున్న మారాజులంతా ప్రభుత్వ నాయకులు. అందుకని భూసంస్కరణల్ని అమలుపర్చి లేని వాళ్ళకి ఇద్దామనే వుద్దేశం కలికానికైనా కానరాదు వాళ్లలో. కనుక 'దున్నేవాడికే భూమి' అన్నది నినాదంగానే మిగిలిపోయింది. ఈనాడు వుద్యోగం రావాలంటే డబ్బుండాలి. డబ్బు యిచ్చే స్థితిలో వుండగలిగితే బహుశా ఉద్యోగం, గ్రాసానికి అవసరం కాకపోవచ్చు. కాని డబ్బున్న వాడు లాభనష్టాలు చూసుకొని కొంత డబ్బుతో మరికొంత సంపాదించొచ్చు అన్న భావనతో వుద్యోగం సంపాదిస్తాడు. డబ్బులేనివాడు నిరుద్యోగిగానే వుంటాడు. అంటే ఇరువురిలోనూ అభివృద్ధి—ఒకరు పైకి, మరొకడు కిందికి—కనబడుతూంది, అన్నమాట. ఇలా వారి మధ్య దూరం ఇంకా అగాధమై పొయ్యింది. దిగంబరకవి అగాధాలకి ఈవలనున్న వాళ్ళని—నిరాశ్రియుల్ని—మనీషి అని సంబోధిస్తున్నాడు. డబ్బున్నవాడు సాధారణ మనిషి. క్షేమంగా జీవితం సాగిస్తున్నాడు. మనీషి క్షామంలో పొర్లాడుతున్నవాడు. వీళ్ళని శాపగ్రస్తులుగా చిత్రించారు దిగంబరకవులు.

(82) దేశంనిండా శాపగ్రస్తులు
వానలో స్నానమాడి వడగాడ్పుల్లో ఆరి
ఆకల్ని అరగించి కన్నీళ్ళను సేవించి
చలిని కప్పుకొని
....కలలు కంటున్నారు.

ఇక డబ్బున్నవాడు డబ్బు సంపాదనలో పడి ఏం చేస్తున్నాడో తనకే తెలీని పరిస్థితికి వచ్చాడు. బాంక్ బాలెన్స్ కోసం నిర్విరామంగా కృషి చేస్తున్న వాణ్ణి నిలదీసి

(214) ఎక్కడ బతుకుతున్నావు నువ్వు
ధనం కుష్టు రసిమీదా హోదాల రాచపుళ్లమీదా
పీనుగు పెంటల అంగాజనం రాస్తాలమీదా' అని

ప్రశ్నిస్తూ

(215) 'నిన్న రాత్రి ఎన్నిగంటలకి తిరిగి
నీ పెళ్ళాన్ని వాడిమేడనుండి యింటికి తీసుకొచ్చావు'

అని ప్రశ్నల వర్షం కురిపిస్తున్నారు. డబ్బు సంపాదనలో పడి నీతి, నిజాయితీ అభిమానం, వ్యక్తిత్వం—అన్ని పదాల్ని వాటి అర్థాల్ని మర్చిపోయ్యారు. అగ్నిసాక్షిగా పెండ్లాడిన ఆలిని ఇతరునకు తార్చడానికీ కూడ వెనుదీయని వాళ్ళని నిలదీసి అడిగారు దిగంబరకవులు.

## ఛోటా ఛోటా నాయకులు

నేటి సంఘవ్యవస్థకి కేవలం రాజకీయ నాయకులేకాకుండా పల్లెటూళ్ళలో వుండే ఛోటా ఛోటా నాయకులు కూడా ప్రోద్బలాన్ని ఇస్తున్న వారే. జాతర్ల పేరుతో, వుత్సవాల సాకుతో, వాళ్ళు చేసే ఆటవిక చర్యలు మనం రోజూ చూస్తూవుండేవే. జాతర్లలో అమ్మోరికిచ్చే వేటల్ని లెక్కెయ్యొచ్చునేమో గాని, ఈ ఆంబోతులకి ఆహుతి అయ్యే కన్యల మానాల్ని మాత్రం లెక్కెయ్యలేం. దేవుని పేరిట వచ్చే రాబడి అంతా వీళ్ళ యిండ్లనే నమ్ముకొంటుంది. సంఘ సంస్కరణల పేరిట వీరు చేసే అమానుష ఘాతుక చర్యలు సహింపరానివి. పక్కవీధిలో వున్న 'పుల్లయ్య' తమకు ఓటు వెయ్యలేదని అతనిపై కక్ష. ఆ కసి తీర్చుకోవాలనే ఆకాంక్ష ఎక్కువయితే ఇక పుల్లయ్య బాధ దేవుని కెరుక. వీరంతా దిగంబర కవుల కవితా వస్తువులో చిరస్థాయిగా నిల్చిపొయ్యే వారు. పెదబాబు, చిట్టిబాబు-నిత్యం వూళ్ళలో జరిగే వాటికి, జాతర్లలో జరిగే విచిత్ర సంఘటనల్కి సిదానాలు (Symbols) చిట్టిబాబును ప్రవేశ పెట్టుతూ-

(188) గాది కింద పడి కొక్కు
ఊరి కంత పెద్ద దిక్కు

అంటాడు. ఈ ఒక్క వాక్యంతోనే వాడెలాంటివాడో తెలుసుకోవచ్చు అతడు బ్రహ్మంగారి సూత్రాల్నీ, సుమతి మొదలైన శతకాల్నీ, భగవద్గీత శ్లోకాల్నీ, శంకరుని భాష్యాల్నీ, ఏకధాటి వల్లె వేసిన ధిషణాశాలి. 'నీ నోట్లో-నా నోట్లో, అందినోడి అంగట్లో మట్టి కుక్కి, తన ఇంట్లో ఇనప్పెట్లో ఆలితెచ్చిన కావిడి పెట్లో బంగారం కుక్కగల్గిన వాడు.

ఇక పెదబాబు మహాత్ముని సూత్రాల్ని, నిత్యపారాయణం చేసే అపర కాంగ్రెసువాది. కాని వంటిట్లో నాలుగింటి చావట్లో సారాబట్టీ మాత్రం ఎపుడూ దేదీప్యమానంగా మండుతుంటుంది. ఇక వీళ్ళు చేసే అమానుష చర్యలు చెప్ప వలను కానివి. ఓటిచ్చిన బుల్లోడికి ఒక్కసారి మొక్కని, కాళ్ళు పట్టేసి కింద గుంజి, గొంతు నొక్కేసి గోలుమాలు జేయగల దిట్ట ఈ పెదబాబు. అంతే కాదు తమ ఇంటి మురికికాల్వల్ని పక్కోడి పొలాలికేసి మళ్ళించి తన కార్యం ముగించుకొంటాడు. పక్కవాడికి పంట పండకపోయినా తనకు ఓ లెక్క లేదు. తనభార్యనేమో

(191) ....ఏడు ప్రాకారాల మధ్య కూలేసి
ఏడు గ్రామాల్ని కాపలా వేసి
పక్కోడి పెళ్ళాన్ని
ఎదురింటోడి పడుచు కూతుర్ని
పక్కలోకి లాగేసి
పరువంలో మింగేసి

వూరెక్కి వూరేగిన పెదబాబు, నిజాన్ని వురితీసిన చిట్టిబాబు వీరవిహారం చేస్తుంటారు పల్లెటూళ్లలో.

ఇలా పెదబాబు, చిట్టిబాబులతో పాటు కీర్తికాముకులు, అవకాశ వాదులు, యాంత్రిక జీవనం గడుపుతున్న ప్రజలూ ముఖ్యంగా వెన్నెముక లేని యువకుల్ని వీరు ఎక్కువగా విమర్శించారు.

## బాబాలు జియ్యర్లు గోసాయీలు మొ॥వారు

పై వాళ్ళలాగే దిగంబరకవుల దృష్టిలో పడ్డవాళ్ళు బాబాలు, మఠాధిపతులు, జియ్యర్లు, గోసాయీలు మొదలైనవాళ్ళు.

భారతదేశం ముఖ్యంగా వ్యవసాయంపై ఆధారపడ్డది. రైతులకి సెలవులంటూ వుండవు. పొద్దస్తమానం పొలంలో పనిచేసి చీకటి పడ్డాక ఇంటికి రావడం, తినడం. అలసట వల్ల వెంటనే నిదురపోవడం. తిరిగీ మరుసటిరోజు అదే కార్యక్రమం. ఇలా రైతు యాంత్రిక జీవితాన్ని గడుపుతుంటే, మరో రైతన్నతో తీర్గా మాట్లాడు కొనేందుకి వీలుకాకుండా పోతుంటే వాళ్ళకి తీరుబాటు కావల్సి వచ్చింది. ఆ తీరుబడి ఆధారంగా పండగలు వచ్చాయి. ప్రతి పండగ ఒకేరకంగా వుంటే మళ్ళా అది మరోరకమైన యాంత్రిక జీవనం అయిపోతుంది కనుక, సంవత్సరంలో రకరకాల పండగలకి ఆస్కారం కల్గింది. కేవలం తీరుబడి కల్గించడం కోసమే అవాటి ప్రజలు పండగల్ని నిర్ణయించుకొన్నారు.

ప్రతి ఒక్కడికీ బలవంతుణ్ణి చూస్తే భయం. ప్రాచీనులు భగవంతుణ్ణి బలవంతుణ్ణి చేసేశారు. అందుకే దేవుడంటే అంత భయం. అసలు దేవుడు మనోలోకవాసి. కొంతమందికి తనమీద తనకు నమ్మకం లేనపుడు ఒకటి అండదండ అవసరం అయింది. అది ప్రత్యక్షంగా లేనపుడు వూహించుకోవాల్సివచ్చింది. అలాంటి ఊహల్లో భాగంగా 'దేవుడు' అన్నరూపం గోచరించింది. అది కాలం మారేకొద్దీ రకరకాల రూపాల్ని పేర్లని పొందింది. అది అసలు మనోరూపం అన్న విషయం మర్చిపొయ్యారు.

ఒక్కో పండగ దినాన ఒక్కోరూపంతో దేవుణ్ణి కొలవసాగారు- ఒక్కో పండగలో ఒక్కో రకమైన ఫలహారాల్ని తినసాగారు. అలా కేవలం తీరుబడి కోసం, ఆత్మధైర్యం కల్గించడం కోసం ఏర్పడ్డ పండగలు, దేవుళ్ళు ఎక్కువై పోయి మానవుడు వాటికి బానిసై పొయ్యాడు. ఇంటిలో వుప్పుకి గతిలేక పోయినా, అప్పుచేసైనా పండగ చేయాలన్నంతగా అందులో కూరకపొయ్యాడు. ఆత్మధైర్యం కల్గించడం కోసం వచ్చిన ఆ దేవుడు మనిషి మీద పెత్తనం చెలాయించ సాగాడు. ఆ పెత్తనాన్ని విస్తరింపజేసేవాళ్ళు ఈ-బాబాలు, మఠాధి

పతులు, జియ్యర్లు మొ॥వాళ్లంతా. వీళ్లు తాము దైవాంశసంభూతులమని చెప్పు కొంటుంటారు. ఏవో కొన్ని మహిమల్ని చూపిస్తూంటారు. ప్రజలు వాళ్ళ మహిమల్ని చూసి, వాళ్ళని దేవదూతలుగా భావించి పూజిస్తారు. ఈ విషయంలో గూడ సుందరరామయ్యగారి అభిప్రాయం ఇది :

'[13]"భగవంతుని లక్షణాలను మానవుడికి అంటగట్టడం ఈ రోజుల్లో ఫాషను (Deification of the man is the fashion of the day) తత్ఫలితంగా మనం అనేకమంది 'Deified men' (భగవదాంశులను) చూస్తాము. వీరిలో కొందరు తాము భగవంతుని చూచినామనీ, కొందరు భగవంతునితో మాట్లాడి నామనీ మరికొందరు తాము భగవంతుని దూతలమనీ అంటారు. తమ మాటలపై సామాన్య ప్రజానీకానికి నమ్మకం కుదరడానికై అసామాన్యమైన అద్భుత చర్యలను ప్రదర్శిస్తారు. ఈ ప్రదర్శనలతో వీరికి ప్రాపగాండా లభిస్తుంది. మతోన్మాదులు, భావావేశపరులు, ధనికులు, ఆర్తులు—అంతా వీరిచుట్టూ చేరతారు. అద్భుత విషయాలను ప్రచారం చేయడానికి వీరు సందే హించరు. సంఘంలో తమకున్న పలుకుబడి ద్వారా వీరు ఈ ఉద్యమాన్ని ప్రచారం చేస్తారు. తామర తంపరులుగా ఈ విషయానికి విలువ పెరుగుతుంది. విలువ పెరిగినదేదీ కూడా విరివిగా దొరకదు. అందుకని అసలు విషయాన్ని Mystery గా ఉంచుతారు. ఆసక్తి పెరిగిన కొద్దీ ఆరాటము. ఆరాటం పెరిగిన కొద్దీ అభిమానం పెరుగుతుంది. అభిమానం రకరకాలుగా అభివృద్ధి చెందు తుంది. దాన్ని అనేకరూపాల్లో వ్యక్తం చేస్తారు. అలా తమ ఆవేశాన్ని భక్తి రూపంలో వెల్లడి చేసినామని సంతోషిస్తారు. ఇలా ప్రజలు ఆ బాబాల మహి మల్కి, ఆకర్షితులై, మన్నుదిన్న పాములై పోతుంటే, దిగంబరకవులు ఆ బాబాల్ని, మఠాధిపతుల్ని, బత్తల బజారు కీడ్చి చరచాలన్నారు.

(240) జనాన్ని జాతి నరనరాన్ని. మతమౌఢ్యానికి తీర్చి తీర్చి
వయసులో నానాపాయసాలూ మరిగి మరిగి
కొవ్వెక్కిన పిట్టగూళ్ళ తలబుట్టల బాబాలే
చక్రవర్తుల్లా ఊరేగే జగద్గురు సాముల్లార్లే
ఈ కుష్ఠు వ్యవస్థకు మూల విరాట్టులు.

వీళ్ల నిర్వీర్యాన్ని దేశం నలుమూలల నిండా పారిస్తున్నారు. చీకటి బజారు జలగల్నీ రాజకీయ బొద్దింకల్ని, పదవీ మదాంధుల్నీ, సాహిత్య వందిమాగధుల్నీ- అభయ హస్తంతో కాపాడే కంకణం కట్టుకొని, మనిషిని ఏనాడో మర్చిపోయి, మంచితనాన్ని అంటరానితనంగా ఎంచే తుచ్ఛులు. దేవుళ్ళ దేవులాటలో, మహామహా మాయల నాయాళ్ల సన్నాసుల జోగుల మోజుల్లో పడిపోయిన దేశాన్ని భవిష్యత్కాలాన్ని కాపాడడానికి నడుం కట్టమని యువకుల్కి పుద్బోధిస్తున్నారు దిగంబరకవులు. 'పటాటో పాలతో మత్తెక్కి, నిర్వికారులమని చెప్తూ, అరిషడ్వర్గాలకి, మరింత సన్నిహితంగా చరించే, అహంకార భూయిష్ఠులైన స్వాములార్లనీ, పులిహోర దద్దోజనాలతో శరీరాన్ని చి ్వలాసంగా పెంచుతున్న జియ్యర్లనీ, 'షోడశవర్ష కన్యల పవళింపు సేవలతో మతాన్నీ, దేశాన్నీ, ఉద్ధరించే'బాబా'ల్నీ కాదు పూజించాల్సింది. 'వీళ్ళంతా పోరంబోకులు'. 'స్వకుచమర్దనోత్సాహులు'. హస్తప్రియోగంతో హఠయోగం సాధించిన వాళ్లు. ళ్ళని కాదు. దేవుణ్ణి పూజించు. దేవుడంటే, 'ఆలినర్పించి పొందే ప్రమోషన్ల కోసం ముడుపులందు కొనేవాడు, సరదాకోసం, గ్లామరుకోసం పూజలందుకొనేవాడు, నవరత్న ఖచిత సువర్ణ కిరీటం కోసం, నిలువు దోపిడీల కోసం, నెత్తిమీద జుత్తుకోసం అమ్ముడు పొయ్యేవాడు' కాదు. నిజమైన దేవుడు, రూపాయలకీ అంగాల పొంగులకీ భగవిశ్వాసాలకీ తాకట్టు పోనివాడు. 'జీవితాన్ని నిర్వచించే వాళ్ళన్నా, మానవోద్ధరణోపన్యాసాలతో, మారణాయుధాన్ని మించిన మాటలతో మానవ జాతిమీద పడి బతికే, అశుద్ధాస్వాదనాపరులైన పందుల్ని అసహ్యించుకొనే వాడు, అంతేకాని

(259) 'మానినీ మానస చోరుడు
చిద్విలాసరూపుడు
ఆర్తత్రాణ పరాయణుడు
గోపీ పీన పయోధర మర్దనుడు

అఖిలాండ కోటి బ్రహ్మాండనాయకుడు' లాంటి 'చచ్చుపీనుగ' కాదు దేవుడు. దేవుడంటే—

251 'వదిలి పోయిన జీవితాల కుదుళ్ళలో ఆత్మీయతని విదిల్చి మనిషిని
మనిషిగా గుర్తించి
మనిషిగా .... .... బ్రతికేవాడు.

251 'ఎవరికీ కాని కుక్కపిల్ల మీంచి కారు నడిచినప్పుడు మెతుకు కోసం
మానాన్ని కాల్చుకున్నప్పుడు జాలిబడ్డ గుండె .... దేవుడు.

251 'చీము నెత్తురూ వున్న మానవుడు

మానవత్వాన్ని తప్ప మరోమతాన్ని అంగీకరించ"ని వాడు మానవుడు. వాడే, అలాంటి వాడే దేవుడు. అలాంటి దేవుణ్ణి పూజించాలి. చచ్చు దద్దమ్మని రాళ్ళలో కొయ్యలో వున్న రూపాన్ని కాదు.

## కవితా రంగం :

నేను చెరచబడ్డ గీతాన్ని
నగ్నంగా నడివీథిలో కాటేసిన భూతాన్ని

ఈ గేయం ఆధునిక కవిత్వం పై దిగంబర కవుల అభిప్రాయాన్ని తెలియజేస్తుంది. దీనికి కారకులు ఆదినుంచి అనువాదానికీ, అనుకరణకీ, అలవాటు పడ్డ తెలుగు కవులు. వీళ్ళు తమ వుద్యమాన్ని ప్రముఖ కవుల్ని ఈసడించడంతో ప్రారంభించారు. దీనివల్ల ఈ వుద్యమం ఎక్కువగా కవిత్వానికి సంబంధించింది అని అనుకోవడానికి వీలవుతుంది.

(7) నన్నయను నరేంద్రుడి బొందలోనే
నిద్రపోనియ్యి

అంటూ నన్నయ నించి తమ ముందటి తరం కవుల వరకు అందరికీ 'గుడ్ బై' చెప్పి, తమ వుద్యమాన్ని ప్రారంభించారు దిగంబరకవులు. వీళ్ళు ప్రాచీన సాహిత్యం కన్నా, ఇరవయ్యో శతాబ్ది కవితనే ఎక్కువగా గర్హించారు.

(౩౮) 'అందమైన ఆడదాన్ని వెతికి తెచ్చి
ఊపిరాడని గదిలో బంధించి

వాయువ్యాన్ని ఊహాల పల్లకిలో ఊరేగించి
పాదాలు పట్టుక వ్రేలాడే కవి
కోలుకోలేనెప్పుడు నిరంతరాల వ్యాధి' అనీ

(177) 'ఏవ త్రైవే నువ్వు
స్త్రీవా, భావ కవివా, కొజ్జావా ?
....  ...  ...

(178) నువ్వు ఆడదానివా, అసలిసశృంగార కవివా, ఆడంగిరేకువా ? అనీ భావకవుల్ని ఈసడించుకొన్నారు.

(93) 'నిద్రావేదికల మీద
ఛాందసమేకాల్లో లాభాల్లో
ఆడదాన్ని అందాన్ని స్వీయకవిత వ్యాపారాల్లో
వేలం పెట్టి డబ్బా కొట్టిన

ప్రబుద్ధుల .... .... ఆట కట్టిందని చెప్పడం మరో కవితలోని విషయం. పండగకీ, పబ్బానికి, స్వీయకవితా వ్యాపారాన్ని సాగించే కవుల్ని, వీళ్ళు దుయ్యబట్టారు.

(144) 'లారీ నిండా పుస్తకాలు రాసి
లారీలా అరిచే
కులమత తత్వ 'సామ్రాట్టులు' — అనీ

(100) 'మురిగిపోయిన శాంతి నికేతన్ ఊరగాయజాడీలు'—అనీ ప్రముఖ కవుల్ని దూషించారు. దాంతో బాటు

(159) ఒక వర్గవిశేషాన్ని ఆకాశానికి ఎత్తి
జేబులు నింపుకున్న సాహితీయాచకులు
సుసంస్కృతులని సంస్కృతమనే సొమ్ములు వేసి
అనాగరికులని నీచంగా కొందరిని సొమ్మసిల్ల వేసి

స్వోత్కర్షతో సాగిన ......." గతకాలం కవిత్వాన్ని నిరాకరించారు.

దిగంబర కవిత్వంలోని అక్షరాలు

(15) 'పదాల గారడీలో
పరమార్థం చూపే పక్షులకి—
ప్రబంధాల—పురాణాల
అసలు తత్వం విడిచి పెట్టి
చూర్లు పట్టుకు వేళ్ళాడే చుంచులకి—
తమలో ప్రపంచంలో
కొత్తదనం చైతన్యం
కోరని, హర్షించని—సహించని కొజ్జాలకి
తామే యుగకర్తలమని
తమదే సాహిత్యమని
తప్పెట్లు కొట్టుకునే తార్పిస్టులకి' అర్థం కావని

నిక్కచ్చిగా చెప్పారు. వాళ్ళ కవిత్వం అర్థం కావాలంటే నిర్మలమైన భావ వీచికల్ని పట్టుకోవాలంటే, ఎరువు తెచ్చుకొన్న కళ్ళనీ, మెదడుని పక్కకు పెట్టి స్వచ్ఛంగా, హాయిగా చూడగల కళ్ళతో, స్వచ్ఛమైన, దేశీయమైన మనసుతో చూడాల్సి వుంటుంది.

ఇక ఛందస్సు కవితకి అవసరమా, అనవసరమా? అని తల బద్దలు కొట్టుకొంటున్నప్పుడు, విశ్వవిద్యాలయ సిలబస్ (పాఠ్యప్రణాళిక)లో అదో పెద్ద చర్చగా జరుగుతున్నపుడు, దిగంబరకవి ఛందస్సుని గత తరానికి సంబంధించిందిగా గుర్తించాడు. గుర్తించి

(45) 'ఛందోబద్ధ సాహితీ వృక్షంలో
చీడపురుగు గూ పెడుతున్నది
కాపలా కాసే బిరుదురాయుళ్ళ కళ్ళకు
కాలదోషం పట్టుకుంది
ఇక ఈ మాను విస్తరించదు
మళ్ళీ వసంతాన్ని చూడదు' అని ఖచ్చితంగా

తేల్చి చెప్పేశారు. చెప్పి, వచన కవితని ఆధునిక ఛందస్సుగా గుర్తించక పోయినా, తమ కవితల్ని దిక్కులుగా పరిగణించుకొన్నా, వాళ్ళు రాసింది వచనకవితే.

## ఎందుకు చెప్పారు :

దిగంబర కవులు ఇలా రాజకీయ, సాంఘిక కవిత్వాది రంగాల్ని విమర్శించారు. ఇలా ఎందుకు విమర్శించాల్సి వచ్చింది ? అని ప్రశ్నించుకొంటే 'మానవత్వం' కోసం అన్న విషయం తట్టుతుంది. మానవత్వం సమాజంలో ఎపుడో ఇంకి పోయిందని వాళ్ళ అభిప్రాయం. దాన్ని అట్టడుగున్నించి లేపి, మానవత్వం అన్న ఆ మందును సమాజానికి ఇవ్వడం దిగంబర కవులు చేయ దల్చుకొన్న పని. ఈ విషయం 'ఎందుకు చెప్పారు' ? అన్న ఈ అంశం కింద వివరింపబడుతుంది, వాళ్ళ కవితల్లో కొన్నిటిని పరిశీలిద్దాం.

కలియుగం రేడియో గ్రామ్ లో

(21) గిరగిర తిరుగుతున్న క్రీ.శ. ఇరవయ్యో శతాబ్దం రికార్డుమీద పిన్నునై
మానవత రెండు కళ్ళూ మూసుక పోయినప్పుడు
విప్పు కుంటున్న మూడో కన్నునై

మానవత మసి పాతలా మారి పోయినప్పుడు
(28) మాసిపోయినప్పుడు
నేను వస్తున్నాను దిగంబర కవిని' అంటున్నారు మహాస్వప్న.

(28) మానవతను ధ్వంసం చేసి
మనిషిని "మాంసం" లా కోసి
వేడి వేడి నిట్టూర్పుల పై
మడి కట్టుక ఉడక బెట్టి
అశ్రు రసంలో "షోర్వా" కానుక
ఆరగిస్తున్నాం అని,
సంకుచిత తత్వాన్ని మనమంతా

(30) సాంప్రదాయబద్ధం చేసేసుకొన్నాం
కాబట్టి మనకింకా అర్థం కానిది
సర్వమానవ కళ్యాణం అని

(30) మానవతనే విస్మరించిన
అవయవాల యంత్రాలం .... అనీ

కారణం సంఘం మొత్తం అనీ జ్వాలాముఖి అంటున్నారు.

(93) 'జాగృతిలో దయ అంచులపై నడిచి
సైతాను నరాల్లో మేల్కొని
మనిషిలోని మట్టిని
నలు మూలలా విసిరేస్తూ నిద్రిస్తుంది' అనీ

(152) సీమలు లేని మానవాత్మలో
గడ్డ కట్టిన సౌందర్యంతో
రమిస్తున్న శవభోగులు' కారణమనీ అంటున్నారు నిఖిలేశ్వర్

(151) పెంట పోగున కుక్కల పందుల కాళ్ళకింద విస్తరిలా
రోడ్డు మధ్య
మానవత్వం మడుగులో
దేశం కొనవూపిరి '....తో వున్న శవంలాగా తయారయింది

అంటున్నారు నగ్నముని.

(89) జహారుజా దురాక్రమణలో నిజస్వరూపాల్ని కోల్పోయిన
మానవ జాతి
చావు బ్రతుకుల మధ్య నెత్తుట్లో తడిసిన సరిహద్దు రేఖలా
మానవత'

వుందంటున్నారు మహాస్వప్న.

నాడు

మానవతా ఝురులు పారాయి

(99) మంచితనం తీరాలు వెలిశాయి
పాప పుణ్యాతీత లోకం శాంతి వెన్నెలను సాకింది

వర్ణాలు లేని మానవ స్వర్గాలు

నదుల నాగరికతల్లో శీర్షాలుగా వెలిశాయి" అలా స్పందిస్తే మంచికాలం పరిణామం వల్ల చెడిపోయింది.——

(100) నడచినది పరిణామం

చెడినది మానవారామం

ఈప్సితారణ్యాలతో వాంఛల నాగజెముడు లేని

శిపమైత్రి వర్తించాయి,

మానవతా కమలాలు 'మనిషికొలను'లో వాడాయి,

దానికి కారణం నాగరికతా వ్యామోహం అంటూ

దారుణరూపం దాల్చిన దానవతా చర్యలలో

హాయల లోయల్లో

శిథిలమైన మానవత' మరణించిందంటూ,

(102) వెక్కి వెక్కి కురిసిన నవ్వులలో పరిణామ మెరసి మాసింది

స్రుక్కిన మానవతారామం ఆవురుమంది.

అన్నారు. అలా ఆవురుమన్న మానవతా శిశువు ఆశ్రయానికి పరుగులు తీయడం అరణ్యరోదన అవుతూంది అంటున్నారు జ్వాలాముఖి.

ఇలా దిగజారిపోయి, కృశించి, ఆవురుమంటున్న మానవత.

(241) 'మనిషిని ఏనాతో మరిచిపోయి

మంచితనాన్ని అంటరాని తనంగా ఎంచే తుచ్ఛులకు

(153) 'మానవత్వపు విలువలు

చొల్లు కింద కారుస్తున్న' వాళ్ళకూ

'మానవతా శాద్వలాల దహన క్రియాదారుణా'లు చేస్తున్న తుచ్ఛులకీ అర్థం కావంటున్నారు చెరబండరాజు, జ్వాలాముఖిలు.

ఇలా వున్న సంఘంపై మానవతపై దిగంబర కవుల అభిప్రాయం ఏంటి ? వాళ్ళెందుకు కవిత్వాన్ని రాశారు' అని ప్రశ్నించుకొంటే—

(111) 'మంచి చచ్చి పుచ్చిన మానవతలో
శవాలుగా మిగిలిన మనుషుల'
ఆశల చరమ శ్వాసల చూసి జాలిపడి

(10) 'ముక్క క్రింద క్రూరంగా నరకబడ్డ
మానవజాతి మహా కల్పవృక్షాన్ని' చూసి

(14) మనిషిలో అట్టడుగున బురదగుంట్లో
పడివున్న మనీషిని లేవదియ్యడానికి,

(156) 'సుభిక్షాన్ని వెన్నుపోటు పొడుస్తున్న నదుల్ని
జుట్టు పట్టి, వొళ్లు వొంచి మానవత్వం మళ్ళలోకి
....ప్రవహింప' జెయ్యడానికి

(164) ఈ మానవత్వం రక్తాన్ని పీలుస్తున్న తోడేళ్ళని పాతెయ్యడానికీ, ఈ ఇరవయ్యో శతాబ్దం

(117) జీవితం

జుట్టు పట్టి యీడ్చుకొచ్చి
చెట్టు కట్టి నాగరికత ఒళ్ళంతా చిట్లకో (ట్టు) ట్టి
మానవత్వం మందు పెట్టడానికి
మానవత అసలు రూపు మాసిపోకుండా చూపే
భవితవ్యం
మనిషిని మనిషిగా
ఈ కృత్రిమ దుస్తుల్ని విప్పేసి
నగ్నంగా నిశ్చలంగా సజీవంగా సాక్షాత్తు మానవుడిగా
మట్టిలో పుట్టి మట్టిలో ఎదిగి
కాల రాక్షసి కరాల కందని ఎత్తుకు ఎదిగే

మానవతా నక్షత్రం .... అలాగే ఎప్పుడూ ప్రకాశించ
ానికి దిగంబర కవులు కవిత్వం రాశారు.

ఇది అంతా ఎవరికోసం? మనిషి కోసం. మామూలు మనిషికోసం. ఆకలితో నిర్విరామంగా యుద్ధంచేసే ఆ జీవికోసం. అమాయక ప్రాణికోసం. ఆ ప్రాణి దిగంబర కవిత్వంలో [14]'మానవతా నిగమాగమ ఋషి' అయ్యాడు. [14] మానసిక శిఖరాగ్రాలపై మానవత్వాన్ని ప్రతిష్ఠించే మహర్షి అయ్యాడు.

మొత్తానికి [15]'సుందర సమతా వ్యవస్థ' ని ఆశించి, మానవత్వం స్వేచ్ఛగా విహరించాలని కోరి దిగంబర కవులు కవిత్వాన్ని రాశారు అని పై పరిశీలన వల్ల తెలుస్తూంది.

దిగంబర కవులు మానవతా మాగాణిని సంపన్నం చేయాలని కవిత్వం రాశారని వాళ్ళ కవితల ద్వారా తెల్సుకొన్నాం, ఇదేపని గతంలో వేమన చేశారు. ఈ విషయంలో వీళ్ళ ఇరువురికీ సామ్యం వుంది [16]

దిగంబర కవులు 'మానవత్వం' కాపురు మంటుంటే, దానవతా చర్యల్లో నగ్గి పోతుంటే, సొమ్మసిల్లి పోతూంటే, ఓదార్చడం కోసం, రక్షించడంకోసం, సేదతీర్చడం కోసం అలజడి లేపారు. సంఘాన్ని తిట్టిలేపారు. మెల్లిగా మేలు కొలుపులు పాడుతూ గాక అశ్లీలంగా, అసభ్యంగా తిట్టుతూ, భయంకరంగా అరుస్తూ లేపారు.

అశ్లీలం :

దిగంబర కవులపై వచ్చిన విమర్శల్లో వాళ్ళ కవిత్వం అశ్లీలం అన్న విమర్శ ఎక్కువగా వినబడుతుంది.

[17]అసలు 'అశ్లీల' మన్నది ఇది అని చెప్పడానికి అవకాశంలేదు. ప్రతి సందర్భమూ వేరుగా వేరుగా పరిశీలించి అశ్లీలత వున్నదా? లేదా? అని నిర్ణయించ వలసిందే. లోకంలో అశ్లీలార్థంలో వున్న పదం సాహిత్యంలో అశ్లీలం అయి తీరుతుందని చెప్పలేం. అసభ్యార్థం ప్రకరణాన్ని బట్టి చెప్పవలసిందే కాని, లైంగిక ప్రసక్తి వున్నంత మాత్రాన అశ్లీలం అని

నిర్ణయించడానికి వీలులేదు." అని వెల్చేరు గారు అశ్లీలం అంటూ ఏదీ లేదని చెప్పారు.

అశ్లీలం వాడిన పదంలో కాదు, పదంవల్ల సాధించే భావంలో వుంటుంది. కామాన్ని రెచ్చగొట్టే చవకబారు పత్రికల్లో వాడే పదజాలానికి దిగంబర కవులు కొన్ని చోట్ల వాడిన పదజాలానికి సామ్యం వుంది. అయితే ఇద్దరి గమ్యం చెరో ధృవం. ఆ పత్రికల దృష్టి మామూలు మనిషి లోని కామాన్ని రెచ్చగొట్టడం. తమ పత్రికల్ని విరివిగా ప్రచురించి డబ్బు సంపాదించడం. దిగంబర కవుల దృష్టి మామూలుగా మనషుల నించి మేధా వుల వరకు ఒకసారి వెనుతిరిగి చూసుకోమని చెప్పడం. ఒకరి దృష్టి కేవలం ధన సంపాదన. మరొకరి దృష్టి కార్యోన్ముఖుణ్ణి చేయడం. ఇద్దరూ ఒకేరక మైన పదాల్నే వాడుకొన్నా, దృక్పథాలు వేరు కనుక, ఒక దగ్గర అశ్లీలం అయింది మరో దగ్గర కావడం లేదు. దీన్ని ఆంగ్లంలో Pornography అంటుంటారు. అలా అవుతూంది అంటే గాడిదని గుర్రాన్నీ ఒక గాట కట్టేసి నట్టే లెక్క.

అసలు అశ్లీల పదాల అవసరం ఎపుడు కల్గుతుంది?

1. తాను అశక్తుడై ఎదుటివాడు బలవంతుడైనపుడు వాణ్ణి ఏమీ చేయలేక పోయినపుడు, తన కోపము ఎటూ బలప్రయోగంతో తీర్చు కొనేందుకి వీలు కానపుడు 'తిట్టు'కు అవసరం కల్గుతుంది.

2. ఎదుటివాడు తాను చెప్పిన పనిని చేయనపుడు, తాను బలవంతు డయితే 'తిట్టు'కు ఆస్కారం కల్గుతుంది.

3. ఆత్మీయులైన వాళ్లు కింకర్తవ్యతా మూఢులై మన్ను దిన్న పాములై పడు కొన్నప్పుడు, ఆత్మీయుడిగా, హితుడిగా అతన్ని కార్యోన్ముఖుణ్ణి చేయడం కోసం, పౌరుషం కల్గించి వెన్ను తట్టి బరిలో నిల్పడం కోసం 'తిట్టు' పదాల్కి ఆస్కారం కలుగుతుంది.

దిగంబర కవుల రచనల్లో కనబడే తిట్లు పై చెప్పబడ్డ వాటిలో మూడో రకానికి చెందిన తిట్లుగా గుర్తించ గలం. కనుక దిగంబర కవుల రచనల్లో వున్న తిట్లు కార్యోన్ముఖుణ్ణి చేసేవే కాని నీచపర్చేవి కావు. మానవత్వం అనే

కమలం వాడి పోయినప్పుడు, మానవత్వారామం ఆవురుమంటూ వున్నప్పుడు, కత్తురూ వున్న మానవుడు సంఘటనల్కి స్పందించడం మర్చిపోయి, యాంత్రిక జీవనాన్ని అలవర్చు కొన్నప్పుడు, రూపాయి బొమిక కోసం అభిమానం, అవమానం మర్చిపోయి, కుక్కల్లా కాకుల్లా కప్పుకొంటున్నపుడు తన్నుకొంటున్నప్పుడు, రాజకీయ నాయకుల పదవీ ప్రాబల్యంతో తమ బంధువులకి, హితులకి, శ్రేయోభిలాషులకి వున్నదంతా వూడ్చిపెట్టి, సామాన్య మానవుడి జీవితాన్ని ఎంగిలి విస్తరాకుగా మార్చుతున్నప్పుడు, స్వాతంత్ర్యం ఎన్నో ఏండ్లయినా పరాయి దేశంతో యుద్ధంచేసి గెలుపందుకొనే ఆశ అడుగంటినపుడు దేశాభివృద్ధిపేర ప్రవేశపెట్టబడ్డ పంచవర్షప్రణాళికలు కేవలం ఫైళ్ళలోనే తలదాచుకొంటున్నపుడు, పరిపాలన కోసం పరిగెత్తిన నాయకులు, 'సంగి వెధవలై,' ముఖ్యపట్టణాల్లో రమ్యహర్మ్యచంద్రశాలల్లో తిష్టవేసి. సామాన్యుని గోడు వినక తన వునికిని కాపాడుకొంటున్నపుడు, కొన్ని ప్రాంతాలు వరద ప్రాంతాలయి, మరికొన్ని కరువు ప్రాంతాలయి వాటి నివారణ కోసం ఆనకట్టలు కట్టాల్సి వచ్చినపుడు వేసిన పునాది రాళ్ల తమ ప్రచ్ఛన్న వేషాల్తో నదుల్లో కల్సిపోతున్నపుడు, ఆనకట్టలే ఆత్మహత్య చేసుకొంటున్నపుడు, దానికి కారకులైన వాళ్లు కోట్లు కోట్లు కూడబెట్టుకొంటున్నపుడు, వీళ్ళద్వారా బతకాల్సినవాడు 'వానకురిస్తే' అని ఆకాశం వంక చూస్తున్నపుడు, పండించిన సరుకంతా పెద్దోళ్ళ ఇండ్లలో తలదాచుకొని సామాన్యుల్ని ఆకలి జీవనానికి ఎర వేస్తూన్నప్పుడు, దైనందిన సామగ్రి తిన్నగా దొరక్క 'బూచి' ఆట ఆడుతున్నపుడు, వాటికి కారణాలు తెల్సుకొని నివారణోపాయాలు కనుకొనాల్సింది పోయి, ఏమీ పట్టనట్టు కూర్చొన్న మనిషిని చూసి జాలి గల్గింది దిగంబరకవుల్కి. అతన్ని లేపడం కోసం, కార్యోన్ముఖుణ్ణి చేయడం కోసం, అతని వ్యవస్థను, ఈ కుష్టు వ్యవస్థను సుందర సమతావ్యవస్థగా మార్చడం కోసం మనిషిలో అట్టడుగున వున్న మానవత్వాన్ని మనీషిత్వాన్ని లేపడం కోసం, ఎదుటి వాడి కష్టాల్లో పాలుపంచుకొనే మానవ సహజ నైజాన్ని పునరుద్ధరించడం కోసం దిగంబర కవులు 'తిట్టు'ని వుపయోగించుకొన్నారు. వీళ్ళ కవిత్వంలో తిట్టు సంజీవిని, సోమరితనం చేతగానితనం లాంటి సర్వ రోగ నివారిణి.

# దిగంబర కవిత్వం గొప్ప కవిత్వం అవుతుందా

[1]"సంఘంలో ఊపిరి పీల్చే ప్రతిమనిషి ఉనికి కోసం తపన పడి అతడి బాధని చూసి వెక్కి వెక్కి ఏడ్చి, పిచ్చెత్తి, ప్రవహించిన కవిత, దిగంబరకవిత కనుక, ఆ కవితలో సామాజిక స్పృహ వుంది. ప్రియురాలి పదాల గునగునల్ని గాక, సాటిమానవుల కష్టాల్ని చూసి స్పందించిన వాళ్ళు దిగంబర కవులు. కవి కూడా సంఘ జీవి. సంఘం లేక వ్యక్తి లేడు. వ్యక్తి లేక సంఘం లేదు. రెండూ అవినాభావ సంబంధులు. అలాంటి సంబంధంలో కవిగూడా ఒక వ్యక్తే కనుక అతడు సంఘాన్ని వదలి ఏదో లోకంలో విహరించజాలడు. విహరించిన వాళ్లు లేకపోలేదు. అలా ఏదో లోకంలో విహరించకుండా సంఘాన్ని ప్రతిబింబిస్తూ రాయబడ్డ రచనల్ని సామాజిక స్పృహ కల్గినవిగా గుర్తించొచ్చు. సంఘంలోని అత్యధిక ప్రజల్కి ఏది అవసరమో, దాన్ని కవితలో చొప్పించడం సామాజిక స్పృహ.

కేవలం సామాజిక స్పృహ మాత్రం కవికి వుంటే చాలదు. భావ తీవ్రతకూడా వుండాలి. ప్రకృతిని చూసినంతనే పులకరించే మనస్సు గలవాడు, స్పందించే భావుకత గలవాడు కావాలి. ఆ భావాల్లో మదిలో మెదిలే వూహల్లో బతకలేనంతగా నలిగిపోయే హృదయం కలవాడు కావాలి. ఇవి కవిని పండితుని నించి వేరుచేసే కొన్ని లక్షణాలు. దిగంబరకవుల్లో ఈ భావ తీవ్రత కొట్టొచ్చినట్టు కనబడుతుంది. కవులకుండాల్సిన స్పందనం, సంఘటనల్ని చూసి వూగిపోవడం కనబడుతుంది. అయితే భావతీవ్రత ఒక ఆధారం (base) మాత్రమే. శిల్పి చేతిలో చక్కగా మల్చబడేది కవిత్వం. శిల్పం చెక్కేందుకు కావాల్సిన అనేకమైన ముడి సరుకుల్లో నల్లరాయి ఒక్కటి. అది శిల్పానికి ఎంత అవసరమో కవిత్వానికి భావతీవ్రత అంత అవసరం. అది కేవలం ముడసరుకు మాత్రమే.

ఇలా సామాజిక స్పృహ, భావతీవ్రత వుంటే సరిపోదు. ఎలా ప్రతిబింబింప జేయాల్నో కూడా తెలిసుండాలి. ప్రజల భాషలో, పదుగురు వాడే భాషలో రాయాలి. రాసింది చెప్పబోవు విషయాన్ని స్పష్టంగా తెలియజేస్తుండాలి. దిగంబర కవుల కవిత్వంలో విషయం అన్ని విధాలా అధోగతి పాలైన

మనిషిని లేవదియ్యడం, భావకవిత్వం పద్ధతిలో రచించి వుంటే హాస్యాస్పదం అయి వుండేది. ఒకనాడు వ్యావహారిక భాష హాస్యం కోసం వాడబడుతుంటే దాని స్థానం గ్రాంథిక భాషకి వచ్చింది. ఒకనాడు రమ్యహర్మ్య గోపురాలు కల్గి చంద్రుని తాకుతున్న భవనాలు, రచనకి స్పందన కల్గిస్తే నేడు పూరి గుడిసెలు ఆ స్థానంలో వున్నాయి. వివిధ వృత్తాల్లో రాయడం ఒకనాటి సంప్రదాయం అయితే వచన కవితలో రాయడం దిగంబరకవుల నాటి విషయం. [19] రాక్షసుడు వెంటపడి తరుముతూ వుంటే ఆ అబల తడబడే అడుగుల్కి అంగాల కదలికల్కి హాహా అని నాడు మెచ్చుకొంటే, ఆ స్త్రీ కష్టాల్కి స్పందించడం నేటి ప్రత్యేకత. ఇది పరిణామ ఫలితం. అలాంటి పరిణామాన్ని కవి గుర్తించకపోతే అతడు కవి కావొచ్చునేమో గాని యుగకవి కాలేడు.

దిగంబరకవులు సంఘాన్ని చూశారు. ఒకపక్క డబ్బున్న మహారాజుల కేళీవిలాసాలు, విదేశ ప్రయాణాలు, మరోపక్క పేదోళ్ల మట్టి పిసుకుళ్లు, [20]మదత కుడుములునీ గుర్తించారు. రాయగల్గిన నేర్పువున్న కవులు కనుక, పరిణామాన్ని గుర్తించిన కవులు కనుక పేదోళ్ల కష్టాల్నించి వుత్తేజనం పొందారు.

అలా సామాజిక స్పృహ కల్గి, భావతీవ్రత మెండుగా గల్గి, రాయగల్గిన నేర్పువున్న కవులంతా మంచి కవులవుతున్నారా? అన్న సందేహం రాకమానదు. ఈ మూడు మాత్రం వుంటే చాలదు. ఈ మూడూ అవసరమే. వీటి సహాయం ద్వారా ఉదాత్తత కల్గిన కవిత్వం రాయాలి. ఉదాత్తత అంటే కాలానుగుణ్యంగా రాయబడ్డది అని స్థూలంగా అనుకోవచ్చు. కాలానుగుణ్యం అనుకొన్నప్పుడు అది పరిణామాన్ని గుర్తించిన కవిత అవుతుంది. పరిణామాన్ని గుర్తించడం తీసుకొనే వస్తువుకి సంబంధించింది. ఉదాత్తత కల్గి వుండడం రచనకి సంబంధించింది.

దిగంబరకవులు కవిత్వాన్ని తమ అభిప్రాయాల్ని చెప్పేందుకు వుపయోగించుకొన్నారు. ఇదేపని గతంలో వీరేశలింగం గారు సాహిత్యం ద్వారా చేశారు. బాల్య వివాహాల్ని విమర్శిస్తూ విధవా పునర్వివాహాల్ని ప్రోత్సహిస్తూ వారు రచనలు చేశారు. దిగంబరకవులు మానవ జాతిని మేల్కొల్పి, మాన

వత్వానికి పాదులు వేయడంకోసం రచనలు చేశారు. ఈ విషయంలో ఇద్దరిదీ ఒకేబాట.

సంఘంలో వున్నది వున్నట్టు ప్రతిబింబించి నంత మాత్రాన అది కవిత కాదు. సంఘ ప్రభావం వుండాల్సిందే. పరిణామాన్ని గుర్తించాల్సిందే. రాయగల్గిన సత్తా కల్గివుండాల్సిందే. కాని అవి అన్నీ బాహ్యానికి సంబంధించి నవి. సంఘాన్ని యథాతథంగా ప్రతిబింబించడం రాజకీయ వుపన్యాసంలో కనబడుతుంది. దిన, వారాది పత్రికల్లో కనబడుతుంది. మరి అవి అన్నీ కవితకిందికి రావడం లేదు. ఆయా రచయితలకు, కవికి వుండాల్సిన అన్ని లక్షణాలుంటాయి. అయినా వాళ్లంతా కవులు కావడం లేదు. కారణం అక్కడ వాస్తవికత వుంది. కవిత్వం లేదు. [21]'కవిత్వం అంటే కవి కేవలం వూహించి రాసేది కాదు. అలా అని వస్తువుని యథాతథంగా చిత్రించే వాస్తవిక రచనా కాదు'. రెంటి కలయిక. అందువల్ల అవి తమ తమ ధర్మాల్ని కోల్పోయి. Compound లాగా మరోధర్మాన్ని సంతరించుకొంటాయి. అటు భౌతికమైన వాస్తవం, ఇటు కవిభావన యథాతథంగా వుండవు. రెండూ కల్సిపోయి, తమ తమ ధర్మాల్ని పోగొట్టుకొని, వినూత్నరూపంతో బయటికి వస్తుంది. లోకమనోభిరామమైన చిత్రం దోబూచులాడుతుంది. అక్షరాల వినిమయంతో కుదించిన బొమ్మ, 'మనసు గీచిన బొమ్మ' అవుతుంది. అది కవిత్వం. అలాంటి కవిత్వం దిగంబర కవుల్లో లోపించింది. అలాంటి ఉదాత్తత కరువయింది.

అందుకే దిగంబర కవిత్వం ఉదాత్తమైన కవిత్వం గాకుండా పోయి ప్రచారకవిత్వం అవుతూంది.

## తెలుగు సాహిత్యంపై దిగంబర కవుల ప్రభావం :

ఒక తరం కవులు ప్రతిభావంతులయితే, వాళ్ళ ప్రభావం తర్వాతితరం మీద వుంటుంది. వాళ్ళకి మార్గదర్శకులవడం జరుగుతుంది. అలాంటి విషయంలో దిగంబర కవులు విషయం అపవాదం కాదు.

అ. దిగంబర కవుల ప్రభావం తెలుగు సాహిత్యం పై బాగా పనిచేసింది. 1982 తర్వాత కడుపులోని చల్ల కదలకుండా వున్న అభ్యుదయ కవులు తమ తమ నెలవుల్ని వెతుక్కోసాగారు,

ఆ. ఆధునిక ఛందస్సుగా రూపం దిద్దుకొంటూ వుండిన వచన కవిత ప్రచారానికి బాగా వుపయోగపడుతుంది, అన్న విషయం తెల్సింది.

ఇ. కేవలం రాజకీయ వుద్యమాలు వుంటేనే గాని కవిత్వంలో కణికలు రాల్చడం వీలు పడదు అన్న విషయం పరాస్తమయింది.

ఈ. విప్లవ రచయితల సంఘం ఆవిర్భావానికి ఒక కారణం అయింది.

ఉ: కవిత్వం కేవలం కవిత్వం కోసమే గాకుండా తమ భావాల్ని, వుద్దేశాల్ని ప్రచారం చేయడానికి కూడా వుపయోగపడుతుందని రుజువయింది.

ఇలా కవిత్వంలో విభిన్న ప్రభావాల్ని కల్గించిన దిగంబరకవుల రచనలు వాళ్లు కోరుకున్న 'సాంఘిక విప్లవాన్ని' సాధించలేక పొయ్యాయి.

దిగంబర సాహిత్యం ఇతర దక్షిణ భారతీయ భాషల్లో సంచలనం కల్గించింది. దిగంబర కవుల రచనలకి అనువాదాలే గాకుండా, అనుకరణలు కూడా వచ్చాయి[22].

-: o :-

# 4

# విప్లవ కవిత్వం

గతంలోని అభ్యుదయ కవితోద్యమం వలెనే విప్లవ కవితోద్యమం కూడా రాజకీయ ప్రభావం చేతనే తెలుగు కవితోద్యాన వనంలో కాలు నిల దొక్కుకొంది. జనచైనా నాయకుడు మావో—సే-తుంగ్ ఈ వుద్యమం వారికి ప్రధాన కారకుడు. అతన్ని స్మరించిగాని కవి విప్లవకవిగా రాణకెక్క లేదు. మావో అనుయాయిగా, భారతదేశంలో నక్సలిజం పితగా నిలవబడ్డవాడు చారుమజుందార్. చారుమజుందార్, అనేకానేక వీరవిప్లవ మరణం పొందిన వాళ్ళు విప్లవకవుల్కి ప్రేరకులు. అభ్యుదయ కవితోద్యమంలో మార్క్సిజం ప్రభావం వుంది. కాని అదే ఆ వుద్యమ వూపిరికాదు. ప్రధానకారణం మాత్రమే; అయితే విప్లవ కవితోద్యమంలో నక్సలిజం వినా మరేదీ కన్పడదు. మావో అనుసరించిన రాజకీయ సిద్ధాంతానికి కట్టుబడ్డ వుద్యమం ఇది. దేశ దేశాల్లో సర్వమానవ సమానత్వానికి జరిపిన పోరాటాల్లో బలైపోయిన సకల ప్రజలూ వుద్యమానికి అనుయాయులు. వాళ్ళు చేసిన త్యాగాల్తో, ఇచ్చిన సందేశాల్తో ఉత్సాహాన్ని, చైతన్యాన్ని నింపుకొని విప్లవ పోరాటాల కోసం, వాటికి అండదండలు ఇవ్వడం కోసం వెలసిందీ వుద్యమం; నీళ్ళు నములుడు లేకుండా నక్సలిజం సిద్ధాంతాన్ని నమ్మి, బాహాటంగా ప్రచారం చేసింది.

సంఘం మీద సాహిత్యం మీద విసిగి, అసంతృప్తి ప్రబలిన కారణంగా ఇరయ్యో శతాబ్దిలో ప్రపంచయుద్ధాల తర్వాత యువకులు సంఘంమీద, సాహిత్యం మీద తిరుగుబాటు మనస్తత్వాన్ని ప్రకటించారు. ఈ విషయంలో ఇండియా కూడా అపవాదం కాదు.

రాజకీయంగా కాంగ్రెసు సంస్థ, స్వాతంత్ర్యం వచ్చినప్పటినించి అధి కారంలో వున్న సంస్థ, 1968 నాటికి రెండు—సిండికేట్, ఇండికేట్—గా చీలిపోయింది. అటు సిండికేట్ ఇటు ఇండికేట్ ఇండియాని ఎన్నికల రంగా నికి సిద్ధంచేయటంలో మునిగాయి.

[1]సిండికేటు గాళ్ళు
పుండులాంటి వాళ్ళు
రియాక్షన్‌కి గీటు రాళ్ళు

అని శ్రీశ్రీ విమర్శించడం కన్పడుతూంది. అలా సిండికేటు మాత్రమే గాక

[2]దారోల్లంతా దోశేవాళ్ళే
ఉన్నోళ్ళ అళ్ళ పట్టే
పోలీసు అళ్ళ పట్టే
కాంగ్రెసు అళ్ళ పట్టే

అని కాంగ్రెసుని కూడా విమర్శించారు. విప్లవకవులు. [3]27 ఏళ్ళ కాంగ్రెసు పాలన పేదలను మరింత పేదలుగా, ధనికుల మరింత ధనికులుగా మార్చిందనేది కాదనలేని సత్యం. "నిరంతరం పెరిగే ధరలూ, నిరుద్యోగమూ, దేశంలో ఇంకా ఇలాంటి దారుణ పరిస్థితులు ఏర్పడేందుకు కారణమైంది. ఈ ప్రభుత్వం" అన్న సత్యం యువకుల అసంతృప్తికి కారణమైంది.

ఇంచుమించుగా ఈ సమయంలోనే భారతకమ్యూనిస్టుపార్టీ (మార్క్సిజం) (CPI--M)లో కూడా భిన్న అభిప్రాయాలు—తీవ్రవాదులు, మితవాదులు—గలవారు పెరిగారు. తీవ్రవాదులు 1969 ఏప్రిలులో కమ్యూనిస్టుపార్టీ మార్క్సిస్ట్—లెనినిస్ట్ (CPI--ML) అన్న పార్టీని స్థాపించారు. [4]ఇండియన్ కమ్యూనిస్ట్ పార్టీ, మార్క్సిస్ట్ పార్టీలు విప్లవ వాంఛను వదలుకొనడం వల్లనూ, అవి ఎన్నికల్లో తమ నమ్మకాన్ని దృఢంగా కల్గివుండడం వల్లనూ, మార్క్సిస్ట్‌పార్టీ రివిజనిస్ట్‌పార్టీ అయిందాని వల్లనూ తాము CPI--ML ను స్థాపించినట్టు ఆ పార్టీ నాయకులు చెప్పుకొన్నారు. చైనా అధినేత మావో—సే తుంగ్‌ని మాదిరిగా గలపార్టీ మార్క్సిస్ట్‌పార్టీ. వీళ్లు శ్రామిక పోరాటానికి వారసులు.

[5]"ఈనాడు ప్రపంచం అంతటికీ విప్లవ కేంద్రం పీడిత ప్రజల అశా జ్యోతి పెకింగ్ నగరమే. మానవుడు సమసమాజం అనే గమ్యం చేరడానికి ఇంకా చాలా కాలం పట్టవచ్చు. కాని అందుకు సరిఅయిన మార్గం చూపిస్తున్నది

చైనా దేశమే అనడానికి సందేహం లేదు"- -శ్రీశ్రీ—ఇదీ చైనా దేశంపై విప్లవ కవులకున్న అభిప్రాయం.

పశ్చిమ బెంగాల్‌లో భూమిని స్వాధీనం చేసుకొనేందుకు నక్సల్‌బరి, ఖరిబరి, ఫన్సీదేవ గ్రామాల్లో జరిగిన పోరాటంతో నక్సలైట్ల వుద్యమం ఇండియాలో తలెత్తింది. [6]ఇది మార్చిమూడో తేదీ 1967 సంవత్సరంలో బెంగాల్లో మొదటి యునైటెడ్ ఫ్రంట్ ప్రభుత్వం ఏర్పడ్డ మొదటి రోజునే ప్రారంభింపబడ్డది. అప్పటినించి ఈ రైతాంగ పోరాటాలు నక్సలైట్ వుద్యమంగా రూపుదాల్చాయి. దీనికి నాయకుడుగా చారుమజుందార్ కీర్తించబడ్డాడు.

ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఒక రకంగా ఈ సమయంలోనే—1967 ప్రాంతంలో-శ్రీకాకుళ గిరిజనుల అండతో రైతాంగ పోరాటాలు ప్రారంభింపబడ్డాయి. ఉన్న వేల ఎకరాల భూములు ఏకొంతమంది చేతుల్లోనో తగులుకొన్నాయి. శ్రీకాకుళంలో గిరిజనులు, అడవిజాతివాళ్లు ఎక్కువ. వాళ్లు పగలంతా కష్టపడి, భూస్వాములకు ఫలసాయం అందించి, అందుకు వాళ్లిచ్చే కొద్దోగొప్పో తీసుకెళ్ళేవారు. అది వాళ్ళ కడుపుకి చాలేది కాదు. అలాంటి వాళ్ళని మార్క్సిస్ట్‌పార్టీలోని తీవ్రవాదులు ఆదుకొన్నారు. బెంగాల్‌లో 'ఆకలితో చావడం కన్నా పోరాటంలో చావటం మేలు' అంటూ చారుమజుందార్ సాయుధ పోరాటాన్ని ముమ్మరంగా ప్రచారం చేస్తున్నాడు. యువకులు, ఉడుకు రక్తం పొంగే అనేకులు పార్టీపిలుపుని ఆదుకొంటూ వున్నారు. ఊళ్లని వదిలి అడవుల్ని చేరారు. ఆకలి బాధలు చవిచూసిన శ్రీకాకుళ గిరిజనులు ఆ పార్టీ సిద్ధాంతాల్ని పూర్తిగా ఆమోదించి అనుసరించారు. పనులకు వెళ్లడం మానేగాదు. ... దవుల్లో దాక్కొని, పెద్ద పెద్ద భూస్వాముల్ని దోచుకొన్నారు. చంపేగాదు. ... ళ్ల నగర్గ్... ంచి తెచ్చిన డబ్బు తదితరం పేదలకు పంచిపెట్టారు. ... నివల్ల పార్టీ ప్రభావానికి అనేక గిరిజనులు ఆకర్షితులయి సాయుధపోరాటంలో ముమ్మరంగా పాల్గొన్నారు. చారుమజుందార్ లాంటివాడు [7]"కోట్లాది భారత పీడిత ప్రజలకు నేడు శ్రీకాకుళం అనేది ఒక అమరమం, గొప్ప ఆశారేఖ. భారతదేశపు భవిష్యత్ చరిత్రయే శ్రీకాకుళం." అని శ్రీకాకుళాన్ని పొగిడారంటే దాని ప్రసిద్ధిని వేరే చెప్పాల్సిన అవసరం వుండదు. ఈ సాయుధ పోరాటవుద్యమం శ్రీకాకుళం నించి ఆంధ్రప్రదేశ్ నలుమూలలకి ప్రాకింది.

కొంతమంది నక్సలైట్లయ్యారు. మరెంతోమంది కవులయ్యారు.
చేందుకు ప్రభుత్వం 'Police encounter' ల్ని సాకుగా తీసుకొంది. [8]'దొరి కిన వ్యక్తుల్ని నిర్దాక్షిణ్యంగా హింసించి, చంపేసి, పోలీసులకి నక్సలైట్లకి మధ్య జరిగిన ముఖాముఖి పోరాటంలో నక్సలైట్లు చనిపోయారన్న వార్తల్ని ప్రచురించడం ఈ 'encounters' వల్ల తెల్సే విషయం. నక్సలైట్లుగా చిత్రిం చబడ్డవాళ్ళనీ, వాళ్ళ బంధువుల్నీ, స్నేహితుల్నీ, బాధించి, సమాచారం సేకరించాలని ప్రయత్నించింది పోలీసుబలగం. కొన్నికొన్ని ఆచూకీలు సేక రింప బడ్డా ఎంతో వివరం అజ్ఞాతంగానే వుండి పొయ్యింది. 1969 నవంబర్ ఆఖరిరోజుల్లో డిసెంబరు ఆరంభంలో శ్రీకాకుళ రైతాంగ సాయుధ పోరా టంలో పదముగ్గురు కామ్రేడ్స్ అమరులయ్యారు. వారిలో ముగ్గురు స్త్రీలు (దీంతో నక్సలైట్లుగా చిత్రించి ప్రజల్ని సామూహికంగా చంపడం ప్రారంభం అయింది). మరొక నెలరోజుల తర్వాత మరో ఆరుగురు కామ్రేడ్స్ ఒరిస్సా సరిహద్దుల్లో చిక్కి చంపబడ్డారు. ఇలా 1967 నుంచి వున్న రైతాంగ సాయుధ పోరాటం నక్సలైట్ వుద్యమం పేరుతో సాగి 1969 కల్లా ప్రభుత్వం దృష్టిలో పడ్డది. శ్రీశ్రీ

[9]విచిత్ర వీరులు నక్సలైట్లు
అన్యాయాలకి డైనమైట్లు

అని కీర్తించారు వాళ్ళని.

అసంతృప్తి అశాంతిల వల్ల వచ్చిన దిగంబర కవితోద్యమం సాహిత్య లోకంలో సంచలనం కల్గించింది. మొదటి రెండు సంపుటాల తర్వాత దిగం బరకవుల్లో మార్పు రాసాగింది. అంతవరకు స్తబ్దంగా వున్న సాహిత్యాన్ని వెన్నుతట్టి లేపడంలోనే, సంఘంలోని కుళ్ళుని వెలికి తీయడంలోనే నిమగ్ను లయ్యారు. అయినా నిబద్ధత (Commitment) అప్పటికి లేదు.

మూడో సంపుటం (1968 జూన్) తర్వాత మార్పు స్పష్టంగా కన పడింది. అంతవరకు లేని గమ్యం దరి దొరికింది. మార్క్సిజం వినా ఆచరించ డానికి వేరే దొరకలేదు. అంతటితో దిగంబరకవుల్లో కూడా చీలికలు వచ్చాయి. ఇదే సమయంలో "తిరుగబడు" కవులు, మార్చి సంకలనకర్తలు కూడా కొత్త

కావాలని, విప్లవం రావాలని కలలు కంటున్నారు. అభ్యుదయ రచయితల సంఘం పునరుద్ధరణ జరగబోతుంది. జ్వాలాముఖి మాటల్లో చెప్తే [10]"దిగంబరకవులు."తిరుగబడు"కవులు"మార్క్స్"సంకలనకర్తలు ఎటు పోవాలో, తెలుగు సాహిత్యాన్ని ఎలా ముందుకు తీసుకపోవాలో అని ఆలోచిస్తున్న సందర్భంలో అభ్యుదయ రచయితల సంఘం పాలకపక్షంతో చేతులు కలిపి సినిమా కుర్రోళ్లతో వేదిక నేర్పరచి, సాహిత్య ఉద్యమాన్ని ప్రజాపరం కాకుండా చేద్దామని పథకాలు వేసిన సందర్భంలో, పాతరకం కొత్తరకం కలిసి, మెలకువతో వ్యవహరించి, ప్రజావేదికను మార్క్సిస్టుల అవగాహనతో, దృక్పథంతో, ప్రజా పోరాటాల ప్రేరణగా ఏర్పాటు చేసింది. ఇది అపూర్వమైన సాహితీవేత్తల సమైక్య కృషి. విడివిడిగా గ్రూపులుగా పనిచేస్తున్న వాళ్ళంతా ప్రజలకోసం ఒకచోట చేరి ఒక ఆదర్శాన్ని సూత్రబద్ధం చేశారు. విప్లవ రచయితల సంఘం పీడిత ప్రజల సాహితీ అరుణ పతాకంగా ఆవిర్భవించింది."

ఇలా రాజకీయంగా కాంగ్రెసు, కమ్యూనిస్ట్ పార్టీల చీలికవల్లా, నక్సలైట్ల వుద్యమం వల్లా, సాహిత్యపరంగా దిగంబర కవులు, తిరుగబడు కవులు, మార్క్సి కవులు పొందిన అంతస్సంఘర్షణవల్లా, కల్గిన స్పందనతో, చైతన్యంతో, ప్రేరణతో కొంతమంది పాతతరం కవుల్తో, మరెంతోమంది కొత్త తరం కవుల్తో తెలుగు సాహిత్యంలో విప్లవ రచయితల సంఘం ఆవిర్భవించింది.

[11]1970 జూలై 4 వ తేదీన హైదరాబాదులో కవి వృద్ధులు శ్రీశ్రీ అధ్యక్షులుగా, కొడవటిగంటి కుటుంబరావు, రాచకొండ విశ్వనా ఉపాధ్యక్షులుగా, కె. వి. రమణారెడ్డి ప్రధాన కార్యదర్శిగా, జ్వాలాముఖి, చెరబండరాజు, నగ్నముని కార్యవర్గంగా అడ్‌హాక్ కమిటీ ఏర్పడ్డది.

ఈ ఏర్పడ్డ విప్లవ రచయితల సంఘం (విరసం) మీద నక్సలిజంగా చెప్పుకోవాల్సిన CPI-ML ప్రభావం వుందని తెలుస్తూనే వుంది. అది ఒకటే కారణం కాకపోయినా, ప్రధాన కారణం మాత్రం ఆ వుద్యమమే. దాని సిద్ధాంతాల్ని, దాన్ననుసరించిన విరసం సిద్ధాంతాల్ని తెల్సుకోడం అవసరం అన్పిస్తూంది. ఆ రెండు వుద్యమాల సిద్ధాంతాలు తెల్సుకోందే, వాళ్ళభావాల్ని

ఆపోశన పట్టిందే విరసం పూర్తిచరిత్ర, ఆకారం మనకు అర్థంగాకపోవచ్చు. ఆ రెండు వుద్యమాలు పడుగుపేకల్లాగా కల్సిపోయ్యాయి.

ఇండియాలో మొదటి రైతాంగ పోరాటం 'నక్సల్‌బరి'లోనే జరిగింది. కనుక ఈ వుద్యమానికి 'నక్సలిజం' అన్న పేరొచ్చింది. ఇది మార్క్సిస్ట్ లెనినిస్ట్ పార్టీ ఆధ్వర్యంలో జరపబడ్డది. దాని స్వరూప స్వభావాల్ని గురించి అరప మేజిస్ట్రేట్ కోర్టులో ఆ పార్టీ నాయకుడు కామ్రేడ్ కె. జి. సత్యమూర్తి ప్రకటించాడు.* దాని సంక్షిప్త భావం ఇది. 'భారతదేశంలో అన్ని రంగాల్లోనూ ఏర్పడ్డ ఆర్థిక రాజకీయ సంక్షోభం సాయుధ పోరాటానికి సరైన అవగాహన అనీ, భూస్వాముల, దళారీ బూర్జువాల, అమెరికా రష్యా సామ్రాజ్యవాదుల దోపిడీకి గురియై రోగపీడితమైన యీ దేశ ఆర్థిక రాజకీయ వ్యవస్థకు విప్లవం శస్త్రచికిత్స అనీ, శస్త్రచికిత్స చేసే సర్జన్ నేరస్థుడు కానట్టే తామూ, నేరస్థులు కామనీ, రాజకీయాధికారం తుపాకిగొట్టం ద్వారా సిద్ధిస్తుందని విశ్వసిస్తున్నామనీ, బేలెట్‌లో విశ్వాసం లేద'ని తమ పార్టీ సిద్ధాంతాలని అతను ప్రకటించాడు. ఆ ప్రకటనలో గెరిల్లా యుద్ధం తమ ప్రధాన పోరాట రూపంగానూ, ప్రజాసైన్యాన్ని నిర్మించడం ప్రధాన కర్తవ్యంగానూ, వ్యవసాయ విప్లవం తమ ఉద్యమానికి ఇరుసుగానూ, వర్గశత్రు నిర్మూలన గెరిల్లా యుద్ధానికి ప్రారంభంగానూ చెప్పుకొన్నాడు. క్రూరులైన భూస్వాములు గ్రామాల్లో నివసిస్తూ, దుర్మార్గమైన దోపిడీని కొనసాగించడాన్ని అనుమతించమంటూ, విశాలమైన గ్రామీణ ప్రాంతాల్లో క్రమక్రమంగా విప్లవరైతాంగ రాజకీయాధికారాన్ని తెస్తామంటూ తమ దృఢమైన కోరికల్ని ఆయన వెలిబుచ్చాడు. మావో ఆలోచన వెలుగులో, ఉక్కులాంటి సుశిక్షితమైన విప్లవాచరణతో, పోరాటరంగంలో తమ రకరకాల ఆయుధాలని పదును పెట్టుకొంటామనీ, తమ నాయకుణ్ణి చూపించారు. తాము ఒంటరిగా లేమనీ, తమకు ప్రజలు కవచం అనీ తాము ప్రజల చేతుల్లోని ఖడ్గం అనీ తమ్మతాము పరిచయం చేసుకొంటూ తమకున్న ఆదరువును జ్ఞప్తికి తెచ్చుకొన్నారు. ఈ ప్రపంచ విప్లవ యుగంలో, సామ్రాజ్యవాదం మొత్తంగా పతనమై సామ్యవాదానికి అంతిమ విజయం లభించే యుగంలో, ఈ దశాబ్దం తమ దేశానికి విముక్తి దశాబ్దమై తీరుతుందనీ, విజయం తమదేననీ, ఆశాభావాన్ని వ్యక్తం చేశారు ఆ ప్రకటనలో.

---

* చూడుడు: అనుబంధం II.

సి.పి.ఎం.ఎల్. పార్టీ తమ సిద్ధాంతాల్ని తెలియపర్చి నట్లుగానే, విరసం కూడా సంఘం తరపున వైయక్తికంగా తమ సిద్ధాంతాల్ని తెలియపర్చింది— విరసంకి వేదికగా నిల్చిన సృజన ఆ సంఘం ఆశయాల్ని గురించి తన సంపాదకీయంలో ఇలారాసింది. [12]విప్లవ రచయితల సంఘం సుత్తె కొడవలి వర్గ రాజకీయాలను సమర్థించే కలం పార్టీ. ఏ సాహిత్యమయినా ఏదో ఒకవర్గ ప్రయోజనాలకు వుపయోగపడుతుందని చారిత్రకంగా, శాస్త్రీయంగా విశ్లేషించి" గ్రహించి, పీడిత వర్గచైతన్యంకొరకు సాహిత్యం, విప్లవ కళలు, విప్లవ రాజకీయాల్లో ఒక భాగమని విప్లవాదర్శం కోసం పోరాడే శ్రామికచైతన్య శక్తికి సాహిత్యం బాసట కావాలని విరసం విశ్వసిస్తూన్నది.

ఎన్నికల పార్సును నిర్మొహమాటంగా ఎండగట్టింది. 'మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానాన్ని, ఆయుధాన్ని చేపట్టి ముందుకువెళు తున్న విప్లవ ప్రజల న్యాయమైన పోరాటాలను హృదయపూర్వకంగా బల పరుస్తూ వాటిని ప్రచారం చేయడమే విప్లవ రచయితల పని'.

విప్లవ కవులు మావో ఆలోచనా విధానాన్ని బలపరుస్తూ, ప్రముఖ నాయ కుల్ని స్మరిస్తూ, వాళ్ల నేతల్ని బలపరుస్తూ, ప్రచారం చేయడం వాళ్లగేయాల్లో కొన్నిటిని చూసినపుడు యథార్థం అనిపిస్తుంది.

[13]జోహార్! జోహార్! జోహార్!
అమరవీరులారా అందుకోండి మా జోహారు ॥జోహార్॥

మహామనీషి మావో తెల్పిన
మహాసూక్తులను మననం చేసి
కార్మిక కర్షక రాజ్యం కోసం
కారడవుల్లో కాపురముంటు
కళ్ళు లేని ఈ కుళ్ళుప్రభుతచే
చంపబడ్డ ఓ కామ్రేడ్లారా

[13]సంతాల్ రాసింది "వారసులం" అన్న మరోగేయం. ఈ గేయాల్లో తాము కవులం అన్న మాట మర్చిపోయి నక్సలైట్లు గానే చిత్రించు కోవడం

అంటే విరసంకి నక్సలిజానికి అభేదత్వం కల్పించుకోవడం కన్పడుతుంది. ప్రముఖ విప్లవ కవి చెరబండరాజు కూడా

[14]స్వేచ్ఛాజీవుల రక్తం మాంసం
యథేచ్ఛగా తినమరిగిన రక్కసి
శిరచ్ఛేదనం మన కర్తవ్యం
దానికి మించిన ధర్మం శూన్యం

అన్న ఆశయాన్ని వ్యక్తపరిచారు.

ప్రముఖ కవి, విరసం అధ్యక్షుడు అయిన శ్రీశ్రీ విరసంని గురించి చెప్తూ ఇలా అంటాడు. [15]"విరసానిది వచ్చేకాలం- విరసం విరోధులది పోయే కాలం. విరసం రేపటి సంగతులను ఇవాళ ఆలోచించే సంస్థ. ఇది భవిష్యత్తుని తీర్చి దిద్దేబాట గ్రహచారం మీద ఆధారపడేది కాదు. ఇది మార్క్సిస్టు దర్శనానికి నిబద్ధమై, గతితార్కిక భౌతిక వాదపు వెలుతురులో సామాజిక పరిణామాన్ని సందర్శిస్తుంది. అందుకే రెండు రెళ్లు నాలుగనేది ఎక్కడైనా ఎంత సత్యమో యావత్ప్రపంచమూ సామ్యవాదమానవుడి శాసనం కిందికి వస్తుందనేది కూడా అంతే సత్యం".గతితార్కిక భౌతిక వాదాన్ని గూర్చి ఇలా చెప్పబడ్డది- [16]"ప్రపంచం మిథ్యకాదు. వాస్తవికమైనది. ప్రపంచంలో వున్న వస్తువులు దేనికది సంబంధంలేని తునకలు కావు. పరస్పర సంబంధం కల్గి వున్నాయి. ఏది స్థిరమైనది కాదు. ప్రతిదీ మార్పు చెందుతుంది. వృద్ధి చెందుతుంది. నశించుతుంది. యీ అభివృద్ధి ఒక దశవరకు క్రమంగా జరుగుతుంది. చివరకు తీవ్రమైన ఘర్షణ జరిగి నూతన స్వభావం ఏర్పడుతుంది. అంతరంగిక పోరాటం ఫలితంగానే అభివృద్ధి జరుగుతోంది. నశించిపోతున్న లక్షణంపైన వృద్ధి పొందుతున్న లక్షణం యొక్క విజయమే చివరకు వచ్చే ఘర్షణ. అదే విప్లవం". అలాంటి విప్లవాన్ని విరసంవాళ్లు ఆహ్వానించినట్టు కన్పడటం లేదు. అయితే

[17]విప్లవ సాహిత్యం
పోయేదారి కంటక భూయిష్టం
దాని ప్రధాన రసం బీభత్సం

దాని పునాది సాంఘిక యాథార్థ్యం
దాని ఆదర్శం వర్గరాహిత్యం

అన్న శ్రీశ్రీ మాటలు యథార్థాలు.

విరసం మీద శ్రీపతి దృష్టి ఇది: [18]"భూస్వాముల ఏజెంటుగా, సామ్రాజ్యవాదుల కీలుబొమ్మగా, ప్రగతి నిరోధకుల వారసునిగా, దోపిడీ వర్గాల కాపలా కుక్కగా ప్రభుత్వం ప్రజాతంత్ర స్వాతంత్ర్యాన్ని జైల్లో బంధించి వుంచి కాల రాచేయాలనుకొంటే ఆ కుట్రను బయటపెట్టడం ప్రజా పక్షం వహించే మేధావులకు తప్పనిసరి, విధ్యుక్తధర్మం. ఆ పని విప్లవ రచయితల సంఘం సగర్వంగా నిర్ద్వంద్వంగా చేస్తుంది."

ఇలా మార్క్సిస్ట్ లెనినిస్ట్ పార్టీ, విప్లవ రచయితల సంఘం తమ సిద్ధాంతాల్ని చెప్పుకొన్నాయి. వాటిమీద పెద్దపెట్టున దుమారం లేచింది. కొంతమంది వారిని సమర్థించారు. మరెంతోమంది విమర్శించారు. వాళ్ళు చెప్పిన సిద్ధాంతాల్ని మాత్రమే తెల్సుకొంటే, అది అపకారి మాత్రమే అవుతుంది. కారణం నాణెంకి బొమ్మా బొరుసు వున్నట్లే ప్రతి సిద్ధాంతానికీ, ఆచరణకీ కొన్ని సామ్యాలు, భేదాలూ వుంటాయి. కనుక వాళ్ళు ఒక దృక్పథాన్ని ఆచరిస్తే దాని ప్రభావం, ఫలితం ఎలావుండేది అనేది ఈ విమర్శల ద్వారా తెల్సుకోగలం. అపుడే పూర్తిగా అర్థం చేసుకోవడానికి వీలుపడుతుంది.

భారత కమ్యూనిస్ట్ పార్టీ (C.P.I.) కార్యదర్శి చంద్రరాజేశ్వరరావు లాంటివాళ్ల కొంతమంది నక్సలైట్ల వుద్యమాన్ని నిరసించారు. గెరిల్లా పోరాటాన్ని తిరస్కరించారు. గతంలో స్వదేశీ సంస్థానాలు భారతదేశంలో విలీనం కాకుండా వున్నపుడు కమ్యూనిస్ట్ పార్టీ అనుసరించిన గెరిల్లా పోరాట విధా నారతదేశ పరిసితుల్కి సరిపడేవి కావని అనుభవం మీద తెల్సుకొన్నారు. ఈ విషయాన్నే చెప్తూ: [19]"This is not new to the C.P.I. We had ourselves conducted much bigger armed guerilla actions in Telangana, Kakdwip (Bengal) and Punnapra Vayalar (Kerala) in past" అంటాడు.

చైనా, మావో నాయకత్వంతో గెరిల్లా పోరాటాన్ని జరిపి అధికారం సంపాదించింది. అది గతం. అది ఆ దేశపరిస్థితుల్కి సంబంధించింది. ఒకనాటి బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తెరమరుగయ్యారు. పదవిని భారతదేశ పెట్టుబడి దారుల వశం చేశారు. డబ్బు లేక పదవి లేదు. పదవి అంటే డబ్బు. అదొక కిటు. వ్యాపారంగా నిల్చిపోయింది. పెట్టుబడి దారుల కాతం భారత దేశాన్ని గుప్పిటలో దాచుకొంది. ఇలాంటి పరిస్థితుల్లో గెరిల్లా పోరాటం సాధ్యమా? జమీందారీ వ్యవస్థనైనా కదిలించగలమేమోగాని, పెట్టుబడిదారీ సమాజాన్ని కదిలించటం అంతసులభమైన పనిమాత్రం కాదు. ఈ విషయాన్ని చాలామంది గుర్తించారు. [19]"From the past experiences our party came to the conclusion that long ago that in a contry like India, where considerable capitalist development has taken place and big modern industrial proletariat has come up..... Chinese type armed guerilla warfare leading to the capture of power has no place.. ... India of 1967 is not China of 1927. It would be a foolish and harmful adventure for anybody to attempt it now" అంటూ కమ్యూనిస్టుపార్టీ ఈ గెరిల్లా పోరాటాన్ని ఏమాత్రం సమర్థించ లేదు. అంతేగాక ప్రస్తుత పరిస్థితుల్ని సమన్వయపరచి విద్యార్థుల్ని యువకుల్ని, సరియైన దారిలోకి మళ్ళించేందుకు ప్రయత్నించాలి అని ఆశించింది, ఆక్రోశించింది. ఒక్కడూ దాని పక్క చూసిన వాడు లేడు. కార్మికనాయకుడు డా. రాజబహదూర్ గౌడ్ ఆనాటి నక్సలైట్ నాయకుడు, తరిమెల నాగిరెడ్డికి వొక ఉత్తరం రాశాడు. అందులో తాము 1947లో తెలంగాణా పోరాటంలో పాల్గొన్న తీరుని గుర్తు చేస్తూ: [19a]"Our own history of revolutions all over world teaches us that armed struggle is never the voluntary choice of the people. It is always imposed on them by the enemy--people take to arms when all other paths are barred" - అన్న నగ్న సత్యాన్ని కూడా చెప్పారు. అయితే ఎంతో తెల్సిన నాగిరెడ్డి లాంటి వాళ్ళు కూడా నక్సలైట్లయ్యారు. తాము నమ్మిన సిద్ధాంతాన్నే గుడ్డిగా అనుకరించారు. మింగుడుపడని ఆచరణని అనుసరించారు.

ఈ విషయాన్ని తర్వాత తర్వాత విప్లవ నాయకులే కొంతమంది గుర్తించారు. [20]"ఈ దేశంలో నక్సలిజం ప్రయోజనాన్ని సాధించలేక పోయిం

దని, అందువల్ల ఎంతో ప్రాణ నష్టం జరిగిందనీ అందరికీ తెలుసు" అంటారు. కె. అంజయ్య.

"ఏ విప్లవోద్యమం వల్ల పీడిత వర్గం ఉజ్వల భవిష్యత్తు పొందుతుందని మనమంతా ఆశిస్తున్నామో, ఆ శ్రామిక వర్గం చిన్నచిన్న వాగ్దానాలకు మోస పోయే నిస్సహాయస్థితికి దిగజారింది. అట్టి శ్రామిక వర్గాన్ని సుసంఘటితము చేసి, చైతన్యవంతం కావించి మిత్రశ్రేణులన్నిటినీ ఏకోన్ముఖం చేయవలసిన మహత్తర బాధ్యత రచయితలందరి పైనా వుంది. అంతవరకూ మహాశక్తివంత మైన శత్రువు ఇలాంటి పిల్లసమేరీల వల్లనూ, పిరికి పితూరీలవల్లను నిర్జితుడు కాడన్న యథార్థాన్ని సోదరులంతా ఇప్పటికేనా గ్రహిస్తే శుభోదర్కమే," అంటూ 'కరపత్రాల దుమారం తెరవెనుక భాగోతం'లో సోమసుందర్ చురకులు తగిలించారు, [21]దాన్ని [20]అంజయ్య, [20]కె. వి. రమణారెడ్డిలు విమర్శించినా ఆలోచించాల్సిన విషయమే. గుడ్డిగా నక్సలిజాన్ని సమర్థించడం విరసంలో కన్పడుతుంది. ఈ సంఘాన్ని కొంతమంది అసూయతో భయంతో అసహ్యంతో విమర్శించారు. మరెంతోమంది ఆప్యాయంగా ఒడిలో ఎక్కించుకొని దరిజేర్చుకొన్నారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ [22]........Frankly speaking we do not approve of any armed revolution, if that s the criticism against us" అని బాహాటంగా నీళ్ళు నములుట లేకుండా నిరసించి, ఆది అభిమానిస్తున్న నక్సలిజాన్ని అధిక్షేపించింది.

మార్క్సిస్ట్, లెనినిస్ట్ పార్టీలో పరిస్థితుల్ని సరిగ్గా అవగాహన చేసుకోవడంగానీ, దానికి తగ్గ పరిహారాన్ని వెతుక్కోవడంగానీ కన్పడదు. అసలు భారత కమ్యూనిస్ట్‌పార్టీలోనే అలాంటి అవకతవకలున్నాయనిపిస్తుంది. ఏ పార్టీఅయినా ఆయా దేశ, పరిస్థితుల్ని పునాదిగా కల్గివుండాలి. అయితే కమ్యూనిస్ట్‌పార్టీలకి రష్యా చైనాలే ఆశాజ్యోతులు. అలాంటిది సి.పి.ఎం.ఎల్‌లో కూడా కన్పడుతుంది. దానికి ప్రతిఫలం నక్సలైట్ల వుద్యమం, ఎన్నో కుర్యాసెక్కుల రక్తమయం. [23]"మానవ సమాజంలో అనేక రకాల మానసిక ప్రవృత్తులు, భౌతిక సంబంధాలు ఉంటాయి. సర్వకాలానికి ప్రపంచానికంతకూ వర్తించే నియమాలను చేయలేము. అది శాస్త్రీయమైన పద్ధతి కూడా కాదు. దేశకాల పరిస్థితులకు అనుగుణ్యంగా మనం నిర్ణయాలు చేయవలసి వుంటుంది" అన్న

ఆచరణని సి.పి.ఐ.ఎమ్ అనుసరించినట్టు కన్పడటం లేదు. అలాంటి వైద్యమాన్ని పూర్తిగా కల్గించే విరసం కనుక ఈ సంఘంలో కూడా అనేక ఆవకతవకలు కల్గినాయి.

విప్లవకవి అంటే ఎలాంటివాడు? అతని దృష్టి ఏమిటి? సామూహికంగా సంఘంతో చేసేది వేరు; వ్యక్తిగత అభిప్రాయం వేరు; అక్కడ ఎన్నో విషయాల్లో వ్యక్తికి ప్రాధాన్యం వుండదు. ఇక్కడ అన్నిటిలోనూ వక్తే ప్రాధాన్యం వహిస్తాడు. వ్యక్తిలేక సంఘం లేదు. సంఘ సంబంధం లేక వ్యక్తి లేదు. ఇరువురికి అవినాభావ సంబంధం వుంది. ఎంత వుండినా సంఘం కోసమే వ్యక్తి పాటుబడతాడనుకోవడమో, వ్యక్తి అభివృద్ధికి సంఘం తోడ్పడుతుందనుకోవడమో ఉత్త భ్రమ. వ్యక్తి సాధక బాధకాలకి సంఘం కారణం. సంఘ పరిస్థితుల్కి వ్యక్తిగా తాను కొంత బాధ్యుడు. ఏనాడు కూడా [24]"idiel society" అంటే "అదర్శసంఘం" అంటూ ఏం లేదు. ఉండేది ఒక సంఘమే. వ్యక్తి తన అవసరాల్ని బట్టి, దాని సఫలీకృతాన్ని బట్టి, సాధక బాధకాల్ని బట్టి, అనుసరణ వైవిధ్యాన్ని బట్టి, అన్యోన్యానురాగంగా గడిపే కాలాన్ని బట్టి సంఘం ఆదర్శవంతం అవుతుంది. ఒకడికి సుఖసంతోషాలు కల్పించే ఈ సంఘం మరెంతో మందికి దుఃఖభాజకమవుతుంది. వ్యక్తిగా తన తప్పు లేకపోయినా. తనపాత్ర లేకపోయినా, సంఘం తనపాత్రని నటించక మానదు.

ఆలాగే కవి సంఘాలూ, కవులూ. కవిగా తనపాత్ర తాను నటించాలి లేక జీవించాలి. కవి సంఘాల్తో తన అనుబంధాన్ని పటిష్టం చేసుకోవాలి. రాజకీయపార్టీల అండ కల్గిన కవి సంఘాలు మరికొంత వైశిష్ట్యం కలవి, వైవిధ్యం కలవి. కవి తన పాత్రని ఎంతబాగా రాణింప చేసినా, సంఘాన్ని వదుల కూడదు. అలాగే సంఘ సిద్ధాంతాల్ని తు.చ.తప్పకుండా అనుసరించడమో, అనుకరించడమో చెయ్యకూడదు. సిద్ధాంతాన్ని నమ్మడమో అనుసరించడమో. వేరు, దాన్ని కవితలో చొప్పించడం వేరు ఇది తెలియక చాలామంది విప్లవ కవులు సిద్ధాంతాల్ని అలాగే భాషాగతం లేక, కవితాపరం చేశారు. మరెన్నో. అవసరమైన సంఘం ఆశయాల్ని వదిలేశారు.

[25]" ప్రగతి నించి, అభ్యుదయం నించి, మార్క్సిజం, లెనినిజం మావో ఆలోచనా ధారనించి, ప్రజల్నించి, విప్లవాలనించి, ఆచరణ నించి

చరిత్రనించి ఎల్లప్పుడూ పాఠాలు నేర్చుకొంటాం. సమాజశ్రేయస్సు కోసం మా రచనలు విశాల ప్రపంచంలో ప్రజల ముందుపెట్టి వారి విమర్శనలను వారి అవగాహనలను ఆహ్వానిస్తాం మా తప్పులను సరిదిద్దుకొంటాం. ఆచరణ విమర్శ ఆత్మ విమర్శ మా అధ్యయనం" అని శ్రీపతి చెప్పిన ఈ సిద్ధాంతాల్ని తు.చ. తప్పకుండా విప్లవకవులు ఆచరించినట్టు కన్పడదు. ప్రభుత్వం నిజంగా భూస్వాములకీ, సామ్రాజ్యవాదులకీ ఏజెంటుగా, కీలు బొమ్మగానే వుంది. అందులో సందేహం లేదు. అటువంటి ప్రభుత్వాన్ని నిర్ద్వంద్వంగా, నిర్భయంగా ఎదిరించి నిల్చింది, విరసం ఒక్కటే. మనఃపూర్వకంగా రైతాంగ సాయుధ పోరాటాన్ని నడిపే వారిని ఆశీర్వదించి, ఆదరించింది విరసం. ఆ విషయంలో విరసం దృష్టినిగాని చేష్టనిగాని శంకించలేం అది విప్లవకవిగా విరసం సభ్యుడిగా చేసిన పని. మరి కవిగా తన పాత్ర సంగతి? పై ఉదహరించిన సిద్ధాంతం రాజకీయ నాయకుల ప్రసంగం లాగా వుంది. చెప్పడం వరకే తనవంతు. మిగతాది ప్రజల వంతు అన్నట్టు విప్లవకవులు తమ ధ్యేయాన్ని చక్కగా చెప్పారు. ఆచరణ విషయంవచ్చేటప్పటికి చేతులెత్తేశారేమో ననిపిస్తూంది.

మావోదృష్టిలో కమ్యూనిస్ట్ అంటే ఇలావుండాలి. [26]"కమ్యూనిస్ట్ ప్రతి విషయాన్ని గురించీ, ఎందువల్ల? అని ప్రశ్నించుకోవాలి. ఎల్లప్పుడూ, తన మెదడును ఉపయోగించాలి. ఏది ఎంత వరకు వాస్తవమో, దానికి కారణమేమిటో తెలుసుకొనేందుకు కష్టపడి పని చెయ్యాలి. దేన్ని గుడ్డిగా అనుసరించకూడదు. బానిస బుద్ధికి స్వస్తిచెప్పాలి".

ఈ విషయంలో విప్లవ కవుల అనేక రచనల్ని వుదాహరణ ప్రాయంగా తీసుకోలేం. వాటిలో వాస్తవాన్ని, దానికి కారణాన్ని ప్రోది చేయడం గానీ, నిగ్గు తేల్చడం గానీ కనపడదు. ఏదో గుడ్డిగా అనుకరించిరాసిన కవితల్లాగే కన్పడతాయి; కాని ప్రగతినించి అభ్యుదయంనించి, ఆచరణనించి పాఠాలు నేర్చుకొన్నట్లు కన్పడదు. ఈ విషయంలో "లే"కవితా సంకలనాన్ని దృష్టిలోకి తీసుకోవచ్చు.[27] [28]'లే' కవితా సంకలనాన్ని గురించి'లే సమయమిదే'లో రాస్తూ "ఇందులో ఎన్నో రకాల గీతాలున్నాయి. అన్నీ ఒక టేరకం అనే వాళ్లున్నారు. కాని వాళ్లది చవక బారు విమర్శ. స్థూల దృష్టికి అన్నీ ఒక లాగే కన్పడతాయి, చీనావాళ్ళంతా ఒకలాగే కనపడ్డట్టు ...ఏ యిద్దరు కవులు

ఒకలాగ ఉండరనేది తిరుగులేని సత్యం. ఏ ఇద్దరు మనుష్యులు—వాళ్లు కవలలే అయినాసరే-ఒక లాగుండరు. అలాగే ఏ రెండు గీతాలు (ఒకే కవి వ్రాసినవే అయినా) ఒకలాగుండవు "అని అంటాడు శ్రీశ్రీ. ఇది స్థూల దృష్టితో చేసిన పరిసంగమే గాని, మథించి, చర్చించి రాసిన విమర్శో, వివరణో, పీఠికో కాదు.

29"ప్రజల్ని అర్థం చేసుకోవడం, నమ్రతతో ప్రజలకు నేర్పడం, ప్రజలనుండి నేర్చుకోవడం," అన్న మావో భావాల ప్రాముఖ్యాన్ని వీళ్లు గుర్తించినట్టు కన్పడదు. గుర్తించివుంటే రుచి పచిలేని ఎంతో కవిత్వం వచ్చివుండేందుకు ఆస్కారం కల్గివుండేది కాదు.

30నేలమీద న్యాయం నిలవడానికి
శ్రమ దోపిడి నాశనం చేయటానికి
కానల్లోకి, కోనల్లోకి
నగరం నలు మూలల్లోకి
కదిలిరా

అని అనివుండేవాడు కాదు ప్రజల్ని అర్థం చేసుకొని వుంటే. కానల్లోకి, కోనల్లోకి వెళ్తే సమాజంతో సంబంధం ఎలాముడిపడి వుంటుంది. ఆ సంబంధం కాస్తా విడివడితే, శ్రమ దోపిడిని కాదు నాశనం చేయబోయేది, తమ శ్రమనే. మావో సిద్ధాంతాన్ని కమ్యూనిస్ట్ తత్వాన్ని అర్థం చేసుకోని విషయం కనపడ తూందిక్కడ. అయితే విప్లవ కవిత్వం అంతా ఈలాంటి పంథాలోనే నడ చిందని చెప్పలేం.

30అ"మత మౌఢ్యపంజరాలనుండి
నైరాశ్య వలయాలనుండి
భూతకాలపు భూతాల కోరలనుండి
వర్తమానపు ఇనుప గోళ్ళ కౌగిళ్ళనుండి
శాస్త్రీయ శస్త్రాస్త్రాలతో
అశారణ సంగీతంతో
ఆగామిని రక్తగానంతో ఆవాహన చెయ్యాలి.

సమాజాన్ని అర్థం చేసుకొన్న తీరు ఇక్కడ కన్పడుతుంది. అయితే ప్రజల్నించి నేర్చుకొన్నది గానీ, వాళ్ళకి నమ్రతతో నేర్పిందిగానీ ఇక్కడ కన్పడదు "ఆగామిని రక్తగానంతో ఆవాహన" చేయడం ప్రజల వుద్దేశమా? ఇక్కడ్నే విప్లవ కవులు ప్రజల్నించి దూరంగా వెళ్లికూడా, ప్రజల కోసమే, వాళ్ల శ్రమని దోపిడీ చేసేవాళ్లని శిక్షించేందుకోసమే తమ కర్తవ్యం అంటూ వుండటం కన్పడుతుంది

[31]"విప్లవ విద్యార్థి యువతరానికి, రైతాంగంతో, కార్మికలోకంతో ఐక్యం కావడం విప్లవచైతన్యం యొక్క అత్యున్నతమైన దశ. నిరుపేదలతో భూమిలేని రైతులతో, కష్టజీవులతో, ఐక్యం, కాగలిగినప్పుడు మాత్రమే విద్యార్థులూ యువకులూ, నిజమైన విప్లవకారులు కాగలరు. అలా శ్రమజీవులతో ఐక్యం కాగల్గినపుడే శ్రమజీవుల దైనందిన బాధలూ, దోపిడి యొక్క నిజస్వరూపమూ అర్థం చేసుకోగలరు". విప్లవకవుల్లో వెంపటాపు సత్యం, సుబ్బారావు, పాణిగ్రాహిలాంటి వాళ్లు బీదోళ్లతోనే బతికారు. వాళ్ళ బాగోగుల్ని శ్రద్ధగా తిలకించారు వాళ్ళని సాయుధపోరాటం వైపుకి మళ్ళించారు. ఇది శ్రీకాకుళంలో జరిగిన విషయం. మిగతా పట్టణాల్లో, సరిగ్గా ఆ సమయంలోనే విస్తరించిన నక్సలైట్ల వుద్యమం పలాయనవాదం లాంటిది పులిని చూసి నక్క వాత పెట్టుకొన్నట్టు శ్రీకాకుళ వీరుల్ని (శ్రీకాకుళ రైతాంగ పోరాటంలో వీరమరణం పొందిన వాళ్లు కనుక) దృష్టిలో పెట్టుకొన్నది. ఈ పట్టణాల్లోని నక్సలైట్లు గాని, విరసంసభ్యులు గాని, నిరుపేదల్తో, రైతాంగంతో, కార్మికుల్తో, కష్టజీవుల్తో సంబంధం పెట్టుకొన్నట్టు కన్పడటంలేదు. అంతేగాకుండా వాళ్ళని వాళ్ళ పరిసరాల్ని పూర్తిగా వదలి ఊహాలోకంలోకి పరిగెత్తి వెళ్ళారు. సాయుధ పోరాటానికి ముందు నిరుపేదల్ని, తదితరుల్ని విజ్ఞానవంతుల్ని చేసివుంటే, పరిసరాల్ని, దానిలోటు పాటుల్ని, దానివల జరిగే కష్టనష్టాల్ని గుర్తించేటట్టు చేసివుంటే, దానికి తగ్గ పరిహారం సాయుధ పోరాటం వినా మరేం లేదని ప్రజలే తలచేటట్టు చేసివుంటే నక్సలైట్లు అడవికి పోయి వుండాల్సిన అవసరం వుండి వుండేదికాదు. కనీసం విరసం వాళ్ళైనా దాన్ని తమ బాధ్యతగా గుర్తించలేక పొయ్యారు. [32]"........every real revolution which aims at overthrowing an existing ruling class is not a revolution only of the class which is to succeed it in power, but a

revolution of all who are oppressed or restricted by the existing ruling class" అన్న మార్క్సిజసూత్రాన్ని నక్సలైట్లు మర్చిపోయారేమో ననిపిస్తూంది; మార్క్సిజమే తమ వూపిరి అని నినాదాల్లో చూపిస్తూ వుంటారే తప్ప, నిశ్చయంతో దాన్ని అనుసరించడం లేదేమో నన్న శంక కల్గుతూంది. తెలంగాణా పోరాటంలో ప్రజల మద్దతు వుండింది. అయితే పార్టీకి సరయిన అవగాహన లేకపోయింది. ఇక్కడ నక్సలైట్లకి అవగాహన గానీ, ప్రజల మద్దతు గానీ వున్నట్టు కన్పడటంలేదు.

కవుల్ని నిర్బంధించడం స్వాతంత్ర్యం తర్వాత కన్పడటం విప్లవ కవుల కాలంలోనే. తెలంగాణా వుద్యమంలో పాల్గొన్న కవుల్ని కొంతమందిని —దాశరథిని— ఆ నాటి నిజాం ప్రభుత్వం అరెస్ట్ చేసింది. అయితే అది ప్రజాప్రభుత్వం కాదు. నేడు విప్లవ కవుల్ని అరెస్ట్ చేసింది అక్షరాలా ప్రజా ప్రభుత్వమే. పేరు మోసిన ప్రతి విప్లవపత్రికా సంపాదకుడు, కటకటాల వెనుక కొంతకాలమైనా వున్నవాళ్ళే. కొంతకాలం ఒకరిద్దర్ని అరెస్ట్ చేయడం తోనే సరిపెట్టుకొన్నారు. మరికొంతకాలానికి మూకుమ్మడిగా నిర్బంధించారు. ఆ సమయంలో ఆంధ్రదేశంఅంతా మూకుమ్మడిగా అరెస్ట్లని ఖండించింది. విప్లవకవులు, అనుయాయులు మాత్రమే కాకుండా అనేకులెందరో కవుల అరెస్ట్ని ఖండించారు.

అరెస్టుల్ని ఖండిస్తూ కవుల్ని, వ్యక్తుల్నీ, వెంటనే విడుదల చేయాలని డిమాండ్ చేస్తూ, కొన్ని సంస్థలు కొంతమంది వ్యక్తులు ప్రకటనలు ఇచ్చారు. అవి నిజంగా వాళ్ళ ధైర్యసాహసాలకి సిద్ధాంతంపై నమ్మికకు నికషోపలాలు.

[33]అరెస్టుల వల్ల విప్లవాలు ఆగిపోవు
దోపిడి జైళ్ల బంధించలేవు విముక్తిని

జన చైతన్యాగ్నిని ఆర్పజూచే మూర్ఖ ప్రభుత్వం శలభంలా మాడిపోక తప్ప దంటూ వాళ్ళని విడుదల చేయమని ప్రోగ్రెసివ్ యూత్ ఫ్రంట్ నర్సంపేట కోరింది.

"........ దోపిడి వర్గాలకు ప్రాతినిధ్యం వహించే ఓ ప్రభుత్వమా విప్లవం అక్కడ కాదు పుడుతున్నది. నీవు మాడుస్తున్న కడుపుల్లో పుడుతు

తుంది విప్లవం. నీవు దోస్తున్న సంసారాల్లో పుడుతోంది విప్లవం. నీవర్గం దాస్తున్న ధనరాసుల్లో పుడుతోంది విప్లవం. నీ పుచ్చిపోయిన పరిపాలనలోనే వుంది విప్లవానికి బీజం" అంటూ[33] భావాల్ని బంధించటం అంటే గాలిని ఉరి తీయటం, పొంగి పొరలే అలల్ని అరికట్టటం[33] అంటూ

[33]ఇ అక్షరల్లో ఆలోచనల్ని బంధించ నీకండి
భావ స్వేచ్ఛలు కటకటాల్నించి బతికించుకోండి

అంటూ [33]ఈ "విప్లవ రచయితల్లో ప్రముఖ వ్యక్తుల్ని అరెస్ట్ చేసి తద్వారా విరసాన్ని నిషేధించకుండానే రూపుమాపాలని ప్రయత్నిస్తోంది. విరసం అంటే యీ కొంతమంది వ్యక్తులేనని భావిస్తోంటే అది దాని భ్రమ. తెలివి తక్కువతనం మాత్రమే," అంటూ

[33]ఉ కదలి తరగల నాపగలవా వెంగళ్రావ్

అని సవాలు చేస్తూ ప్రభుత్వాన్ని నిలదీసి ప్రశ్నించింది.

విరసం ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ త్రిపురనేని మధుసూధనరావు, 'సృజన' సంపాదకులు కామ్రేడ్ వరవరరావు, 'పిలుపు' సంపాదకులు కామ్రేడ్ రంగనాథం, 'పిలుపు' నిర్వాహకులు కామ్రేడ్ ఎం.టి. ఖాన్, విప్లవ కవి కామ్రేడ్ చెరబండరాజులపై కుట్ర కేసు బనాయించింది ప్రభుత్వం..... .....రచయితలపై జరుగుతున్న యీ దాడులను ఖండించ వలసిందిగా విరసం యూనిట్లన్నీ ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ, వాళ్లందర్నీ వెంటనే విడుదల చేయాలని ప్రభుత్వాన్ని కోరాయి.

ఇలా కేవలం విరసం శాఖలే గాక [34]పౌరహక్కుల కమిటీ, లాంటి సంఘాలు, సామ్యవాద సమితి, అభ్యుదయ సంఘం లాంటివి కూడా వాళ్ళని వెంటనే విడుదల చేయాలని కోరాయి.

ఇటు సంఘాలతో పాటు వ్యక్తులు కూడా వ్యక్తిగతంగా వాళ్ళ అరెస్టుల్ని ఖండించారు.

[35]"విప్లవ సాహిత్యాన్ని తొక్కిపట్టడమే గాకుండా, విప్లవ రచయితల గొంతులను అడ్డుకోవాలని, సానుభూతి పరులను భయభ్రాంతులను చేయాలని

ఈ పాలకవర్గం కొత్త పథకాలు చేస్తూవుంది. అందులో భాగంగానే విరసం ప్రముఖులపై యితర 40 మంది కామ్రేడ్స్‌పై కుట్రకేసు బనాయించి ప్రభుత్వం ప్రజారచయితలపై కుట్రపన్నింది. ఈ దళారీ బూర్జువా పాలక వర్గం అమలు జరుపుతున్న అనాగరిక ఫాసిస్టు దమనకాండను తీవ్రంగా ఖండిస్తూన్నాం" అని నిఖిలేశ్వర్ జ్వాలాముఖులు ప్రకటనలు ఇచ్చారు.

[35]'ఏర్ కండిషన్డ్ రూముల్లో కూచొని
రోజుకో కుట్ర చేస్తున్న మీరు
మీ కుట్రలను నిమిష నిముషం
బద్దలు కొడుతున్నారని చెప్పి
మా వాళ్ళపై కుట్ర కేసులు పెట్టార్రా
విప్లవం కుట్ర కాదురా
వీరుడుగా చావడం కుట్ర కాదురా
అయినా ప్రతిసారి అరెస్టులు చేయడం
అవమానాలు పొందటం మీ కలవాటేలే
మీరు చేస్తున్న కుట్రలను
ప్రజా కోర్టుల్లో విచారించే రోజులు
ఇంకా ఎన్నో రోజులు లేవులే"

అని ఉదయ్—

విరసం సభ్యుల అరెస్టుకి నిరసనగా కేవలం ప్రకటనలు ఒత్తిడులే గాకుండా ఊరేగింపులు బహిరంగ సభలు కూడా జరిగాయి.

[36]"It is not for the government of the day, not for the judges presiding over our Courts to decide what doctrine of philosophy is good for our people. It is for the people to choose what is best for them and in order that they may be able to make a wise and intelligent choice, free propagation of ideas is an essential requisite. The ideas propagated may be unorthodox and unconventional: they may disturb the complacency of a handful minority or they may challenge deep seated sacred beliefs and question the most fundamental

postulates of our social political or economic thinki ig. That should be no ground for anxiety or apprehension'' అని, కోర్టులు కూడా జనావళికి వాక్స్వాతంత్ర్యం, భావస్వాతంత్ర్యం వుందని వుద్ఘోషించినా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మాత్రం వాళ్ళని అడుగడుగున అరెస్టు చేస్తూ నీతిని అణగ దొక్కేసింది

ఇవన్నీ చూసినపుడు కవిగా అతని కున్న స్వాతంత్ర్యాన్ని ప్రభుత్వం లాగేసుకొన్నపుడు, సంఘాల్తో, వ్యక్తుల్తో ప్రమేయం లేకుండా, ప్రతి ఒక్కరూ వారిఅరెస్టుకు నిరసన తెల్పారు. విరసం ధ్యేయాలకీ, అభిమానాలకీ, సిద్ధాంతా లకీ అనుభూతులకీ ప్రజల అండదండలు లేకపోయినా కవిగా వారికున్న స్వాతం త్ర్యం మృగ్యం అయినప్పుడు మాత్రం అందరూ ప్రభుత్వాన్ని ధిక్క రించారు. ఆయితే ఇది కేవలం వాక్స్వాతంత్రానికి మాత్రమే సంబంధించింది అని తెల్సుకోకుండ అలాంటి సహకారం తమ ధ్యేయానుసరణ మీద కూడా వుంటుందనుకోవడం భ్రమ మాత్రమే.

1970 లో ప్రారంభింపబడ్డ ఈ వుద్యమం కొత్తలో బాగానే వున్నా, తర్వాత తర్వాత తమలో తాము అంతర్యుద్ధాలు సాగించారు. అవి 1975 నాటికి పరిణతి చెందాయి. 1975 జనవరిలో అనంతపురంలో తమ అయిదో వార్షిక సమావేశాన్ని జరుపుకొంది. ఆ సమావేశంలో జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, మరో పద్దెనిమిది మంది విరసం నించి విడివడి వచ్చేశారు. వాళ్ళ రాజీనామాకి మద్దతుగా చాలా కారణాల్ని ప్రోది చేశారు. వాటిలో కొన్ని ఇవి: [37]

ముందునించి విరసంని వెనక నించి నడిపిస్తుండిన చారుమజుందార్ ముఠా అనంతపురం సభలో బాహాటంగా తన రూపుని ప్రదర్శించింది. వేదిక కేవలం చారుమజుందార్ రాజకీయాల్ని సిద్ధాంతాల్ని ప్రచారం చేసే కూటమి అయింది.

విప్లవ రచయితల సంఘం, సాంస్కృతిక విప్లవపంథా నైసర్గిక సూత్రాల్ని అనుసరించటంలో సఫలం కాలేదు. అది ప్రజల్లోకి వెళ్ళి చైతన్యం కల్గించి వాళ్ళని సభ్యులుగా చేర్చటంలో కూడా సఫలీకృతం కాలేదు.

విశాఖపట్టణం 1974 అక్టోబరు విప్లవ రచయితల సంఘ సమావేశంలో కొంతమంది జ్వాలాముఖి, నిఖిలేశ్వర్‌ల్ని బాహాటంగా విమర్శించటం జరిగింది. అంతకు ముందెపుడైన కవుల మధ్య భేదాభిప్రాయాలు తలెత్తితే, భేదాభిప్రాయాలు గల కవుల్ని మాత్రమే పిల్చి, అభిప్రాయాల్ని సేకరించేవాళ్ళు. ఆపోహల్ని -అంటూవుంటే- తీర్చేవాళ్ళు; విరసం ఎపుడూ ఇలాంటి అభిప్రాయ భేదాల్ని తెరబయటికి తీసుకొని రాలేదు. అయితే విరసంలోని చారుమజుందార్ ముఠా మొదటిసారిగా కవుల్ని విమర్శించింది.

విరసం సభ్యులు సంఘ ఆశయాల్ని, ఆచరణల్ని అనుసరించకుండా మూఢాచారాల్ని అనుసరిస్తుండడం కూడా జ్వాలాముఖి, మొదలైన వాళ్ళకి ఇష్టం లేకపోయింది.

ఇంకా ఇలాంటి చాలా కారణాలవల్ల వాళ్ళు విరసం నించి వైదొలగి వచ్చేశారు. విడివడి వచ్చేసిన ఆ విప్లవ కవులు పది సూత్రాల్తో ఒక కార్యక్రమాన్ని నిర్ణయించి తమ రాజకీయ సిద్ధాంతాల్ని సంఘటిత పరచాలనుకొన్నారు. ఆ పది సూత్రాల్ని అనంతపురంలోనే వేరొక సభలో చదివి ప్రకటించారు.

[37]"మీలో ప్రతి ఒక్కరికీ సాంస్కృతిక రంగంలోని, ఉద్దేశాలని (**ideological forms**) గురించి ఆలోచించమనీ, వివిధ తరగతుల్లో, వృత్తుల్లో వున్న వారందర్నీ సంఘటిత పరచి ప్రజాస్వామిక విప్లవంలో చేరమని కోరుతున్నాం. దున్నేందుకు సొంతనేల, తినేందుకు కూడు, స్వేచ్ఛగా జీవించేందుకు స్వాతంత్ర్యం మొదలైన వాటిని గురించి మార్గదర్శకమైన చర్చావేదిక కల్పించాలని రచయితలందర్నీ ఆహ్వానిస్తున్నాం. ప్రజల్లోని మూఢనమ్మకాల్ని, అజ్ఞానాన్ని రూపుమాపేందుకు వొక విప్లవ సంస్థ ఆరంభించాలి. దానికి తగ్గసమయం, అనుకూల పరిస్థితులు ప్రస్తుతం వున్నాయి" అనీ వాళ్ళు ఆ సభలో ప్రకటించారు.

[37]జ్వాలాముఖి, నిఖిలేశ్వర్ "ది హిందూ"కి ఇచ్చిన ఇంటర్వ్యూలో తాము పది అంశాల కార్యక్రమాన్ని గురించి చర్చించడం కోసం ఆంధ్రప్రదేశ్‌లోని రచయిత లందరికీ పాదులు కల్పించామని అన్నారు. "మేము

ఇతర రచయితల్తో క్షుణ్ణంగా చర్చించడం వల్ల వేరొక కొత్త విప్లవరచయితల ఉద్యమాన్ని నడపగలం" అని అంటూ ఆరునెలల్లో తమ సిద్ధాంత ప్రాతిపదిక
ికి ఒక రూపు కల్పించగలమని వారన్నారు.

1970లో విరసం ఏర్పడ్డప్పటినించి అధ్యక్షుడుగా వుండిన శ్రీశ్రీ తమ అధ్యక్ష పదవికి 10-6-77న రాజీనామా సమర్పించారు[38]. తన రాజీనామా పత్రంలో, తాను ఇందిర పరిపాలనని సమర్థిస్తూ, ఆకాశవాణికి ఇరవై ఆర్థికసూత్రాల మీద పాట రాయడం గొప్ప పొరబాటనీ, విప్లవ కవులు అనేకులు జైళ్లలో మగ్గుతుంటే విదూషకుడి లాగా జలగం వెంగళరావు (నాటి ముఖ్యమంత్రి)ని గురించి పొగుడుతూ రాయడం తప్పనీ, దేశవ్యాప్తంగా పౌరహక్కుల్ని కాలరాస్తూన్నా ఆ సంఘం అధ్యక్షుడిగా తానేమీ చేయలేక పోయాననీ, అందువల్ల తాను అధ్యక్షుడుగా వుండేందుకు అర్హతలేని వాడిని అంటూ, విరసంతో తన సంబంధం ఎప్పుడూ ముడివడి వుంటుందంటూ, సామాన్య సభ్యుడిగా ఇకముందు విరసం ఆశయాలను సరిగ్గా అవగాహన చేసుకొంటానంటూ, ఉద్యమాన్ని అభివృద్ధి చేసే కార్యక్రమాలలో తన్నొక భాగస్వామిగా సాగిపోనివ్వండని సర్వసభ్య సమావేశాన్ని అభ్యర్థిస్తున్నట్టు పేర్కొన్నారు.

విరసం సర్వసభ్యసమావేశం శ్రీశ్రీ రాజీనామాన్ని జూన్ 11వ తేది ఆమోదించింది.

## విప్లవ కవిత :

విరసం కవులు తమ రచనల్ని సొంత ప్రచురణల ద్వారా, విప్లవ పత్రికల ద్వారా తీసుక వచ్చారు. ఇది కవితా సంకలనాల యుగం అయింది. విప్లవం వర్ధిల్లాలి, సమరం మొదలైన సమిష్టి సంకలనాలు—ఒకే సంకలనంలో విభిన్నకవుల రచనలు : ఎరుపు, వి.బి. గద్దర్ పాటలు, గమ్యం, జముకుల కథ, మహోదయం (బుర్రకథ), ఎర్ర పిడికిలి, జననేన పాటలు, ముట్టడి, ఓటమి, తిరుగుబాటు, మండుతున్న తరం, సూరీడు, ఎర్రమందారాలు మొదలైన కవితా సంకలనాలు వెలుగు చూశాయి. ప్రభంజనం, పిలుపు, ఎర్రగడ్డ, విమోచన మొదలైన పత్రికలూ, సాహిత్యమిత్రుల ద్వారా ప్రచు

రింపబడుతూ వుండిన సృజన మాసపత్రిక విరసంకి వేదికలయ్యాయి. సుబ్బారావు పాణిగ్రాహి పాటలు, శ్రీకాకుళసత్యం పోరాట గేయాలు ఏ విప్లవ కవినోట విన్నా, ఏ నక్సలైట్‌ని కన్నా, ఏ విరసం పత్రిక చూసినా కనబడుతూవుండేవి. అయితే వాళ్ళెవరూ నేడు మనమధ్య లేరు.

విప్లవ కవితల్ని, కొన్నిటిని చూస్తే అవి వుద్యమానికి ఎలా వుపయోగ పడ్డాయో, ...ం లాంటి కవితాగుణాల్ని వాళ్ళెంతవరకు పోషించారో అర్థం అవుతుంది. విరస కవుల్లో చాలామంది యువకులు, రచనా వైవిధ్యం లేక పరిపక్వదశని పొందని వారు. అందుకని వాళ్ళ కవితల్లో చాలా భాగం ఆవేశ పూరితంగా వుండినా కవితాశిల్పం లోపించివుంటుంది. అందుకే కొంతమంది వీళ్ళని 'సినిమా కష్టాలు చూసి కన్నీళ్లెట్టుకొనే కుర్రోళ్ళ'గా గుర్తించారు. అయితే అన్ని గేయాల్లో ఇలాంటి విమర్శనే చేయలేం. కొంతమంది కాకలు తీరిన వాళ్ళ కవితల్లో అన్ని విధాల పరిపక్వదశని పొందిన శిల్పాన్ని చూడగలం.

సౌలభ్యం కొరకు విప్లవకవిత్వాన్ని కొన్ని భాగాలుగా విభజించి ఇక్కడ పరిశీలించడం జరిగింది.

## నినాదాలు మాత్రం గలది:

కొన్ని గేయాల్లో కేవలం నినాదాలే చోటు చేసుకొంటాయి. అయితే ఈ గేయాల్ని చదివేటప్పుడు నక్సలైట్ల నాయకులపై మార్క్సిజంపై వారి కున్న అచంచల నమ్మకాన్ని గుర్తు చేస్తుంటాయనడంలో సందేహంలేదు. ఈ గేయాన్ని చదివేటప్పుడు విరసం ఒక కవితోద్యమంగా గాక ఒక రాజకీయ సిద్ధాంతానుయాయిగా కనబడుతూంది. చారుమజుందార్ గ్రూప్ విరసంలో వెన్నెముకగా నిల్చి, వెనుక నించి నడిపిస్తూంది అన్న విషయం తట్టుతుంది.

[39]ఏ వూరని నిన్నెవ్వరడిగినా
నక్సల్‌బరి యని చెప్పాలె
ఎక్కడ చదివినావని ప్రశ్నిస్తే
శ్రీకాకుళమని చెప్పాలె
ఎక్కడ పని చేస్తున్నావంటె

బొగ్గుట్టల దిశ చూపాలె
ఏ మతమంటే మావోమతమని
ఏ కులమంటే శ్రామిక కులమని
కుటుంబ మడిగితె మృత వీరులదని
ఘంటాపథంగ చెప్పాలె
ఏ వూరని నిన్నెవ్వరడిగినా
నక్సల్‌బరి యని చెప్పాలె.

ఈ కవితలో నక్సల్‌బరి స్వరూపం వుంది. స్వభావం వుంది. దృఢవిశ్వాసం వుంది. దాన్ని సమర్థించే రచనగా గుర్తించటం తప్ప కవిత్వపు విలువల కోసం దీన్ని వెతకడం దండగ.

నక్సలిజాన్ని [40]'ఉప్పెనలా పొంగే ప్రజా హృదయాల్లోని విప్లవ వాంఛ'గాను, 'తుపాకి గొట్టం ద్వారానే రాజ్యాధికారం వస్తుందని గర్జించే వేలాది యువకిశోరాల విప్లవవాణి' గాను 'వర్గ శత్రు నిర్మూలనతో విప్లవోత్సవాలు జరుపుకోవాలన్న కోట్లాది పేద రైతుల తహతహ' గానూ గుర్తించడం కూడా జరిగింది.

[41]"ఇది మావో ఆలోచన విధం బలం
ఎంత తుంచి వేసినా, ఎన్నిసార్లు నరికినా
చిలువలేసి పెరుగుతుంది
మహా వృక్ష మౌతుంది.

అని చెప్పటంతోబాటూ గత్యంతరం లేని పరిస్థితుల్లో అణగారిన ప్రజలకున్న ఆయుధం మాత్రమే నక్సలిజం అనీ, అది తప్పదనీ చెప్పడం కూడా జరిగింది. దాంతోబాటు భూస్వాముల, దళారీ బూర్జువాల అమెరికా, రష్యా సామ్రాజ్య వాదుల దోపిడీకి గురియై, రోగపీడితమైన ఈ దేశం యొక్క...

[42]'ఆర్థిక రాజకీయ వ్యవస్థకు
మా విప్లవం శస్త్రచికిత్స'

అనడం కూడా కన్పడుతుంది.

నిర్మల్ కవితలో

[43]"కమ్యూనిస్టు సైనికులం
పీడిత జన పిడికిళ్ళం
నవభారత దూతలం
ప్రజల ముద్దు బిడ్డలం
మా లక్ష్యం జనలక్ష్యం
మా గమ్యం జనగమ్యం
మా యుద్ధం జనయుద్ధం"

కూడా కేవలం నినాదమే. ప్రముఖ విప్లవ కవి జ్వాలాముఖి 'విప్లవ జాతీయ గీతం' గేయంలో విపవం దేశం నలుమూలలా పాకింది అంటారు.

[44]ఇది కేరళ వీరుల అజితాజిత విప్లవ మలయాళం
ఇది దుర్మార్గుల నరమేధం జరిపిన నెత్తురు గంగాళం
ఇది వైనాడ్ అడవుల్లో రగులుతూన్న దావానల సంచారం
పడి లేచే కదలి తరంగాల బడబానల క్రాంతి తుషారం.

అన్న పాదాల్లో. అంతే గాకుండ.

[44]ఇది మార్క్స్ మేధస్సు నుండి పుట్టిన శాస్త్రపరిజ్ఞానం
ఇది లెనిన్ అంతస్సు నుండి గురిపెట్టిన శ్రామిక బాణం
ఇది మావో ఆలోచన నుండి దారిపట్టిన విప్లవ విముక్తి గానం
ఇది భారత జనతా సమతా సాయుధ విప్లవ విజ్ఞానం"

అన్న పాదాల్లో నక్సలిజం స్వరూపం కనబడుతుంది. అలాంటిదే

[45]నక్సల్‌బరి మోగించిన
సాయుధ ప్రజా కంఠాలం
శ్రీకాకుళ పోరాటం
తూర్పుగాలి కెరటాలం
పాణిగ్రాహి వారసులం

అరుణోదయ గాయకులం
మేం విప్లవ రచయితలం
సాంస్కృతిక సైనికులం.'

అన్న 'యాత్రిక్' రచన కూడా. ఇవి అన్నీ చూసినపుడు, మొదటి నించీ చారుమజుందార్ గ్రూపు వెనుకనించి విరసంని నడిపిస్తూంది అని చెరబండ రాజు ప్రభృతులు చూపిన కారణం నిరాధారమైంది కాదని, తెలుస్తూంది. తాము కవులమన్న మాట ఎపుడో మర్చిపోయారు. కేవలం నక్సలైట్లు గానే వూహించుకొన్నారు. నక్సలైట్లు చెప్పాల్సిన మాటలన్నీ తామే చెప్పారు. డాక్టరుగా పేరు మోసిన రమణారెడ్డి

[46]'అణగారిన జనం కోసం
అసువులర్పించే కు ం మాది
కష్ట జీవుల రాజ్యాన్ని నెలకొల్పడానికి
కంకణం కట్టుకున్న గోత్రం మాది
డబ్బుతో నిర్మించుకున్న అధికారాన్ని
డైనమైట్లతో కూల్చే వంశం మాది'

అంటూ ప్రభుత్వాలు వురితీసినా ప్రాదేయపడని శౌర్య సాహసాలు చూపించే వాళ్లు అనీ, ప్రజాపీడకుల ఫిరంగి దెబ్బలకు రొమ్మొడ్డి ఎదిరించే ధైర్యం గల వాళ్ళనీ, అవినీతి పాలకుల గుండెల్లో అనుక్షణం నిదిరిస్తూ సంఘంలోని అస మానతలన్నీ తొలగించి సమసమాజం నిర్మించే వాళ్లు అని కీర్తించారు.

ఈ విప్లవం కేవలం మన దేశంలోనే గాక ప్రపంచం నలుమూలల జరుగుతూందనీ, అది అన్ని విధాలా మంచి ఫలితాలనే చూస్తుందనీ, మనం వెనుకబడాల్సిన అవసరం లేదనీ వుద్బోధిస్తూ కొంతమంది రచయితలు రాశారు.

[47]ఎల్లో ఘనీభవించెను
యాంగ్సీ నది పొంగెను

అంటూ స్మశాన ప్రశాంతిని కోరే ఇనుపడేగ జనబాణం తగిలి ఛికాంగ్‌తో కూలినట్టు గానూ, 'మదం పట్టి కదంతొక్కు సైబీరియా తెల్ల ఎలుగు ఉస్సూరి

జలాలలో తలమునకలు వేసినట్టుగానూ, క్రెమ్లిన్ అధిగోపురం 'శ్రమజీవుల కల్పవల్లి' గాను చిత్రించి జగజ్జనుల స్వప్నాలకు ప్రతీకగా తీన్‌మీన్‌పై ఎగిరే 'అరుణారుణ పతాకం' చూడమంటారు. వెంటనే

[47]కొడవలి కొన బయ్‌నెట్ గా
గులకరాయి బులెట్ గా
సామాన్యుడె సాహసిగా
పరాజితుడె విజేతగా
రణరంగం మారెను'

ఇంకా ఎందుకు తాత్సారం, లే, ముందుకు నడువు అంటారు.

[48]'కోటకు నలువైపులనే కాదు
వీలైన అన్ని చోట్లా
డైనమెట్లు ప్చ కూల్చనిదే
దాని గుండె మన పిడికిల్లోకి రాదు'

జాతి పేరు చెప్పి, శాంతి సహనాల్ని నూరిపోసిన పాలక వర్గాల స్వార్థశక్తికి బానిసలయి, ఇంకా 'ఏదో మనకోసం చేస్తారనీ, మనం సుఖంగా బ్రతక గలం, అనీ ఆత్రులు చాచడం అవివేకం. ఈ ప్రభుత్వం పోయి, వేరే నాయకుల్లు వచ్చినా ఒరిగేది ఏమీలేదు. అది కేవలం తావు మార్పిడి మాత్రమే. ఎవరు వచ్చినా దోపిడీ వ్యవస్థని పోషించే వారే. 'అడవులు వేరైనా తోడేళ్లు పీక్కు-తినక మానవు.' వాళ్ళు చెప్పే కల్లబొల్లి మాటలకి తల ఒగ్గితే కష్టాలు గట్టెక్కవు. దివాళాకోరు విధానాల్ని అనుసరించే ఈ ప్రభుత్వం పేద ప్రజలకి సాయం చేయదు. ప్రణాళికలన్నీ పెద్దవాళ్ళకే, డబ్బున్న వాళ్ళకే, వాటినంతా విని మోసపోవద్దు అంటూ

[48]'ప్రజారాజ్య నిర్మాణం
ఇది పేదల నినాదం
ఇదె జీవన సిద్ధాంతం'

సాయుధ పోరాటం అంటూ

[48]చరిత్ర రథాన్ని లాగే
శ్రామికుల్ని సంతల్లో కొల్లగొట్టే
ప్రజల్ని మభ్యపెట్టి
'సంఘ వ్యతిరేక శక్తుల' నిర్మూలనకై
వేలైనా లక్షలైనా ఒక్కరుగా
లక్ష్యం మీది గురితో ఉరితాళ్ళకైనా వెరవక
తుపాకీ గుళ్ళకైనా జైళ్ళకైనా జంకక
ఒక్కటిగా నిర్మాణం సాగిద్దాం'

అంటారు.

గుక్కెడయినా గంజిలేక, పిల్లాపీచు పీనుగు లయ్యారని, ఎంత ఏడ్చితే మాత్రం ఏం లాభం. దానికి కారకులయిన దొరలు ఆ సంగతి పట్టించుకోరు. ప్రభుత్వం ఆ దొరలదే. వాళ్ళ కాళ్ళు పట్టినా, ముత్యాలమ్మకు మొక్కినా లాభం లేదు. చెమట ఓడ్చి పంటలు పండిస్తే అవి దొరల గరిసెల్లో దాక్కుంటాయి. ఆ గరిసెని చూస్తూ కూర్చుంటె కడుపు నిండదు. 'తిరగబడితె సుఖము కలదు. ఆ గరిసెని పగలగొట్టి తిండి గింజలు వెలికి తీయ్'. 'ఆకలితో అలమటించి కుక్కచావు చచ్చేకన్నా పోరులోన చావుమేలన్నా' అని ప్రేరణని కల్గిస్తూ

[49]'నీ పిల్లమేకా చల్లగావుండే
కరువులేని బతుకు కోసం
పోరు చేసే సేన చూడన్నా
ఆ ఎర్ర సేనకు తోడు రారన్నా
ఆ ఎర్ర సేనలో చేరరారన్నా

అంటూ కరువు కాటకాల్లో పడి చచ్చే పేదరైతుని వుద్బోధిస్తున్నాడు.

ఇలా విప్లవం నక్సలిజంతో అభేదత్వాన్ని సాధించడమే గాకుండ, పోరాటం నడపాల్సిన తీరుని కూడా నేర్పినట్టు కొన్ని రచనల వల్ల తెలుసూంది.

[50] పొదల నుంచి
దాక్కొ
మళ్ళీ మెరుపుదాడి గురిపెట్టి
గుండె అదరగొట్టి
ఎదురుగా తలపడకు
పగలు కనిపడకు
ఆడుగుజాడని కూడా అవతలి వాళ్ళకి చిక్కనీకు
శత్రు సమీకరణ బలపడితే
వెనక్కి తగ్గు
వెన్ను చూపితే
వెన్నంటి తరుము

- అన్నది ఒక ఉదాహరణ.

ఇలాంటి గేయాల్లో కవిత్వం కోసమో, భావచిత్రణల కోసమో చూసి ప్రయోజనం లేదు. వాటిలో కేవలం వుపదేశం మాత్రం వుంటుంది. అదీ నక్సలైట్లకి మాత్రమే. ఇలాంటిదే తెలంగాణా పోరాటంలో నడిపిన గెరిల్లా పోరాటంలో కూడా కన్పడుతుంది. ఆ వుపదేశాన్ని నేరుగా గాక పరోక్షంగా చెప్పడం చెరబండరాజు ప్రత్యేకత.

[51]గడ్డి పరక నోట కరచి లేడి గంతు లేసుకొంటు
అడుగులోన అడుగేసి పిక్కలాగి తింటోంది
కునుకు మరిచి ఉండెలతో కళ్ళు చితక గొట్టాలిరా - దాని
పేగు లాగి వెయ్యాలిరా' అని

## సాయుధ పోరాటాన్ని పరోక్షంగా సమర్థించు కవిత

కొన్ని కవితల్లో సాయుధ పోరాటం వినా మరో గత్యంతరం లేదంటూ చెప్పడంతో బాటూ, కష్టాలకి కారణాల్ని ప్రోదిచేసి, తగ్గదారిని వెతుక్కోమనడం కన్పడుతుంది. అయితే కవి ఎక్కడా సాయుధ పోరాటాన్ని సమర్థించడం లేదు. అయితే పరోక్షంగా అతని దృష్టి అదేననిపిస్తుంది. ఈ

కవితలో ముందటి భాగంలోని వాటిలాగా గాక, కవితా లక్షణాలు కొన్ని కనబడతాయి.

చెరబండరాజు కవిత అటు కవితా విలువలతో బాటు శ్రామిక సందేశాన్ని ప్రతిబింబించే రచన. మళ్ళీ చదివించేది, ఆలోచింపచేసేది, మార్గం వెతికేటట్టు చేసేది, కార్యోన్ముఖుణ్ణి చేసేది మంచి కవిత అయితే, అదే కవితా శిల్పం అయితే అది ఈ గేయంలో పుష్కలంగా వుంది.

[52]కూలికోసం తాను
ఎదురు తిరిగితేను
నక్సలైటూ వని
సంపేసి పోనారు
రాయి రప్పకు సెప్పనా—నా గోడు
నేనే రాయై పోదునా*

ఈ గేయం చివరి పాదాల్లో వున్న భావం కూలివాని మనస్తత్వానికి ప్రతిరూపం. ఎన్నాళ్ళుగానో వున్న బానిసతనానికి, ఎదురు తిరగాలనే విప్లవ భావానికి అక్కడ స్పర్ధ కనబడుతూంది. కవి టీచరు లాగా ఇలా చెయ్ అనడం లేదు. పండితుల్లాగా 'జీన్‌పాల్ సార్త్రే, మావో, మార్క్స్ ఇలా అన్నారు. దాన్నే అనుసరించు' అనీ చెప్పడం లేదు. అతని మనస్తత్వంలోనే, జరిగే కష్టాల్ను మననం చేసుకోవడంలోనే తనకు కల్గే భావాల్ని మాత్రమే బయట పెట్టుతున్నాడు. ఇది వ్యక్తిచైతన్యానికి సంబంధించింది. సాంఘిక చైతన్యం వ్యక్తి ప్రగతికి అందాలు చేకూర్చేదయితే, వ్యక్తి చైతన్యం దానికి పునాది లాంటిది. చైతన్యం పరిపుష్టం కావాలంటే సాంఘిక అంతరంగిక చైతన్యాలు బహు అవసరం అన్న విషయం విదితం అవుతుంది.

అంతరంగిక చైతన్యం ఎలా వస్తుంది? ఒక విషయం మీద ఒక అభిప్రాయాన్ని మనసా వాచా కల్గి, కర్మలో పెట్టేందుకు అనువైన పాదులు ఏర్పర్చుకొన్నపుడు, విషయం మీద అభిప్రాయం ఏర్పర్చుకోవడం అంత

* చూడు అనుబంధము III

సులభం వీంకాడు. మనసులో ఘర్షణ ప్రారంభం అవుతుంది. రకరకాల కోణాల్లో ప్రతిబింబిస్తుంది. వాటి నన్నిటిని అధిగమిస్తే తనకి కావల్సిన రూపం ఒకటి గోచరిస్తుంది. ఇదే చైతన్యం. చైతన్యం కల్గబోయే ముందు కల్గే విభిన్న భావాల్ని mulitipolarity గా గుర్తించారు. ఈ సంఘర్షణ-అంతరంగిక చైతన్యానికి అవసరమైంది - ఈ గేయంలో కన్పడుతుంది. వీడు సామాన్య మానవుడు. కష్టాలు పడ్డవాడు కాదు. కన్నీళ్ళు పెట్టుకొన్నవాడూ కాదు. దానికి పరిష్కారమార్గం వెదికేవాడు.

Transcendental Meditation ఆధారంగా ఈ చైతన్యాన్ని మరి కొంత వివరించొచ్చు. ఈ అభ్యాసంలో మొదట భూతానికి సంబంధించిన ఆలోచనలే వస్తుంటాయి. మరికొన్నాళ్ళకి భవిష్యత్ ఆలోచనలు, భూత ఆలోచనల్ని అధిగమిస్తాయి. పరిపక్వదశని పొందేటపుడు భూత భవిష్యత్ ఆలోచనలు పోయి వర్తమానానికి సంబంధించిన ఊహలే వస్తుంటాయి. ఇవి Transcendental అభ్యాసంలో అతను పరిపక్వం పొందాడని సూచిస్తాయి. ఈ సిద్ధికోసం కొంతకాలం పట్టొచ్చు. ఇలాంటి చైతన్యం ప్రస్తుత గేయంలో పుష్కలంగా వుంది. గేయం అంతా కష్టాల్ని ఏకరువు పెట్టుతున్నాడు. చైతన్యానికి కారణభూతమైన కారణాల్ని క్రోడీచేస్తున్నాడు. గేయం చివరలో పతాకాన్ని స్ఫురింప జేస్తున్నాడు.

"చెరువులో దూకనా
చెరువై పోదునా"

అన్న పాదాల్లో చెరువులో దూకడం గతంలో తానుపడ్డ కష్టాల్కి అంతం కల్గించుకోవడానికి; చెరువయి పోవనా అనడం కష్టాల్ని తప్పించుకోవడానికి దాపడం కన్నా, కష్టాలకి కారకులయిన వాళ్ళని తుదముట్టించితే, వాటిని అంతం వేయగలం కదా అన్న ఆలోచన. ఆశావాది ఆలోచన. భవిష్యత్ ఆలోచన. అతనికి భూత, భవిష్యత్ ఆలోచనలే వున్నాయి. వర్తమాన ఆలోచన, దీటైన ఆలోచన, వ్యక్తికి గీటురాయైన ఆలోచన ఇంకా రాలేదు. అంటే పరిపక్వదశని ఇంకా పొందలేదన్నమాట. అది పొందిననాడు వర్తమాన ఆలోచనల్ని కల్గిననాడు అతని చైతన్యం బయట పడుతుంది. అదే అతని భవిష్యత్ దారిని ఏర్పరుస్తుంది.

కవి చెప్పదలచుకొంది సూటిగా గాక, ధ్వనింప జేస్తున్నాడు. ప్రస్తుత కాలంలోని మంచి కవితల్లో దీన్ని ఒకటిగా పరిగణించొచ్చు.

మరో కవిత "ఝిజామ్" కవిత. ఇది మంచి కవిత్వం అవుతుందా? కాదా? అన్న ప్రశ్నకు తావివ్వదు. తాను చెప్పదలచుకొందీ, నిత్యమూ జరిగేదీ నిర్భయంగా, నిస్సంకోచంగా చెప్పడం మాత్రం కనపడుతుంది. ఎపుడో స్వాతంత్ర్యం అంటూ మనకు వచ్చింది నిజంగా స్వాతంత్ర్యమేనా? లేక తెల్లదొరలు నల్లదొరల కిచ్చిన సింహాసన మార్పిడి మాత్రమేనా? అన్న ప్రశ్నకు జవాబు దొరకదు.

[53]ఏది స్వాతంత్ర్యం ?
ఏది ప్రజాస్వామ్యం?
యజ్ఞోపవీతాల శంకరలింగాల
విభూతి, రుద్రాక్షమాలల నెపంతో
శాంతి, మోక్షాల వ్యామోహంలో
దేశ ప్రజల కళ్ళు గప్పి,
పన్నీటి స్నానాలలో, సంతాన భర్తురాంగ్ర పరిష్వంగంలో
విదేశీ మదిరల మైకంలో జవరాంగ్ర ఊరువుల నిషాలో
పట్టుపరుపుల శయ్యా సౌఖ్యాలలో
నిరంతర సుఖ భోగులైన
భారతీయ బాబాల, యోగుల
అంతర్జాతీయ వ్యాపారమా స్వాతంత్ర్యం?

ఈ కవితలో సామాజిక స్పృహలేని వాక్యమే లేదు. భావలోపం మచ్చుకు కూడాకానరాదు. చెప్పగల నేర్పు అలవి కానిది. చదువరిని ఆకట్టుకొనేది, గుక్క తిప్పుకోనీకుండా చేసేది లయాన్విత గుణం. అది కవిలో పుష్కలంగా వుంది. భాషయొక్క రామణీయకం చదువరిని ఆహ్లాదపరుస్తుంది. భావసౌందర్య లోకంలోకి తీసుకెళ్తుంది. అంటే లయాన్విత గుణం భాషాసౌందర్యాన్ని పోషిస్తుందని అర్థం. అయితే దాని మోతాదు ఎక్కువయితే భావసౌందర్యం

కాస్తా అడుగున పడిపోతుంది అంటే లయాన్వితగుణం సున్నితమైన భావ సౌందర్యాన్ని మింగేస్తుంది. ఇది ఈ కవితలో జరిగింది.

ఈ కవితలో చెప్పబడ్డ ప్రతి విషయం మనం కళ్ళారా చూసేదే. అది యథార్థం, వాస్తవికం. ఉన్నదున్నట్టు చెప్పబడ్డది. అయితే దీనికి రాజకీయ ఉపన్యాసానికి భేదం వున్నట్టు కన్పడటం లేదు. కవితలో వాస్తవికత వుండాలి. కాని అది శాస్త్రీయ సత్యం కన్నా భిన్నంగా వుండాలి. $E=MC^2$ (Eneargy = Mass and Velocity$^2$) అన్నది జగమెరిగిన సత్యం. కవికీ శాస్త్రజ్ఞునికీ స్పందన కల్గించేదీ ప్రపంచమే. ఈ స్పందన వల్ల నిశ్చేతనమైనవి సజీవాలవుతాయి. ఈ విషయంలో ఒక కవి ఇలా అంటాడు. [54]"The words of true poems are the tuft and final applause of Science" అని. అపుడు కళాత్మకమైన సత్యమూ, శాస్త్రీయ సత్యమూ ఒకటవుతాయి. శాస్త్రీయసత్యం బుద్ధి (మేధస్సు)తో ముడిపెట్టుకొని వుంటుంది. కళాత్మక సత్యం హృదయంతో ఆ సంబంధం కల్గివుంటుంది. ప్రస్తుత గేయం శాస్త్రీయ సత్యాన్ని చెప్పేదే తప్ప వాస్తవ కళని ప్రతిబింబించేదో, పోషించేదో మాత్రం కాదు.

[53]యంత్రాల వేడిలో
కారిన కార్మికుని చెమట బిందువులు
మరిగి మరిగి వేడెక్కిన రక్తం
సాధించిన ఉత్పత్తిని
స్వంతం జేసుకొని, కూలిడబ్బులతో వోరుమూయించి
అద్దాల భవనాల్లో, కుషన్ సోఫాల్లో
కులకదమా ప్రజాస్వామ్యం

అన్న పాదాలు మార్క్సిజం వూపిరి పోసుకొన్నవి. ఇది వాస్తవమైనదే అయినా కవితాదృష్టి, కళాత్మక దృష్టి అక్కడ కన్పడుతుంది.

ఇంకా ఈ కవితలో ద్వైధీభావం కూడా కన్పడుతుంది. మొదట "వర్గపోరాట దృక్పథం" నించి జ్ఞానాన్ని గ్రహించమంటాడు. వెంటనే 'సామాజిక పరిణామాల శాస్త్రీయ అవగాహన' నించి గ్రహించమంటాడు. సామాజిక పరిణామానికి శాస్త్రీయమైన అవగాహన వర్గపోరాటం అని ఈ కవి తలపు.

వర్గపోరాటం ఇండియాలో ఇంకా ప్రస్ఫుటం కాలేదు. వుండేవి కుల,మత పోరాటాలు మాత్రమే. ఏది ఏమయినా, కవి శ్రామిక సుందర సమతా రాజ్యంలో సమతా వ్యవస్థ చూడాలనే గొప్ప ఆశావాది.

55క్కొక్కొరోకో అని కోడి కూసింది
మబ్బులన్నీ దాటి మన అన్న సూరీడు
మారేడు కొండల్లొ మాటు కాశాడు
చీకట్ల దొరలను చీల్చి వేస్తున్నాడు.

ఈ గేయం లోని 'చీకటి' పెట్టుబడి దారీవ్యవస్థ, శ్రమను దోచుకొనే వ్యవస్థ. 'మబ్బులు' అడ్డంకులు. 'మాటు కాయడం' వ్యవస్థని చెండాడడం కోసం. చీకటులనే పెట్టుబడిదారీ వ్యవస్థని. ఎన్నో అడ్డంకుల్ని అధిగమించి, చీల్చి వేయడం కోసం సూర్యుడనే నక్సలైటు మారేడు కొండల్లో పొంచి వున్నాడని కవి భావించాడు రోజూ వుదయించే సూర్యుడే ఇలాంటి విప్లవ భావాలు కల్గి వుంటే మనమెందుకు చైతన్యాన్ని పొందకూడదు. నేటి వ్యవస్థ విప్లవాన్ని కోరుతుంది అన్న విషయాన్ని యథాతథంగా చెప్పకుండా ఉపమానాలచేత స్ఫురింప జేస్తున్నాడీ కవి.

55"ఈనిన వరిచేను పాలుపోసింది
పాలు పోసిన చేను అర్రు వంచింది
అర్రువంచిన చేను కోతకొచ్చింది
కోతకొచ్చిన చేదు కోతకోరింది

అని ఈ గేయంలో రైతుని సంబోధిస్తూ అతన్ని కూడా దోపిడి వ్యవస్థని ఎదుర్కోమని పరోక్షంగా చెప్తున్నాడు.

55ఏతమెత్తిన వాడ ఏరు కట్టిన వాడ
నారు పోసినవాడ నీరుపోసినవాడ
దుక్కి దున్నినవాడ మొక్కనాటినవాడ
కలుపు తీసినవాడ కలత మోసినవాడ
కోత కొచ్చిన చేను కోత కోరింధి

జావ్యమేల ఒంటలుదేరు అంటాడు. ఈ గేయం పేరు కొక్కొరోకో. చీకట్లని చీల్చుకొని, రాబోయే ఉషః ఖడ్గాల్కి స్వాగతం పలుకుతుంటూంది కోడి. కోడి కూతతో పల్లె నిద్రమేల్కొంటుంది. అలాగే పాత దోపిడి వ్యవస్థని ఎదు ర్కొనేందుకు సంఘం మేల్కొంది. అన్న విషయాన్ని పరోక్షంగా చెప్పడం పై గేయంలోని విషయం.

> 56'నీ కళ్ళలో కారం జల్లి
> నీదున్నంతా దోచుకొని
> నీ మొహాన వేడినీళ్ళు జల్లి పన్నీరనుకోమంటున్నారు'

ఇంకా ఎందుకు నాయకుల ప్రియవచనాల్ని విని మోసపోతావు. పదిమందితో బ్రతకాలని వుంటే, కుక్కలకన్నా హీనంగా పదవులకై పోరాడే ఆ నాయ కుల మాటల్ని విని ఏం సాధించగలవు. పైశాచికంగా స్వార్థం ప్రజ్వరిల్లి, మతం కులం మత్తుమందు సంఘాన్ని ముంచెస్తుంటే ఇంకా ఇంకా నీమాట నామాట వినే వాడెవ్వడు? అది కేవలం పార్టీల మార్పిడి. ఆ వేట అంతమయేది లేదు. మన గోడు వినబోయేది లేదు. చైతన్యం నింపుకొని, సజావుగా సంఘం లోకి వచ్చి జరిగేదేదో తెల్సుకొని, మనుగడకి కాంక్రీటు వేసుకోమని చెప్పడం మరోగేయంలోని విషయం. ఈ కుట్రలు, కుతంత్రాలు, దోపిడీలు ఇలా పట్ట పగలు జరుగుతున్నా ఇంకా చూడని చూడనేరని వాడిని పిల్చి

> 56 ఇంకా నీ రక్తంలో సెగలపొగలు
> నీ మస్తిష్కంలో విప్లవ దుందుభులు
> రేగటం లేదూ మ్రోగటం లేదూ

అంటూ వెన్ను తట్టి

> నీవిలా నీరసంగా చూస్తున్నంత కాలం
> నిన్ను కాల్చుక తింటాయి ఈ కొరివి దయ్యాలు

కనుక నీ దారిని వెతుక్కో; దాన్ని రాచబాట చేసుకో అన్న సందేశం కన్పడు తూంది. అయితే కవి ఎక్కడా నక్సలిజమే సరైన దారి అని మాత్రం చెప్పడంలేదు.

57 'కాకి మబ్బులు పళ్లై కమ్ముకున్నాయంట
మబ్బు కొప్పును మెరుపు లొరిసి కోసాయంట
గూని మబ్బుల ఉరుము లదరగొట్టాయంట'

అన్న భావచిత్రణ కనబడుతుంది 'సంతాల్' గేయంలో "మాపల్లె" గ్రామంలో వ్యవసాయకూలీలు సమ్మెచేస్తూ ఎర్రజెండాని ఎగరేశారు. అది చూసిన ప్రభుత్వం పోలీసు బలగాన్ని ఊరిలో దింపింది. వ్యవసాయకూలీలు పోరుసల్పుతూనే వున్నారు. 'కాకిమబ్బులు' 'గూనిమబ్బులు' పోలీసులు. 'మెరుపు' వ్యవసాయ కూలీలు. పోలీసు సంస్థ దోపిడీవ్యవస్థకి మాత్రమే రక్షణ కల్పించేది- సక లైట్ల విషయంలో. కనుక ఇక్కడ పోలీసుల ద్వారా దోపిడీ వ్యవస్థ 'మబ్బులు' అవుతుంది. మబ్బులు, మెరుపులు ఢీకొంటున్నాయట. తద్వారా పిడుగులుపడి దోపిడీ వ్యవస్థని చీల్చేస్తున్నాయట. మంచి ఊహా చిత్రమే. అయితే మబ్బులు మబ్బులు కల్సికొంటేనే మెరుపు మెరుస్తుందన్న, పిడుగు పడుతుందన్న వాస్తవానికి కవి దూరమయ్యాడు అందుకనే మబ్బుల్ని వేరేగా, మెరుపుల్ని వేరేగా భిన్నదృక్పథాలు గల దోపిడీ వ్యవస్థ, వ్యవసాయ కార్మికులకు ఉపమానాలుగా వాడుకొన్నాడు. కవికి ఆవేశం వుంది. కార్మికులపై సరైన అవగాహనా వుంది కాని ప్రకృతిని వర్ణించేటపుడు, సంఘానికి పోల్చేటపుడు లేంది అనుభవం మాత్రమే.

## మానవత్వం అవసరాన్ని గుర్తించిన కవిత:

రూపాయి నోట్లో తలదూర్చి గిలాగిలా తన్నుకొంటున్న మానవుడు పతాభిలో, దిగంబర కవుల్లో మాత్రమేగాక, విప్లవ కవుల్లో కూడా కనబడతాడు. మనిషి మనిషిగా బ్రతకాలి. ధైర్యంగా బ్రతకాలి. కుట్రలతో, కుతంత్రాలతో, మోసాలతో. ద్వేషాలతో బ్రతికే బ్రతుకుని వీళ్లు ఈసడించుకొన్నారు, మనసార నవ్వగల్గిన మానవునికి వీళ్లు పదేపదే అర్రులు సాచారు. బ్రతికేందుకు డబ్బు అవసరం అయితే దానికే అమ్ముడు పోవడాన్ని వీళ్లు గర్హించారు.

58 మొగాడి శక్తిని ఆడదాని శీలాన్ని
బంధుత్వాల అనురాగాన్ని

ధర్మదేవత కుంటి కాలుని
న్యాయస్థానాల పుణాదిరాళ్ళని
బజారులో బేరాలు చేసేది
జీవితం కాదని
సత్తు అర్ధ రూపాయొకటి
చెప్పింది నిన్న"

అన్న గేయంలో కనబడుతుండేది అదే.

## స్మృతి గీతాలు:

తెలుగు ప్రాచీన సాహిత్యంలో అక్కడక్కడా స్మృతి కావ్యాలు (Elegies) వున్నా భావకవిత్వంలో మరికొంత స్థానాన్ని సంపాదించు కొన్నాయి[59]. తర్వాత అభ్యుదయ కవుల్లో శ్రీశ్రీ రాసిన [60]'కాంపెల్ల జనార్ధనరావు కోసం' అన్నది ఇంకొంచం ముందుకు సాగిన స్మృతిగేయం. ఈ ప్రక్రియ విప్లవ కవుల చేతిలో మరీ సునాయాసంగా సాగిపోవడమే గాకుండా, గత స్మృతుల్ని పదే పదే జ్ఞప్తికి తెచ్చింది.

మొట్టమొదటి Elegy అన్నది గ్రీకు సాహిత్యంలో కన్పడుతూంది. శోక గీతం, విలాపగీతం - అన్న అర్థంలో వాడబడుతున్నది ఈ ఎలిజీకి గ్రీకులోవున్న అర్థం వేరు. మృతదేహానికి, దహనక్రియ సందర్భంలో కొన్ని మంత్రాల్ని చదివేవారు. అవి సంగీతభరితంగా వుండేవి. వాటిని ఎలిజీలుగా గుర్తించారు కొంతమంది. అయితే సాహిత్యలోకంలో దాని కంతగా గుర్తింపు వున్నట్టు తెలీడంలేదు. ఏది ఏమైనా ఇది నిర్దిష్టఛందస్సులో రాయబడింది అని మాత్రం చెప్పగలం. [61]..... ...the only restriction being, apparently that it must be written in the elegiac measure, a distich composed of a dactylic, hexameter in combination with a dactylic pentamater (Norman Hepple-The English Lyrical Poems, Page : 165)

[62]"A lyric is usually formal intone and diction, suggested either by the death of an actual person or by the poet's contemplation of the tragic aspects of life". మరణించిన వ్యక్తిని

గురించి గానీ, జీవితంలోని విషాద సంఘటనల్ని గురించిగానీ, స్వరసహితంగా పదాల్ని గుప్పిస్తూ రాయబడ్డ గీతం స్మృతిగీతం అని అర్థమవుతుంది. దీనివల్ల నియమితమైన ఛందస్సు కాకపోతే ఒక tone (స్వరం) వుండడం అవసరం అయినట్లు తెలుస్తూంది.

ఇది ఆంగ్ల సాహిత్యం ఆధారంగా నిర్వచించబడ్డది. తెలుగులో ఆ విధంగా ప్రత్యేక ఛందస్సులో రాయాల్సిన నియమమున్నట్టు కానరాదు. పై గ్రంథంలో ఇంకా చెప్తూ [62]"............. Originally, any poem in this distich form (with the exception of the epigram) was known as an elegy, whether it concerned the dead, was a war song, a political satire or dealt with love" అంటూ విలాపాన్ని చెప్పటంతో బాటు స్మృతిగీతానికి అర్థంలో కొంత వెసులుబాటు కల్పించాడు. ప్రభుశంకర కూడా [63]'తమకు అత్యంత ప్రియుడైన వ్యక్తి మరణిస్తే, అతన్ని గూర్చి రాసే కావ్యాన్ని/గీతాన్ని ఎలిజి లేక శోకగీతం అని మనం పిలుస్తాం" అంటారు.

పై విషయాల్ని పరిశీలించేటపుడు వ్యక్తి మరణం స్మృతిగీతానికి ఆధారమైందిగా తెలుస్తుంది. విప్లవ కవుల స్మృతిగీతాల్లో తమ వీరుల మరణమే వస్తువు అయింది.

విప్లవ కవులు ఈ ఎలిజీని మరింతగా విస్తృతపరిచారని చెప్పొచ్చు. మరణించిన అనేక వీరులు వీళ్ళ కవితల్లో చోట్లు చేసుకొన్నారు. సృజన సంపాదకీయం ఇలా రాసింది: [64]"ప్రజల పట్ల, పీడితుల పట్ల ప్రేమతో సమాజంమీద శాస్త్రీయ ప్రయోగాలు చేసే అన్వేషకులు యవ్వనం కన్నా చావును, సౌఖ్యంకన్నా త్యాగాన్ని, భద్రతకన్నా బలిదానాలను కావాలని ఎంచుకొంటారు—ముందు తరాలు సుఖంగా క్షేమంగా బతకాలని. వాళ్ళకు విప్లవకారుడుగా జీవించడం గొప్పవిషయం. విప్లవకారుడుగా మరణించడం అన్నిటికన్న గొప్ప విషయం." అని

విప్లవ వీరుని మరణం విప్లవ కవుల్ని, విషాదంలో ముంచింది. ఉత్తేజితుల్ని చేసింది. స్మృతిగీతాల్కి రూపం కల్గింది. వాటితో కొన్ని ఇక్కడ వుదాహరింపబడుతున్నాయి.

భారతదేశంలో రైతాంగ సాయుధ పోరాటాన్ని నడిపిన ఘనత చారుమజుందార్‌కే దక్కుతుంది. 'కామ్రేడ్స్ రక్తంతో అరుణారుణమైన బాటే విప్లవపు బాట. మానవ జాతి విమోచనకు కొరకు ఏ మూల్యం చెల్లించకుండా ఎలా వుండగలం?" అంటూ 'ఆకలితో చావడంకన్నా పోరాటంలో చావడం మేలు' అని పోరాటానికి జనమూ జీవమూ కల్గించాడాయన. 'మస్తిష్కాల్ని దులిపి, చరిత్రలో కొత్తపుటల్ని తెరిచి మేధావులకు కర్తవ్యం బోధించిన మనీషి' ఆయన. 'ప్రభుత్వాన్ని ప్రకంపింపజేసి, పెట్టుబడిదారుల జాతకాల్ని బట్టబయలుచేసి, భూస్వాముల గుండెల్లో గుబులు పుట్టించి' ఉడుకు పుట్టించి కంపరం పుట్టించింది ఆయన. ఆకలి, అసమానతలకు, బానిసత్వానికి గురియై చావడం కన్నా స్వేచ్ఛకోసం పోరాటంలో మరణించడం జీవితాశయంగా ఎంచుకొన్నాడాయన. అతను అస్వస్థుడుగా వున్నపుడు పోలీసులు అరెస్టు చేశారు. అనారోగ్యకారణాల వల్ల చారుమజుందార్ అస్తమించాడని ప్రభుత్వం ప్రకటించింది. ఆ వార్త విన్న విప్లవకవులు

[65]'చాటండి గళమెత్తి
చారుమజుందారు
చచ్చిపోలేదని,
చంప బడ్డాడని'

అంటూ ప్రభుత్వ దమన నీతిని గర్హిస్తూ నినాదాలు చేశారు. చారుమజుందార్‌కి

[65అ] 'రైతు సాయుధ ఎర్ర సేనల
దర్శకత్వపు మేటి నేతగ
విప్లవాత్మకమైన పార్టీ
నిర్మాణంలో మంచి దిట్టగ
ప్రియతమ నేత చారు చూపిన
మార్గమున పయనించ రండోయ్'

అంటూ నివాళులు అర్పించారు. చారుమజుందార్ బతికున్నాడు కబడ్దార్ అంటూ

[65 ఆ] 'పదునైన కత్తుల్లాంటి సిద్ధాంతాలపై నడిచి
పగలూ - రాత్రీ విశ్రాంతి మరిచి

'శ్రామిక - కర్షక - కార్మికుల కొరకు
నిరంతరం కృషి చేసిందాయన
వర్గచైతన్యానికి పదును పెట్టిందాయన
సాయుధ పోరాటానికి పునాది వేసిందాయన'

అని అతన్ని కీర్తించారు అతన్ని 'కలకత్తా నడి వీధుల్లో ఎర్రభయం సృష్టించిన ప్రపంచ నూతన ఆలోచన'గా గుర్తించారు. గుర్తించడమే గాకుండా

[65] అ 'ఆలోచనలను అరెస్టు చేయగలిగిననాడుకాని
చారు మజుందార్ చచ్చిపోడు
చారుసమతా సుందర ఆలోచనా
అమరుడు కామ్రేడ్'

అంటూ అతనికి 'లాల్ సలామ్' అర్పించడం కూడా కనపడుతుంది.

[66]"నిరాయుధులను కాల్చి చంపడంలో వీరత్వం లేదు. ధైర్యముంటే మాకూ తుపాకులివ్వండి కాల్చుకుందాం. ఎవరు వీరులో తేల్చుకొందాం." అని వీరావేశంతో రొమ్మొడ్డి, పోలీసుల ఎదిరించి పల్కినవాడు పంచాది కృష్ణమూర్తి. అతడు "ఆలోచనాపరుడేకాదు. మార్క్సిస్టు సిద్ధాంతాన్ని ఆకళించుకొన్న మేధావి. మాటలు కాదు చేతలు కావా లన్నాడు. పేదకుటుంబంలో పుట్టినా ఎం.ఏ వరకు నానా విధాల కష్టపడి చదివాడు. వీరనారి పంచాది నిర్మల అతని సహధర్మచారిణి. శ్రీకాకుళంలో రైతాంగ పోరాటాన్ని పథకం వేసి అమలు జరపడంలో శ్రద్ధ తీసుకొని ఎన్నో అవాంతరాల్ని అధిగమించి, మిత్రుల సాయంతో దానికొక రూపుని కల్గించినవాడు కృష్ణమూర్తి. తన చదువుతో ఎదో వుద్యోగం సంపాదించి పొట్టబోసుకోవడం తనకి వీలుగాని పని. తోటిసోదరులు ఇంకా నికృష్టంగా బ్రతుకుతుంటే, దోపిడీ వ్యవస్థ వాళ్లని ఇంకా దోచేస్తుంటే నిప్పుకు నీరెత్తినట్టు వుండలేక పోయాడు. ఆంధ్రదేశంలో భారత కమ్యూనిస్ట్ పార్టీ(మార్క్సిస్ట్-లెనినిస్ట్)నిర్మాణంలో ప్రముఖ పాత్రధారి. పీడితప్రజల ఉజ్జ్వల భవిష్యత్తుని ఆకాంక్షిస్తూ వాళ్ళకి అంకితమైన వాడు మూర్తి. ఒకనాడు కలకత్తా నించి వస్తూ రైల్వేస్టేషనులో పోలీసులకి పట్టుబడ్డాడు. [66] అ అది జూన్ 27, 1969. అసువుల్ని తూటాల్తో తీసారు. అలాంటి వీరుడు ప్రియతమనాయకుడూ అయినాడు కనుక అతనిపై చాలా స్మృతి గీతాలు వచ్చాయి.

[66] ఆ వెట్టిచాకిరి పరుల దోపిడి
కూకటి వేళ్ళతో కూల్చివేయగా
పట్టుబట్టి చే తుపాకి పట్టి
'గట్టివాడ' వన్పించావయ్యా!
చదివిన చదువుకు విలువ కలుగగా
పరుల సుఖంకై త్యాగం చేసి
స్వార్థ త్యాగము ప్రతియువకునకు
చిరునవ్వులతో నేర్పినావయ్యా

అంటూ అతన్ని కీర్తించాడు ప్రేమపార్థానంద్.

శ్రీకాకుళం జిల్లా సోంపేట తాలూకా బొడ్డపాడు గ్రామంలో మరో కిశోరం వెలసింది. పంచాది కృష్ణమూర్తికి కుడిభుజంగా తయారయి, రైతాంగ పోరాటం నడిపింది. ఆ కిశోరం తామాడ గణపతి. చిన్నప్పటినుంచి పేదల పక్క నిల్చి వారి కష్టాలకి గట్టు చూపిస్తూ వుండేవాడు. ఫారెస్ట్‌వాళ్లు పండగ మామూలు అంటూ పొట్టేళ్ళని, మేకపోతుల్ని, ప్రజల్ని బాధించి తీసుకెళ్తూ వుంటే, రైతు సంఘాల్ని ఏర్పర్చి, వాళ్ళని ఎదుర్కొన్నాడు. ఊళ్ళో ఉన్నత పాఠశాలని ఏర్పర్చడమే గాకుండా యువకుల్ని, చేరదీసి 'వయోజన విద్య' నేర్పి, కల్లు, సారాయి తాగడం మాన్పించి, వాళ్ళకి ఆటపాటల్ని నేర్పి, సంక్రాంతి వుత్సవాలు, పండుగల్లో సంబరాలు చేపిస్తూ వుండేవాడు. ఆ ప్రాంతంలోని పేదోళ్ళంతా అతన్ని దేవునిలాగా పూజించేవాళ్ళు. పంచాది కృష్ణమూర్తిలాగా తామాడ గణపతి కూడా పోలీసుల చేతుల్లో చిక్కాడు; దుర్మరణం పాలయ్యాడు. అతన్ని గురించి వున్న స్మృతి గేయంలో జననం' దగ్గర్నించీ, మరణం వరకు అతను చేసిన మంచి చెడ్డలన్నిటినీ క్రోడీకరించారు రచయిత.

[67] "దోపిడీ దొంగలంత పరిపాలన చేస్తుంటే
పేదోళ్ళ పీకనొక్కి సంపద కాజేస్తుంటే
ఈ ముండబతుకు మనకొద్దన్నావా"

అని అతని బోధనని చెపూ

[67]చరిత్ర పుటల్లోన ఎర్రగ వెలుగొందేవు
త్యాగశీలివై ధరణిలోన మిగిలావు
మా ఎర్ర వందనాలు అందుకోవయ్యా

అంటూ గణపతికి నివాళులు అర్పించడం కనబడుతుంది.

విప్లవ రచయితల సంఘ పుట్టుకకు దారితీసిన విశాఖ విద్యార్థులతో చేయి కల్పిన వాడు ఎస్. ఎస్. ప్రకాశరావు. సమాజంలో రచయిత పాత్రపట్ల మార్క్సిస్ట్-లెనినిస్ట్ అవగాహనతో మసలుకొన్నవాడు. 'మావో ఆలోచనా విధానమంటే శాస్త్రీయ ఆచరణకు, పీడిత ప్రజల విముక్తికి బాటలు వేసే దీర్ఘకాలిక సాయుధ పోరాటాలకు స్పష్టమైన రూపమని నీళ్ల నములుడు లేకుండా నమ్మినవాడు'. 'ఉప్పెన' - చైనా నవల అనువాదం సగంలోనే ఆగి పోయింది. ప్రమాదవశాత్తు శాస్త్రీయ పరిశోధనలో ప్రాణాలు కోల్పోయాడు. అతన్ని 'మనిషి బతుకు మధ్య దేముడు ఉంటాడని చూపిన' వ్యక్తిగా కీర్తిం చాడు విషారా[68].

[68]ఆ 'మరణాన్ని ధిక్కరించాలన్న మానవుడివి
'మంచి' దారిన నెత్తుర్లు చిందినా నడవాలన్నవాడివి
మనిషిగా నువ్వెత్తిన సిద్ధాంతం బందూకుతో
'ఉప్పెన'లా విజృంభించాలన్న సోదరుడవు'

అన్నాడు జ్యోతి.

అలాగే చెరబండరాజు
[68]ఆ 'కవిత్వంలో తప్ప ఏడ్వలేని వాడికి
జీవితంలోని కాఠిన్యమూ కారుణ్యమూ
ఏవీ సొంతం అర్థం కాదు లాగుంది
ఏ ఆశా ఫలించక ముందే
నీ పచ్చని జీవితం
కాలిపోయి ఈథర్‌లో కల్సి పోయింది'

అంటూ వాపోయాడు.

పశ్చిమగోదావరి జిల్లా దెందులూరులో పుట్టిన కొల్లిపర నరసింహారావు, నక్సలైట్ అయ్యాడు. జిల్లా జిల్లా తిరిగి పార్టీని నిర్మించాడు. గెరిల్లా దళాన్ని చేర్పించాడు. తెలంగాణాలో గుడిమెళ్ళలో, నల్లకుంట కొండల్లో గాలిలాగా తిరిగాడు. 1972 మే 11 న పోలీసు బలగం ఇతన్ని చుట్టుముట్టింది. అవసానం కల్పించింది. అతని జీవితాన్ని పూర్తిగా స్పృశిస్తూ, జానపద బాణీలో కె. వి. రమణారెడ్డి ఒక స్మృతి గేయం రాశాడు.

[69]'సై సై నరసింహారావూ - రావూ
నీ గుండె లెవ్వరికీ లేవు'

అన్న 'పల్లవి'తో సాగిన కవిత అది.

పంచాది కృష్ణమూర్తి భార్య పంచాది నిర్మల కూడా సాయుధ పోరాటంలో అసువులు వీడిన విప్లవ నాయకురాలు.

[70] "మాంచాలను కొలుస్తారు, మల్లమ్మను తలుస్తారు
ఝాన్సీలక్ష్మీబాయికి బాష్పధార విడుస్తారు
సరోజినీదేవి పటం కట్టి పొగుడుతారు
పంచాది నిర్మలంటే భయం పుట్టి వణకుతారు'

అని శ్రీశ్రీయే ఆమె వ్యక్తిత్వాన్ని చూపారు. తనభర్త వీరమరణం పొందిన కొద్దికాలంలోనే తానుకూడా పోరాటంలోకి దూకి వీరోచితంగా పోరాడి వీర మరణాన్ని పొందింది. ఆమె జీవితంలోని అన్ని సంఘటల్ని తీసుకొని కోలాటం బాణీలో పి.టి.గద్దర్ రాశారు. ఆమె ప్రముఖ విప్లవ నాయకుల వద్ద నేర్చుకొన్న పాఠాల్ని ఊరూరూ తిరిగి ప్రజల్కి నేర్పి సాయుధ పోరాటంలో పాల్గొనమంది [70అ].

ఇలాంటి స్మృతి గేయాలు విప్లవ కవుల రచనల్లో విరివిగా కన్పడుతున్నాయి. ఈ స్మృతిగేయాల్లో కవిత్వదృష్టి వున్నట్టు కన్పడటం లేదు. తమ నాయకులు మరణించినపుడు దుఃఖం ఆపుకోలేక వాళ్ళని పదేపదే స్మరించడం, వాళ్ళ చేష్టల్ని జ్ఞప్తికి దెచ్చుకోవడం, వాళ్ళ జీవితాల్ని పరామర్శించడం, పార్టీకి వాళ్ళు చేసిన సేవని విలువ కట్టడం, తామూ అదే దారిలో పయనిస్తాం

అని ప్రమాణాలు చేయడం, స్మృత్యంజలులు సమర్పించడం కన్పడుతుంది. వీటివల్ల విప్లవ యువకులకి ధైర్యం రంగరించి పొయ్యగలిగారు. ఎప్పుడైనా చావడం తథ్యం, అదీ ఎర్రజెండా నీడనే చద్దాం అన్న భావాన్ని ప్రచారం చేయడం కన్పడుతుంది. ఈ కవితల్లో కవిత్వపు విలువల కోసం వెతకడం వీలుకాని పని.

ఒక్కో వ్యక్తిని గురించి, విడివిడిగా గాక, విప్లవ నాయకులిక్కి సామూహికంగా జోహార్లు అర్పించడం కూడా కన్పడుతుంది[71].

ఈ అధ్యాయంలో విరసం—ఆవిర్భావం, వికాసం, విప్లవకవిత్వం—ల గురించి, కొన్ని అంశాల ఆధారంగా వివరింపబడింది. ఇంతవరకు చెప్పబడ్డ కవితోద్యమాలన్నీ వస్తువు దృష్ట్యా చెప్పబడ్డాయి. వీటికి రచనా వాహికగా వృత్తాల నించి వచన కవిత వరకు కనబడుతున్నాయి. వాటిలో స్వాతంత్ర్యం తర్వాత బహుళ ప్రచారంలో వుండేది వచన కవిత. దాన్ని గురించి తర్వాత అధ్యాయంలో చెప్పబడుతుంది.

—: ౦ :—

5

# వచన కవిత–ఆధునిక ఛందస్సు

[1]"........ఉన్మత్త భావశాలి
ఆగి కోలేడు రేగు నూహల నాకింత
ఇంత చిఱుగీతి యెద వేగిరించునేని
పాడుకొనును తాండవ నృత్య మాడుకొనును".

[2]అస్మదీయ కంఠమున యుండాడుచుండె
నొక యెదోగీతి బయటికి నుబికి రాదు
చొచ్చుకొని లోనికిం బోదు వ్రచ్చి పోయె
నా హృదయ మీ మహా ప్రయత్నమ్ము నందు.

[3]గుండె గొంతుక లోన కొట్లాడుతాదీ
కూకుండనీదురా కూసింత సేపు.

అన్న భావాల్ని చూసి నపుడు మనకొక విషయం అర్థం అవుతుంది- 'భావశాలి వూహలు ఎదని ఒరచుకొంటూ, వేదన పడేటట్టు చేస్తూ, కూసింత సేపూ కూకుండ నీయకుండా చేస్తాయని'. ఈ విషయాన్ని కొంచెం లోతుగా పరిశీలిస్తే భావం, ఎదతో దాని అవినాభావానుబంధం కన్పడుతుంది. అదే కవిత్వానికి వూపిరి. చిఱు నవ్వడులు వినిపిస్తూన్న ఆ ఎదలోని భావాలు, ఎక్కడ్డో అవ్యక్తంగా వున్న ఆ భావాలు, వాగ్రూపం పొందడం కవిత్వంగా గుర్తించొచ్చు. ఇలాఒరపిడితో ఒరవడి దిద్దుకొంటూ వచ్చే భావాలు ఎలాంటి వాగ్రూపం పొందాలి—ఆ విషయాన్ని తెల్పే శాస్త్రాన్ని ఛందశ్శాస్త్రం అని మన పూర్వీకులు పిలిచారు.

అసలు ఛందస్సు అంటే ఏంటి? [4]"కావ్యమున ఛందము అంగాభినయ స్థానీయము. అలంకారము ఆహార్యాభినయ స్థానీయము. గుణము సాత్త్వికాభి

నయ స్థానీయము ఈ సర్వమును కావ్యతనువైన వాక్యా న్నాశ్రయించి కావ్యార్థమైన రసమును వ్యంజించును". కావ్యం లేక కవిత్వాన్ని ఆస్వాదించడంలో ప్రయోగపడే అనేకానేక గుణాల్లో ఛందం ఒకటిగా గుర్తించారు డా. పాటిబండ మాధవశర్మగారు. పాణినీయ శిక్ష ప్రకారం [5]"ఛందః పాదౌతు వేదస్య"—వేదాల పాదాలు ఛందం. [6]"ఛందము, శబ్దము సంయుక్తములయి నాట్యమును వలె కావ్యమును ఉద్ద్యోతితము గావించును" అనడం వల్ల ఛందస్సు, కావ్యపు గొప్పతనాన్ని ప్రకాశింప చేసేదని అర్థం అవుతూంది. పై విషయాల వల్ల ఛందం కవిత్వానికి మెరుగులు దిద్దేది అని తెలుస్తుంది.

ఛందం అనగానే వృత్తాలు, వాటి స్వరూప స్వభావాలు మాత్రమే గుర్తొస్తాయి. పాటిబండగారు [7]"ఛందోజ్ఞాన మనగా చంపక శార్దూలాది పద్య నామజ్ఞానముగాని, అయా పద్యముల గణ యత్యాది లక్షణ జ్ఞానము గాని కాదు". అని గుర్తించారు. [8]ఆహ్లాదార్థకమైన "చది" ధాతువు తొలి చకారమునకు "చన్దేరాదేశ్చభః" (4వ పాదము 658 సూ) అన్న ఉణాది సూత్రము చేత "ఛ" కారము వచ్చి 'ఛంద' శ్శబ్ద మేర్పడు చున్నది" అని వద్లమూడి గోపాలకృష్ణయ్య గారంటున్నారు.

> [9]చందం-స.వి.అ.పుం. కర్పూరము, చంద్రము
> వ్యు. (చది—ఆహ్లాదే—చంద (కిచ్)—అచ్
> కృ.ప్ర. ఆహ్లాద పెట్టునది.
>
> [10]చందస్ n (చందయతి అనూను)
> 1. Wish, desire, pleasure, fancy, will
> [11] చందం : s (చంద్) pleasing, spontaneous

అని ఆదునిక నిఘంటువులు చెప్తున్నాయి. [12]"చన్దః పద్యేభిలాషేచ" చందశ్శబ్దము గాయత్రి మొదలైన చందస్సుల కును, ఇచ్ఛకును పేరు. చకారము వలన వేదమునకు పేరు. చందయతీతి చందః. స. న. చది ఆహ్లాదనే. ఆహ్లాదమును జేయునది" అని అమరకోశం నిర్దేశిస్తూంది.

ఇంతవరకూ చేయబడ్డ నిర్వచనలన్నీ, దాదాపు ఏకకంఠంతో 'చందం' అంటే 'ఆహ్లాద పెట్టేది' అని చెప్తున్నాయి. దీని వల్ల 'చందం' నించి 'ఛందం' వచ్చిందనీ' చందం అంటే అలరించేదనీ, ఉణాది సూత్రం చేత మహా ప్రాణం అయిందనీ తెలిదంతో బాటు, 'ఛందం' అన్నా కూడా అలరించేదే అని తెలుస్తూంది. కనుక పై వాటి పిండితార్థం 'ఛందస్సు' అంటే మనస్సుకి ఆహ్లాదం కల్గించేదనీ, మనస్సుని అలరించేదనీ నిర్ణయించడానికి వీలవుతుంది. ఈ విషయాన్ని గురించి చెప్తూ [13]"ఛందాంసి ఛాదనాత్"—ఇది యాస్కుని నిర్వచనము. అనగా భావాలకు ఛందస్సు తొడుగు వంటిదని అర్థం. "చద్" అను ధాతువుతో సంబంధము గలదిగా యాస్కుడు నిర్వచించెను. కాని సంతసిల్లు, సంతసింప జేయు అను నర్థము గల 'చంద్' ధాతువుతో సంబంధము గలదిగా ఛందశ్శబ్దము నిర్వచనీయమని నా యభిప్రాయము," అని జి. వి. సీతాపతి అంటారు. [14]"చంద్' నించి వచ్చింది గాన అలరించేదనీ ఛంద్ నించి కూడా వచ్చింది కనుక ఆహ్లాదం కల్గించేదనీ" విశ్వనాథ సత్యనారాయణ గారు అన్నారు. అయితే 'ఛంద్' అన్నా కూడా 'అలరింపు, సంతసింప జేయు' అన్న అర్థాలు వున్నాయి. కాబట్టి ఛందస్సు అంటే కవిత్వాన్ని ఆస్వాదించడంలో, మనస్సుకి ఆహ్లాదం కల్గించడంలో తోడ్పడేది అని అర్థం చేసుకోవచ్చు. అది సంస్కృత వృత్తాల్లో వున్నా, దేశీయ ఛందస్సుల్లో వున్నా, ఆధునిక గేయ, వచనకవితల్లో వున్నా అలరించే గుణం వుంటే అది ఛందస్సంబంధి గా గుర్తించొచ్చు[15].

[16]ఏ భాషలో అయినా అది గ్రంథస్థమైన సాహిత్యం కల్గివుంటే పాటలు లేక గేయాలు ముందుగా వుండినట్టు చెప్పగలం. తెలుగులో అందుకి [17]పాల్కురికి సోమన వుపయోగించిన పదాలే సాక్ష్యం చెప్తున్నాయి. దానికి కొంచెం అటూ ఇటూగా పద్య కవిత్వం సాహిత్యంలో పాదులు వేసుకొని వుండొచ్చు. [18]మన పూర్వీకుల పాటలు, జానపద గేయాలుగా ప్రసిద్ధిని పొందిన నాటి పాటల్ని చూస్తే పైకి ఎలాంటి కట్టుబాటుల్కి లొంగినట్టు కన్పడదు, లిఖిత సాహిత్యంలో వున్న కట్టుబాటుతో పోల్చితే. అయినా అలరించే గుణం వుంటుంది. ప్రకృతిని చూసినంతనే తనువు పుల్కరించి, ప్రేయసిని గాంచి నంతనే రోమాంచం పొడమి కూని రాగం ఆలాపించి, కవ్వించి

ఝుమ్మంటూ రాగం ఆలాపించి వుంటాడు నాటి మానవుడు, మన పూర్వీకుడు కష్టం కల్గినంతనే, ఉపశమనానికి దారి వెతుక్కొని వుంటాడు, నాటి కష్టజీవి, సంఘజీవి. శరీర కష్టంలో కల్గిన ఆయాసాన్ని పాటల రూపంలో తీర్చుకొని వుంటాడు ఆ శ్రామిక జీవి. అలాంటి అనుభూతినే పొందిన సహృదయులు, దాన్నే ప్యారడీ (parody) గా తీసుకొని వుంటారు. మన పాత పాటలన్నీ, జానపదుల వ్యవహారంలో వున్న పాటలన్నీ, అలాంటివే. కాలం జరిగే కొద్దీ అనుభూతి వాతావరణం మారేకొద్దీ అది ఎన్నో గతుల్ని తనవిగా చేసుకొంది, రుచుల్ని కల్పుకొంది.

ఇప్పటి వరకు సాగిన పరిశీలనల వల్ల ఛందస్సు అంటే అలరించేదని తెలుస్తూంది. ఈ విషయంలో వృత్తాలు, జాత్యుపజాతుల పాత్ర ఎంత? వృత్తాల్లో అక్షర గణాలు నియతంగా వుంటాయి. ఆ నియతి నాల్గు పాదాలకీ వర్తిస్తుంది. దాని వల్ల పద్యం అంతా సమానమైన నడకలో సాగుతూంది. ఈ నడకనే 'తూగు' లేక 'లయ' అని పిలుస్తాం. వృత్తంలో ప్రతి గణం నిర్ణీత స్థలంలో వస్తూంది. అందుకని 'లయ' బద్ధంగా నడుస్తుంది. అయితే చాలా చోట్ల గణాలు విరిగే దానికీ, విరిగిన చోట భావానికీ సంబంధం వుండదు. [19] సంపత్కుమారగారు అన్నట్టు సరూపాక్షర యతి వుంటుందే కాని, విరామ యతి వుండదు. అందువల్ల వృత్తానికి సంబంధించిన యతి ఏదో అక్షరంలో వుంటుందేగాని, అక్కడ పదం ప్రారంభం కాదు.

ఉదా : [20]వారలు శాంత శూరులు, భవచ్చరణంబులు గొల్వఁబూని యు
న్నారటు గాక మీకది మనంబున కప్రియమేని నింతకుం
బోరికి వచ్చుచుండెదరు :భూవర రెండు తెలుంగు లందు నీ
కారయ పథ్యమేది యగు, నవ్విధ మేర్పడ నిశ్చయింపుమీ.

ఇది ఉత్పలమాల వృత్తం. యతి 'పదో అక్షరం. పదో అక్షరంతో ప్రారంభం అయే పదం మూడో పాదంలోని 'భూవర'. చివరి పాదంలోనిది 'న(వ్వి)ధ. మొదటి రెండు పాదాల్లో యతి పదంలోని అక్షరంతో సంవదిస్తుంది దాని, విరుపు కల్గి వుండడం లేదు. అంటే మొదటి రెండు పాదాల్లో సరూపాక్షర యతి, చివరి పాదాల్లో విరామ యతి పాటింపబడింది అన్నమాట. అయితే

ప్రాచీన సాహిత్యంలో పూర్తిగా విరామ యతి పాటింపబడ్డ పద్యాలు లేక పోలేదు. నాచన సోముని ఈ పద్యం పూర్తిగా విరామయతిని అనుసరించింది.

ఉదా : [21]నీవును వాసుదేవుడవు; నిక్కము నేనును వాసుదేవుడన్
బో విను వారికైన నిది వోలునె; యింతటి నుండి ధాత్రిలో
గోవుల గాచి గాడిదల గొడ్డుల బోతుల బంపిరేని నే
జీవుల వాసుదేవుడన జెల్లునె; లావున బేరు సెల్లునే?

ఇలా విరామయతిని పాటించడమే గాకుండా, పాదం పాదం కూడా అర్థవంత మైన నిలుపుదల (pause) కల్గి వుండడం కొందరి కవుల పద్యాల్లో కనిపి స్తుంది.

ఉదా : [22]పువ్వులు ముండ్లుగా మధుర మోహన కౌముది నిప్పు మంటగా
నవ్వులు వాడి యమ్ములుగ నా కనిపించును నీవు లేనిచో
గవ్వలు మేలి రవ్వలుగ, కాననముల్ నవనందనాలుగా
గువ్వలు రాజహంసలుగ గోచరమౌ గద నీవు గల్గుచో.

ఈ పద్యంలో యతే గాకుండ, పాదాంతం కూడా భావంతో ముగియడం కన్పడుతూంది. మూడు పద్యాల్లో గణాలు సమానంగానే వున్నప్పటికి ఒక దానిమీద మరొకటి ప్రయోగంగా కనబడుతూంది. అంటే సరూపాక్షర యతి నించి విరామ యతీ, విరామయతితో బాటు పాదాంతం కూడా భావంతో ముగి యడం. మరీ చెప్పితే వస్తువు (Content) రచన (Form) విడివిడిగా వుండడం నించీ, రెండూ ఒకటిగా, అభేదంతో రావడం తెలుగు పద్యాల్లో కల్గిన మార్పుగా గుర్తించేందుకి వీలు కల్గుతూంది[23].

అయితే ఈ మార్పు సర్వసాధారణం కాదు. ఆ మార్పుకోసం, అంటే వస్తువుకి రచనకి అభేదం కల్గించడం కోసం గురజాడ ముత్యాలసరము- మ్మాత్రా చందస్సుని ప్రవేశపెట్టారు.

ముత్యాల సరము లక్షణాన్ని గురించి పలువురు పలు అభిప్రాయాల్ని చెప్పారు. కవే సొంతంగా [24]"ఒక జాతి పొల్పొగజులు యొక్క పదక ముత్యాల సరములలో తెచ్చుటకు నే యత్నించియుంటిని" అని రాసుకొన్నారు.

దాన్ని కాదని అది కన్నడంలోని భామినీ షట్పదికి సమానం అన్నారు విమర్శకులు[25]. భామినీ షట్పది లక్షణం 'కన్నడకైపిడి' అన్న కన్నడ లక్షణ గ్రంథంలో ఇలా వుంది. [26]మూరు మాత్రెయ గణదముందె నాల్కు మాత్రెయ గణవు బరున హోగె ఈ గణగళు ఒందెరడు, నాల్కయ్దనెయ పాద గళల్లి ఎరడెరడూ, మూరారనెయ పాదగళల్లి మూరు మూరూ ఒందు గురువూ ఇరువుదు బామినీషట్పదియెనిసుపుదు" (3+4మాత్రల గణాలు 1-2-4-5 పాదాల్లో రెండు రెండూ, 3-6 పాదాల్లో మూడు మూడూ గణాలు కల్గి చివర ఒక గురువు కలది భామినీ షట్పది). దీనికి వుదాహరణంగా 'కుమారవ్యాస బారతం' నించి ఒక పద్యాన్ని వుదాహరించారు కన్నడ విశ్వ కోశంలో. అది—

> [27] వీర నారాయణనె కవి లిపి
> కార కురవ వ్యాస కేళన
> సూరి గళు సనకాది గళు జంగమ జనార్దనరు

చివరి అక్షరం హ్రస్వమైనా గురువుగానే గుర్తించాలి. ఈ పద్యాన్ని, లక్షణాన్ని దృష్టిలో పెట్టుకొంటే—

3+4+3+4
3+4+3+4
3+4+3+4+3+4+2 (గురువు)

ఇది పూర్వార్ధం. మొదటి రెండు పాదాల్లాగా పద్నాలుగు మాత్రలు గల పాదంగా మూడో పాదాన్ని విభజిస్తే, 3+4+2=9 మాత్రలు ఎక్కువగా వుంటాయి. వాటిని నాల్గో పాదంగా స్వీకరిస్తే 'ముత్యాలసరం' లక్షణానికి దగ్గరవుతుంది. ఇలా పద్నాలుగు మాత్రలు కల్గిన [28]'వక్త్రం' అన్న ఛందస్సు మలయాళంలో వుంది. అది 7+7 గా విరుగుతుంది. అంటే కన్నడం, తెలుగుల్లో లాగ 3+4+3+4 విభజన గాక 7+7 విభజన ఒక్కొక్క పాదంలో వుంటుంది.

మత్తకోకిలా వృత్తం నించి కూడ ముత్యాలసరం ఆవిర్భవించేందుకు హేతువులు కనబడుతున్నాయి. మత్తకోకిల వృత్తం 'రజజభర' గణాల్తో పదకొండో యక్షరం యతి గల్గి వుంటుంది.

ఉదా :— మత్తకోకిల మత్తకోకిల మత్తకోకిల కోకిలా

ఈ పాదాన్ని మత్తకోకిలా వృత్త పాదంగా గాకుండ,తిరగ రాస్తే

మత్తకోకిల మత్తకోకిల

మత్తకోకిల కోకిలా

ఇలా రాస్తే ఇందులో స్ఫురించే నడక 'ముత్యాలసరం' నడకలాగ వుంటుంది. [29] ముత్యాలసరం 3+4+3+4 తో మూడు పాదాలు గల్గి చివరి పాదం ఏడు నించి 14 వరకూమాత్రలు కల్గి వుంటుంది. పై పాదాల్లో మొదటి పాదం 3+4+3+4, రెండో పాదం 3+4+5 మాత్రలు కల్గివుంది. అంటే ముత్యాలసరం లోని మూడు, నాల్గు పాదాలుగా గుర్తించొచ్చు అన్నమాట.

ముద్రణా సౌకర్యం కల్గిన తర్వాత పాటలు, పద్యాలు [30] అనడం, పాడడం పోయి అచ్చులో ప్రతి ఒకడూ తనకు తానే చదువుకొనేందుకు వీల యింది. అంటే పురాణ శ్రవణం నించి పుస్తక పఠనం అయింది. పాట పాడే టపుడు గాయకుడు విన్పిస్తున్న మెళుకువలు, చిత్ర విచిత్ర గతులు, స్వరమేళా దికాలు, ఉదాత్తానుదాత్త స్వరితాది భేదాలు ముద్రణలో చూపించేందుకు వీలు లేకపోయింది. అందుకనే త్యాగరాజు కీర్తనలు గానీ, మరే కీర్తనలు గానీ గాయకులు పాడేదానికి, ఆ సంగీతంతో పరిచయం లేనివాడు అచ్చులో చదువుకొనే దానికి భేదం స్పష్టంగా కనబడుతూవుంటుంది. అచ్చులో పాటలు గానీ, పద్యాలు గానీ, ముద్రించేటపుడు వాటి అన్ని భేదాల్ని గాకుండా, కొన్ని టిని మాత్రమే చూపించేందుకు వీలవుతుంది. ఉదాహరణకి సంస్కృతం లోని ప్లుతం తెలుగు అచ్చులో చూపించలేం. కాని అది అవసరం అయితే అచ్చులో లేకపోయినా, గాయకుడు ఆలాపించగలడు. అలాంటి వెసులుబాటుని కల్పిం చుకొంటే, పై రెండో పాదం పన్నెండు మాత్రలుగా వున్నప్పటికీ, పద్నాలుగు మాత్రలుగా వూహించుకోవడం అపూర్వం ఏమీ కాదు. అపుడు మత్తకోకిల

మొదటి పాదం ముత్యాలసరం రెండు పాదాల్కి సమానం అవుతుంది. అంటే అక్షర నియతమైన గణం మాత్రానియత గణాలకి సమానంగా తీసుకోవడానికి వీలవుతుంది అన్నమాట. ఇలాంటి వెసులుబాటు భాషాసాహిత్యాలకి కొత్తేమీ కాదు. జానపద గేయాల్లో చిన్న, పెద్ద పాదాలు వున్నప్పటికీ, పాడేటపుడు చిన్నపాదాన్ని సాగదీసి, పెద్దపాదాన్ని కుదించి పాడుతూ వుండడం సహృదయ విమర్శకులకి తెలియందేమీ కాదు. మత్తకోకిలలో పదకొండో అక్షరం యతి. అది ప్రస్తుత విభజన ప్రకారం ముత్యాలసరంలోని రెండోపాదం, మొదటి అక్షరం అవుతుంది. అంటే హల్లుయతి (Consonant alliteration) అవుతుంది. కనుక 'యతి' విషయంలో కూడా మత్తకోకిల వృత్తం "ముత్యాల సరం" కి దగ్గరయింది.

ఇలా ముత్యాలసరానికి దగ్గరగా వున్న అనేకమైన వాటిని విమర్శకులు గుర్తించారు. [31]డా. నారాయణరెడ్డిగారు "ముత్యాల సరములో నాలుగు చరణములుండును. మొదటి మూడు చరణములో 3+4+3+4 = 14 మాత్రల్లుండును. నాలుగవ చరణములో 7 మొదలు 14 వరకుండును". అన్నారు. ఇపుడు గురజాడ చేసుకొన్న నియమాన్ని చూద్దాం. [32]"ముత్యాల సరములో నే చేసుకున్న నియమమిది. మొదటి మూడు చరణములలోను సామాన్యముగా పదునాలుగేసి మాత్రలుండును. నాలుగవ చరణమున యేడు మొదలు పదునాలుగు వరకూ ఉండును' ఈ విషయం ప్రకారం 3+4+3+4 అన్న లక్షణానికి ఆస్కారం లేదు. పాదం అంతా కలిపితే 14 మాత్రలు వుండాలి. అంతేగాని మరే నిబద్ధత (Commitiment) వున్నట్టు కానరాదు. దీనికి వుదాహరణం

[33]"గుత్తునా ముత్యాల సరములు
కూర్చుకొని తేటైన మాటల
కొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెరుంగులు జిమ్మగా"

ఈ గేయంలో 5+5+4 = 14
5+5+4 = 14

$3+4+3+4 = 14$

$7+5$ 12 మాత్రలున్నాయి.

గురజాడ నియమానికి తగ్గట్టు మొదటి మూడు పాదాల్లోను పద్నాలుగేసి మాత్రలున్నాయి. చివరి పాదంలో పన్నెండు మాత్రలున్నాయి. మూడోపాదం 3+4+3+4 అని విడుగుతూంది. కొన్ని కొన్ని పాదాలు, మరి ఎక్కువగా ఈ విభజనకి సరిపోతున్నాయి,

[33]తూర్పు బలబల తెల్లవారెను
తోకచుక్కయు వేగుచుక్కయు
వెలుగు నీటను గ్రుంకె చుక్కలు
చదల చీకటి కదల బారెను
మేలు కొలుపులు కోడి కూసెను
విపులు కన్నులు విచ్చి చూసెను
నన్నుగానక మిన్ను గానక
కురులు నరులున కుతురు జేయుచు
చన్న కాలపు చిన్న బుద్ధులు
బెదరి యెంచిరి కీడుగా

ఇలా ఎక్కడికక్కడ భేదం అర్థానికి తగ్గట్టు విడిపోతుంది. కనుక లాక్షణికులు ముత్యాలసరానికి 3+4+3+4 మూడు పాదాల్లోను, చివరి పాదంలో కొంత వెసులుబాటును కల్పించి చెప్పారు. దాంతో బాటు

[34]"గుమ్మడేడే గోపి తల్లి
గుమ్మడేడే ముద్దుగుమ్మా
గుమ్మడేడే కన్నతల్లీ
గుమ్మడేడమ్మా" అన్న జానపద ఛందస్సుని సమానమైందిగా గుర్తించడంతో బాటు [35]వెల్చేరు నారాయణరావు గురజాడని ఆధు సాహిత్యానికి ప్రతినిధిగా గుర్తించడానికి వీలయింది—"గురజాడ కవిత్వంలో రూపం అధు సంప్రదాయానిది; భావం ఆధునిక కవిత్వానిదీ" అంటూ.

వృత్తాది ఛందస్సులో వున్న గణనియతిని వదలుకోవడం కోసం గుర జాడ మాత్రాఛందస్సుల్ని వాడుకొన్నారు. అంటే రసజజభర లాంటి గణాల క్రమాన్ని వదలుకొన్నారు. అలా వదలు కొన్న కవి మళ్ళా మాత్రా నియ మాన్ని తగిలించుకొంటాడా? అని ఆలోచించాల్సివుంది. గురజాడ 'ముత్యాల సరము' గేయంలో చొప్పింపదలచు కొంది—పాదం నిర్ణీత మాత్రల్తో బాటు భావంతో ముగియడం. దీనివల్ల ఒకటి వృత్తాల్లోని గణాన్ని విడనాడడం, రెండు భావంతో పాదాన్ని పూర్తిచేయడం గురజాడ సాధించిన నవ్య ప్రయో గాలుగా గుర్తించొచ్చు. పాద విభజన వచనం నించి పద్యాన్ని వేరుచేసే బాహిరగుణాల్లో ఒకటి. కనుక పాద విభజనకి అవసరం అయింది. ఇలాంటి స్వేచ్ఛా రూపాలు, ఇటు జానపద ఛందస్సుల్లో అటు సోదర భాష అయిన కన్నడంలో, తనకు పరిచయం అయిన గజలు లో కనబడింది. తన భావానికి ఒక దరి దొరికింది. పద్నాలుగు మాత్రలు పాదానికి పరిమితం అయ్యాయి. నాల్గో పాదంలో తిరిగీ లక్షణానికి ఇమడని రూపాలకి తావు కల్పించారు. అందువల్ల 'తొమ్మి నించి పద్నాలుగు వరకు మాత్రలుండొచ్చు' అన్న వెసులుబాటుకి ఆస్కారం కల్గింది.

గురజాడ సాధించిన 'భావంతో పాదం ముగియడం' నవ్యతగా చెప్పు కొన్నా, దానికి భిన్నమైన వుదాహరణలు కూడా అతని కవితలో కన్పడు తున్నాయి.

[36]తెలుగు కిరవని కేతల పన్నుచు
దిగులు జెందుటదేటి కార్యము?
తలతు నేనిది సంఘసంస్కర
ణ ప్రయాణ పతాక గాన్. పుట : 59

ఆకులందున అణగి మణగీ
కవిత కోవిల పలకవలెనోయ్
పలుకులను విని దేశమందభి
మానములు మొలకెత్తవలె నోయి. పుట : 65

అనియె సరపతి యటుల కాని
మృవని కొంచము విపుల మందురు,
తనువుదాచను తగిన చోటులు
కలవు యెటు జనిసన్. పుట : 70

ఏదీ శృంఖలం కాకూడదనే వూహతోనే ఇలాంటి వుదాహరణాల్ని కల్పించి వుండొచ్చు. లేక మార్గసాహిత్య ప్రభావం అతనికి తెలీకుండా అతనిపై రాజ్యం చేసి వుండొచ్చు.

తర్వాతి కాలంలో ముత్యాలసరం చాలామంది కవుల్ని ఆకట్టుకొంది. ప్రతి ఒక్కరూ పద్నాలుగు మాత్రలతోనే మొదటి మూడుపాదాలు రాసినా, చివరి పాదంలో వుండొచ్చు అన్న ఏడునించి పై మాత్రలకి వుదాహరణలు కల్పించారు.

[37] ఎదద చుమ్మలు చుట్టగా దుః
ఖించ కమ్మా కొడుకునై మీ
కిట్టి రాయిడి పెట్టినందుల
కెంతయో లజ్జింతు నమ్మా!

నారాయణరెడ్డిగారి ఈ గేయంలో చివరి పాదం పద్నాలుగు మాత్రలు కల్గి వుంది. ఈ గేయం అచ్చం వృత్తాల్లోలాగా, విరామ యతి—పాదం భావంతో ముగియడం అన్న లక్షణాన్ని విరనాడిన రీతికి వుదాహరణ ప్రాయం. గేయం ముత్యాల సరం. గురజాడ సాధించిన పాద విరామం ఇక్కడ లేదు. అందు కనే [38]వెల్చేరు నారాయణరావు, 'గురజాడ ముత్యాలసరాలుకీ తర్వాతి కవులైన దువ్వూరి, దేవులపల్లి, శ్రీశ్రీ, నారాయణరెడ్డి ల ముత్యాల సరాలుకి భేదం వుంద'ని చెప్పడం.

[39] చంద్రమామను చావగొడితే
చల్లదనం రాదు
కలువ భామను కాలరాస్తే
చెలువం ఇక నిలువదు

దాశరథిగారి ఈ గేయంలో రెండోపాదం తొమ్మిది మాత్రలు, చివరి పాదం పది మాత్రలు. ఇలాంటి మార్పులన్నీ 'ముత్యాలసరము' పై తర్వాత వచ్చిన ప్రయోగాలుగానే గుర్తించాలి. దాశరథిగారే అచ్చమైన ముత్యాలసరం, 'గుమ్మడేడే' అన్న జానపద పాటకి జోడైన గేయం 'కవితాపుష్పకం' లో రాశారు.

"చీరమార్చి బొట్టు తీర్చి
చిన్నిబుగ్గన చుక్క చేర్చి —ఇలాంటివి చాలా

కొద్దిగా వుంటాయి.

ఈ పరిశీలనలో తేలిన విషయాల్ని క్రోడీకరిస్తే అక్షర గణాల నించి మాత్రాగణాలకి మారడం, సరూపాక్షరయతి నించి విరామయతి విరివిగా ప్రచారం గావడం, కేవలం బాహ్యస్వరూపానికే గాక భావానికి కూడా చందస్సు లొంగాలి అన్న భావం రావడం, తర్వాతి కవుల్లో ఆ భావం తిరిగి ప్రాచీన కవుల పక్కలోకి వెళ్ళడం కన్పడుతుంది

'పాదం భావంతో ముగియడం' అన్న విషయం అక్షర గణాల్లో రాయ బడ్డ పద్యాలలో వచ్చిన నవ్యతగా గుర్తించి, ఆధునిక గేయాల్లో బహుళ ప్రచారం పొందింది. అయితే అది తిరిగి ప్రాచీన కవుల్లాగే భావం పాదంతో బాటు ముగియకుండా మరో పాదంలో కొంత స్థానం కల్గివుంటడం లాంటి పరిస్థితి ఏర్పడింది. ఇంతకు ముందే వుదాహరించుకొన్న గురజాడ (పు. 9) నారాయణరెడ్డి (పు. 10) గార్ల వుదాహరణలు ఈ విషయంలో ప్రస్తావించుకో వచ్చు. అలా ఆధునిక గేయాల్లో కూడా బాహ్యరూపానికే పరిమితం అయిన చందస్సు, భావంతో పాటు విరగకుండా పోవడం అన్న వెర్రి కవుల్ని వేరే దారి వెతుక్కొనేటట్టు చేసింది. 'వచన కవిత' కి దారి ఏర్పడింది.

ఆధునికులు వాడుతున్నదీ, విమర్శకులు పదే పదిగా పరామర్శిస్తున్నదీ వచన కవిత. గత వెయ్యేండ్లుగా పద్యానికున్న ఘనత ఒక్క అబ్దుదు పదుల కాలం లోనే వచన కవితకి వచ్చింది. వచన కవితని గురించి పదిమంది పలురకాలుగా చెప్పుకొన్నారు. కవులు తమ భావ గాంభీర్యాన్ని, సంపూర్ణతని

పాఠకుల ముందు వుంచాలంటే వచన కవిత వినా మరేదీ లేదన్నారు. వచన కవిత కాలానికి ప్రతిబింబం అన్నాడు. [41]కొందరేమో పద్యాన్ని ఫ్యూడలిజానికీ, గేయం పెట్టుబడిదారీ సమాజానికీ, వచన కవిత శ్రామిక సమాజానికీ నిదానాలుగా స్వీకరించారు. ఏది ఎలావున్నా వచన కవిత ఆధునిక ఛందస్సు. ఇందలి ఆధునిక శబ్దం రచన రీత్యా వాడబడింది ఆధునికం వస్తురీత్యా అయినపుడు కవి తీసుకొన్న సంఘటనల్కి, వాడుకొన్న వుపమానాల్కి, అనుకొన్న భావనలకీ, చిత్రించిన పదచిత్రాలకీ సంబంధించి వుంటుంది. రచనరీత్యా అయినపుడు వస్తువుకి ప్రాధాన్యం ఇవ్వాల్సిన అవసరం వుండదు. వచన కవిత రచన రీత్యా ఆధునికం. సంప్రదాయ ఛందో రీతుల్లో కవనాలు అల్లిన [42]కాటూరి వెంకటేశ్వరరావు లాంటి వాళ్లూ, గేయ ఛందస్సులో కథా కావ్యాల్ని సైతం రాసీ పేరు గడించిన నారాయణ రెడ్డి, అనుప్రాసల చక్కిలి గింతల్లో అంత్యప్రాస సరిగమల్తో గేయ కవితా కన్యని సింగారించిన ఆరుద్రా, అటు పద్యం ఇటు గేయం రెండుచేతులా నడిపించి, సవ్యసాచి అనిపించుకొన్న దాశరథి, వజ్రాయుధాన్ని తుప్పు వదిలించి వదిలిన సోమసుందర్, పూర్వాశ్రమంలో [43]కమ్మిసెట్టి వేంకటేశ్వర రావు అనే మహాస్వప్న మాదిరాజు రంగారావు, వేగుంట మోహన ప్రసాద్, [44]'ఈనాడు తెలుగు దేశంలో వచ్చే కవిత్వం చెత్త' అని నిర్ధరించుకొన్న గుంటూరు శేషేంద్ర శర్మ, [45]'నీలి మేఘాలు పరుగులు తీస్తూ, నెల రాజుని ఓ ఆట ఆడిస్తున్నాయి' అనే అచ్చమైన భావకవి ఎల్లోరా, [46]షరాయి కిరాయి స్వరాలలో పాడకు అంటున్న వేణు ముద్దల, [47]వర్గాలతో యున్న నేటి సంఘం, మానవ జీవిత ప్రతిష్ఠకే శృంగ భంగం' అని సిగ్గుపడుతున్న సి. విజయలక్ష్మి, [48]'రాజుతున్న అగ్నివేదనలకు కన్నీళ్లు ఓదార్పుకావు' ఇంకేమో చేయాలంటున్న వరవరరావు, [49]'కాళిదాసు వూహకన్నా, శంకరుని వాక్కుకన్నా, బలమైన కొత్త వ్యోమగామి'.వి వాంఛించే సుప్రసన్నా. [50]'రోడ్డురోలర్‌లా సాగుతున్న, కాలం కన్నా ముందు నడువకు' అని నిందాగర్భంగ చెప్పుతున్న పేర్వారం జగన్నాథం, [51]'మనో దాస్యం వంటి ప్రణయానికి, తావనలే లేని సంపత్కుమన'ను వూహించిన సంపత్కుమార, [52]'పురోగమనంతో పురుగ్గా మారొద్దు' అంటున్న యాద గిరీ, [53]'మానవతకు గొడుగు—లెనిన్, ఆయన చుట్టూ తిరుగుతున్నది భూమి' అన్న దృఢనిశ్చయం కల్గిన ఏల్చూరి సుబ్రహ్మణ్యం,

[54]'కర్తా కర్మా క్రియలను
కర్మకాండయే యెరుగని
వచనం లో వైరస్యం
వండిన నూతన పాకం'

అని వచన కవితను పరోక్షంగా నిర్వచించిన గజ్జెల మల్లారెడ్డి. [55]'ప్రజా స్వామ్యం ముసుగు ఏకపక్ష నియంతృత్వం' అని ఆధునిక రాజకీయాన్ని అర్థం చేసుకొన్న నాగ భైరవ కోటేశ్వరరావూ, మరీ అనిసెట్టి సుబ్బారావు, రెంటాల, వేల్చేరు నారాయణరావూ, అరిపిరాల విశ్వం, అద్దేపల్లి రామమోహన రావూ, [56]'అమ్మ కోసి పెట్టిన జున్ను ముక్క, సలికి గడ్డకట్టిన సెందురుడ్లా వుంది' అంటూ జానపద మాటనీ, ప్రబంధ కవుల పదచిత్రాన్నీ ఒడిసి పట్టుకొన్న రంది సోమరాజూ.

[57]తమస్సు తల్లి కడుపుతో వుంది
ఇంకా సేపట్లో నీళ్ళాడ బోతుంది
తూరుపు ధర్మాసుపత్రిలో
తొలిరేకుల పక్కమీద
వెలుగు బిడ్డని కనబోతోంది' అన్న ఆశాజీవి

కె.శివారెడ్డి, వచన కవితల్లో కథాకావ్యాల్ని సైతం రాసిన శీలా వీర్రాజూ, [58] 'వర్గాలు లేని అపమార్గాలు కనరాని, స్వర్గాలు భువికొచ్చి ప్రజల కందేదాక', జ్వాల ఆరేది లేదంటూ స్పష్టం చేస్తున్న ఏటుకూరి ప్రసాదూ, [59]'కనుల ముందు తటిల్లతలా, మెరసిన ఆశాజ్యోతి' కనబడగానే కొత్తజీవితానికి నవోత్సాహన ఆహ్వానం అందచేసే ఉమాకాంత్, [60]'ఋషిలాంటి కవి మనస్సులో కవిత ఉబుకుతున్న చోట, కలలకు రెక్కలు మొలుస్తున్న చోట' రేపటి సూర్యుడు ఉదయించడాన్ని కలలు గంటున్న కేశవరావ్, ఇంకా ఎమ్వీయల్, ఇస్మాయిల్, జానపదగేయాల్ని అర్థం చేసుకొని జానపద బాణీల్లో కవితల్ని రాసిన శివుడు, సుబ్బారావుపాణిగ్రాహి లాంటి కవుల్తో పాటు [61]'అభ్యుదయ భావన ప్రజల మనస్సులలో స్థిరపడి పోయిన తర్వాత దానిని ప్రకటించడానికి తగిన రీతికోసం జరిగిన అన్వేషణలో వచన కవితా రూపం మనకు దొరికింది'

అనీ, దానికి ఒక వేదికను (**Free verse Front**) స్థాపించి, వచన కవితా ప్రస్థాన అచార్యుడుగా కీర్తింపబడుతున్న కుందుర్తి, తెలుగు దేశాన్ని తమ కవితా బల్లేల్తో పొడిచిన దిగంబరకవులూ, కవితని బుల్లెట్‌గా వదిలిన విప్లవ కవుల్లో చాలామంది వచన కవితని చేపట్టారు వీళ్లు గాక ఇపుడిపుడే కలం పట్టిన చాలామందిని ఆకర్షిస్తూంది వచన కవిత. నేటి కవిత ఆధునిక కవిత, భావకవిత, అభ్యుదయ కవిత, సాంప్రదాయ కవిత, అంతర్చైతన్య ప్రధాన కవిత, సంఘ దుస్థితికి పిచ్చెత్తి రోదించే కవిత — ఈ కవిత అంతా వస్తువుకి సంబంధించింది. ఒక్కో కవి ఒక్కో వస్తువుని ఎన్నుకొంటుంటాడు. అది తన కిష్టం. ఒకే గొడుగు కింద వున్న కవులంతా కూడా భిన్న భిన్న వస్తువులని తీసుకొంటున్నారు. అయితే ఆ వస్తువుని ప్రదర్శించాల్సిన విధం వచ్చేటప్పటికి అధిక శాతం వచన కవితని ఆశ్రయిస్తున్నారు. అందుకే వచన కవిత ఆధునిక రచనా వాహిక అయింది.

ఇదీ స్వాతంత్ర్యానంతర పరిస్థితి.

దాశరథి

62 'విద్యుత్తులా ప్రవహించగల మనకు
మద్యంలో పారే పాత ఛందస్సులో
పద్యం రచించడం పడదు. అందుకే ఇలా రాస్తున్నాం
ఇది విద్యుత్ ఛందస్సని అందరికీ తెలిసిందే'

అని వచన కవితని' 'విద్యుత్ చందస్సు'గా గుర్తించారు. ఈ వచన కవిత ఇరవయ్యో శతాబ్ది రెండో దశాబ్దం నించే అక్కడా ఇక్కడా పరామర్శిస్తూ, దోబూచులాడుతూ వున్నా, ఒక్కుమ్మడిగా, పదుగురి మన్ననల్తో ఎదలని హత్తించు కొంటూ కవితారంగంలో కాలు నిలదొక్కుకొంది అయిదో దశాబ్దం తర్వాతనే.

స్థూలంగా 'వచనకవిత' అంటే నియమితమైన లక్షణాలు లేంది అని అర్థం. అంతేగాని లక్షణాలు లేంది అనిగాదు. పద్యాల్లో, గేయాల్లో వున్న పాద నియమం దగ్గరినించీ, పదచిత్రం, ప్రాస నియమం, యతిమైత్రి

గూర్చడం, జాతీయాల్ని గుప్పించడం, నుడికారాల్ని హత్తించడం, అక్షర రమ్యతని పాటించడం, నానార్థాల్ని పర్యాయపదాల్ని అనుగుణంగా అమర్చడం, శ్లేషల్ని పాటించడం, ఉపమానాది సామగ్రి చేత వస్తువుని చిత్రించడం, ధ్వన్యనుకరణాల్ని ఉపయోగించి వర్ణ్యనీయ వస్తువుని కన్నులకు కట్టడం, క్రియాపదాల్ని, క్రియావిశేషణాల్ని తారుమారు చేసి విశేషణాల్ని తగ్గించి ఎక్కించి 'బరువు' ని కల్గించడం—లాంటి గుణాల్ని అనియతంగా వాడుకోవడం వచన కవిత లక్షణం. ఇవి ఒక కవికి మరో కవికి మారుతుండొచ్చు.

[63]"Free verse or verse libre is modern and unrhymed. It is free from the rigour of metre. It stands between those of prose and verse, having rhythm in between those of two,, అని సుబ్రహ్మణ్యంగారు 'లయ' ని పాటించడం వల్ల వచన కవిత వచనానికీ పద్యానికీ మధ్యన నిలబడ్డది అన్నారు. 'లయ' వచనాన్నించి కవితని వేరు చేసే అనేక లక్షణాల్లో ఒకటి అవడం నిజమే గాని, అది ఒకటే మాత్రం కాదు ఆ విషయాన్ని సుబ్రహ్మణ్యంగారు పరామర్శించినట్టు కన్పడటం లేదు.

ఈ వచన కవిత ఆంగ్ల సాహిత్యంలో బహుళ ప్రచారం పొందింది. కవులు విమర్శకులు పలుసార్లు మననం చేసుకొన్నారు. ఈ వాద వివాదాలు విశ్వకోశాలకి కూడా ఎక్కాయి. Princeton Encyclopediaలో Free verseని గురించి ఇలా చెప్పబడ్డది:

[64]"..........Verse is based not on the recurrence of stress accent in a regular, strictly measurable pattern, but rather on the irregular rhythmic cadence of the recurrence with variations of significant phrases, image patterns and the like. Free verse treats the device of rhyme with a similar freedom and irregularity......"

ఈ లక్షణాల్తో వచనకవిత ఆంగ్ల సాహిత్యంలో రూపం ఏర్పర్చుకొంది. ఆంగ్లసాహిత్యంలో అప్పటికి అభివృద్ధి చెందుతూ వుండిన ఒకరకమైన 'లయబద్ధవచనం' (rhythmical prose) స్వీకరించి, అప్పటికే వేరులు తన్ని నిలదొక్కుకొన్న బ్లాంక్ వర్స్‌లాంటి ఛందస్సుల్ని వదలి రాయడం విట్‌మన్

కవిత్వంలోని ప్రత్యేకత. జేమ్సు చక్రవర్తి 'psalms' వి'Song of Songs'ని, హిబ్రూ భాషల్లోని లయబద్ధ వచనంలో ఛందోవిహితంగా రాయడం, విట్‌మన్‌ని అతని అనుచరుల్ని ఆకర్షించింది. పందొమ్మిదో శతాబ్దంలో ఫ్రెంచి ప్రతీక వాదులు (Symbolists ) వచన కవిత్వాన్ని బాగా ప్రచారం చేశారు. విట్‌మన్ ప్రభావం బోడిలేర్ (Baudelaire) ద్వారా ప్రతీకవాదులపై బాగా పనిచేసింది. ఇక ఇరవయ్యో శతాబ్దిలో దీని ధాటికి తట్టుకొని నిలబడ్డ కవి లేడంటే అతిశయోక్తి కాదేమో. ఈ శతాబ్దంలో బాగా పేరు ప్రఖ్యాతులు సంపాదించుకొన్న కవులు అందరూ వచన కవితా విహాయసంలో వెల్గొందిన వారే.

జన్మత : అమెరికన్ అయిన ఇలియట్ (T. S. Eliot) ఆంగ్లంలో ఫ్రెంచి కవుల ప్రభావంతో గీతాలు రాశాడు. మొదట మొదట ఫ్రెంచిలోనే కలానికి మెరుగులు దిద్దుకొనేవాడు. ఇతన్ని, ఫ్రెంచి కవులు ట్రిస్టను కార్బైర్ (Triston Corbiere) జూల్సులాఫోర్గ్ (Jules Laforgue)లు ప్రభావితం చేశారు. ఇలియట్ ఫ్రెంచికవుల్ని ఎంత శితంగా పరిశీలించాడో1900—1925 ప్రాంతంలో వెలువడిన అతని గేయాల్ని చూస్తే తెలుస్తుంది. గేయాన్ని నడిపించే తీరును జూల్సులాఫోర్గ్‌నించే ఎక్కువగా ఇలియట్ నేర్చుకొన్నాడని చెప్పొచ్చు. ఆ సంగతి అతడే [65] "The form in which I began to write in 1908 or 1909 was directly drawn from the study of Laforgue together with the later Elizebethan drama........" అనిచెప్పుకోవడంలోనే తెలుస్తోంది. "Collected poems" ఇతని ఆధునిక వచన కవితా శైలికి, ఆధ్యాత్మిక జ్ఞానానికి, వ్యంగ్య వైఖరికి మొక్కవోని ప్రతీకలు 1922లో ముద్రింపబడ్డ Waste landను ఆధునిక సాహిత్యంలోని అనర్ఘ రత్నంగా కీర్తించారు ఆంగ్ల విమర్శకులు.

ఈ తరంలో టి.యస్. ఇలియట్ తో బాటు ఎజ్రాపౌండు( EzraPound) విలియమ్‌కార్లోస్ విలియమ్స్(William Carles William)(ఆడెన్)(Auden) రాబర్ట్‌ఫ్రాస్ట్(Robert Frost), ఇ.ఇ. కమింగ్స్ (E. E. Cummings) సెంట్ జాన్‌పెర్స్(st John Perse)అపోలినేర్ (Appollinaire )రిల్కే (Rilke)లు కొంతమంది వచనకవులు. ఈ కవుల్లో చాలామందిని ఎజ్రాపౌండు, హ్యూమ్

(T. E. Hulme )ల భావచిత్ర (imagism) వాద ప్రభావం గల్గి వచన కవితని రచించిన వాళ్ళుగానే గుర్తించాలి.

ఈ విధంగా ఆంగ్లసాహిత్యంలో రెండు -ప్రతీకవాదం, (Symbolim ), భావిచిత్రవాదం (imagism)—వుద్యమాల ప్రభావాల్ని ఇనుమిక్కిలిగా కల్గి, ఫ్రెంచి, జర్మను, జేమ్సుచక్రవర్తి రచనలు ఆధారంగానూ, అంగ్లంలోనే స్వభావసిద్ధంగా వున్న లయబద్ధ వచనాల అధారంగానూ, వచ్చిన వచనకవిత మూడుపువ్వులు ఆరుకాయలుగా వెల్గి విరిసింది. దాని ఖ్యాతి ఖండాంతరాలకి ప్రాకింది. తెలుగులో మూడు నాల్గు పదుల కాలంలో పై రెండు వుద్యమాల ప్రభావం కొంత వీచింది. దానికితోడు అధివాస్తవిక (Surrealism) వాదం మరికొంత ముందుకు సాగింది. ఈ నమయంలోనే అటు వుద్యమాల్ని, ఇటు వాటి ప్రభావఫలితంగా వచ్చిన వచనకవితని కొంతమందికవులు స్పృశించారు. వాళ్లలో శ్రీశ్రీ, శిష్ట్లా, ముద్దుకృష్ణ, నారాయణబాబు, పాలగుమ్మిపద్మరాజు, బుచ్చిబాబు, మల్లవరపు విశ్వేశ్వరరావు, గోరా, గణపతిశాస్త్రి, పఠాభిలు— ఇంకా కొంతమంది—కొన్ని వచనగేయాల్ని—లయగంధవచనాల్ని రాశారు. ఇది స్వాతంత్ర్యానికి పూర్వం జరిగినసంగతి.

తెలుగు సాహిత్యంలో వచనకవితకి అద్యుడెవరు? అన్నది పెద్దసమస్య గాకపోయినా సమస్యగానే పరిణమించింది. ఎవరుముందు రాశారన్నది ముఖ్యం. కాదు. ఎవరు వాహికగా అయేందుకు దారులు ఏర్పర్చారో అనేది ముఖ్యం అయినా అభిమానులు, అనుయాయుల్తోపాటు, విమర్శకులుకూడా, మొదటివచన కవి ఎవరు? అన్న విషయంలో కొంతచర్చ చేశారు.

తెలుగులో ఆదునిక కవిత్వానికి విమర్శకవాటాలు తెర్చిన డా.సి. నారాయణరెడ్డిగారు "'బారులు బారలుగ తీరిన..........భయంకర సౌదామిన్నులు'. ఇది శ్రీశ్రీ వ్రాసినమొదటి వచనగేయము.......కావున ఆ నల్గురిలో శ్రీశ్రీయే మొట్టమొదటి వచనగేయమును వ్రాసెను' అని శ్రీశ్రీకి ఆదికవి స్థానాన్ని కట్టబెట్టారు. అయితే చాలామంది అతను కాదు పొమ్మన్నారు. వాళ్ల అభిప్రాయాలు ఇవి.

శ్రీశ్రీయే స్వయంగా [67]'శిష్ట్లా ప్రభావంతో ముద్దుకృష్ణ వ్రాస్తున్న వచన గీతాలు ఎప్పటికప్పుడు ముద్దుకృష్ణ ముఖతః నేను వినేవాడిని" అని'కృత్యాద్య వస్థ'లో అన్నారు.

డా.సి.నారాయణరెడ్డిగారు శ్రీశ్రీయే అద్యుడు అన్నా— [68]'బదలికకు తాళజాలక ....దుర్వార తూరుపునించి' వంటి వచనగేయములు ఆ కాలముననే రచించి ముద్దుకృష్ణ వచనగేయరచనలో శిష్ట్లాతోబాటు తానుకూడా శ్రీశ్రీకి మార్గదర్శకుడైనాడు అన్నారు.

[69]'శ్రీపాదగోపాలకృష్ణమూర్తి 'ఈ కాలంలో శ్రీశ్రీ తన కవిత్వములో శబ్ద వైచిత్రిని బట్టి గేయ రచన సాగింపగా పావ (పాలగుమ్మి పద్మరాజు), బుచ్చిబాబు, మల్లవరపు, గోరా, గణపతిశాస్త్రిగార్లు, వచన గీతాలు లయగ్రంది వచనాలు రచించి చందో బందోబస్తులన్నీ చట్ పట్ మని తెంచారు అన్నారు.

[70]ఆరుద్ర '(శ్రీశ్రీ, పఠాభి, నారాయణబాబు) ... ....వీళ్ళు ముగ్గురే ఆనాటి అతినవ్యకవులకు ఆచార్యులు, ఆరాధ్యులు .. .......శ్రీశ్రీ ప్రచారం చేసిన మాత్రా చందస్సులూ, పఠాభి దిమ్మరించిన వచన పద్యాలూ, నారాయణబాబు కనిపెట్టిన మద్యేమార్గాలూ మాకు నచ్చాయి' అంటున్నారు.

[71]భావకవిత్వం మీద తిరుగుబాటు చేసిన నాటి యువకవుల్లో శ్రీరంగం నారాయణబాబు కూడా వున్నాడు. శ్రీశ్రీ, శిష్ట్లా, పఠాభి, మొదలయినవాళ్ళు నాటి తిరుగుబాటు కవుల్లో ప్రముఖులు...........వీళ్ల (శ్రీశ్రీయేతర తిరుగుబాటు కవులు) సాధించింది వచనకవితా ప్రక్రియ ఒక్కటే' అంటూ త్రిపురనేని మధుసూదనరావుగారు అన్నారు.

[72]యం. రామకృష్ణారావు; '1934లో శ్రీశ్రీ ఒక బాణంతో రెండు పిట్టల్ని కొట్టినట్లు ప్రయోగపరంగా రూపంలో, సంవిధానంలో మాత్రా ఛందస్సుల్నీ, వస్తుపరంగా భావపరంగా, మానవజాతి పురోగతిని గ్రహించి గొప్పమార్పుని తీసుకొచ్చారు' అన్నారు.

ఇలా ఇంతమంది వచనకవితకి ఆద్యుడు కాదు అని తరంగా అనటమే కాకుండా, వచన కవితని ఆదరించిన వాడు కూడా కాదు

అన్నారు. నూతలపాటి గంగాధరం అన్న [73]'...........అంత వరకే శిష్ట్లా మొదలైన వాళ్ళెవరో వచనగీతం వ్రాసినా ఆంధ్రదేశం మొదట మార్పుని గుర్తించింది శ్రీశ్రీ నుంచి" అన్నది కొంత వరకే నిజం. ఎందుకంటే నిజంగా ఆ మార్పే గుర్తించి వుంటే గేయాలు, కవితారంగంలో రాజ్యాలు ఏలాల్సి వచ్చి వుండేవి కావు. వస్తుపరంగా మార్పుని తీసుకొచ్చి, పాఠకులని అథవా కవుల్ని చకచ్చకితులు కావించిన శ్రీశ్రీయే రూపపరంగా కూడా వచనకవితని తీసుక వచ్చాడనడం ఒకరకంగా శ్రీశ్రీకి ద్రోహం చెయ్యడమే.

[74]'శేటగీతల నించీ, గేయాలనించీ ముత్యాలసరాల వరకు later భావకవులు (దేవులపల్లి, వేదుల, తర్వాతి తరం) రాశారు. ఇది సరిపోక శిష్ట్లా మొదలైనవారు వచన పద్యాలకు వచ్చారు. విశ్వనాథవారు కూడా కొన్ని వచన గేయాలు రాశారు. శ్రీశ్రీ, పఠాభి ఛందస్సుల మీద వ్యామోహం కుదిరిన వారు. పఠాభి, 'ఫిడేలురాగాల డజన్' తప్ప మిగిలినవి రకరకాల ఛందస్సుల్లో రాశారు, అన్న ఆరుద్రగారి మాటల్లో కూడా శ్రీశ్రీకి వచనకవితకి సంబంధం వున్నట్టే కన్పడటం లేదు.

ఇంతవరకు సాగిన పరిశీలనలో వచనకవితకి ఆద్యుడుగా శ్రీశ్రీని కాదంటూ శిష్ట్లాను, నారాయణబాబును, ముద్దుకృష్ణను గుర్తిస్తూ వచ్చినట్టు కనబడుతుంది. ముందే అనుకొన్నట్టుగా స్వాతంత్ర్యానికి పూర్వం వున్న కవులు చాలామంది కవితోద్యమాల (-isms) ప్రభావంవల్ల చెదురు మదురుగా వచనకవితల్ని రాశారు. అంతమాత్రంచేత వాళ్ళని ఆద్యులుగా గుర్తించలేం. బురాని సుబ్రహ్మణ్యంగారు వచనకవితా ప్రాముఖ్యాన్ని ఎప్పుడో గుర్తించి [75] "'It may even be that in the succeeding decades poetry must yield out right to prose. There is however, a valiant band of pioneers in young poets of real merit like Mr. Srirangam Srinivasa Rao and Mr. Mallavarapu VisweswaraRao strugeglng to do something different but their hour has not yet struck. Meanwhile Mr. Pattabhi Rama Reddy may congratulate himself on his own peculiar significance in this context''- అనడం వల్ల శ్రీశ్రీ కన్నా కూడా ముందుగా పఠాభి ఒక నవ్యతని సాధించినట్టు అర్థం అవుతుంది. పఠాభి సాధించిన ఆ నవ్యత వచన పద్యం మాత్రమే.

భావకవిత్వం తెలుగుకవితా రంగంలో స్వైరవిహారం చేస్తున్నపుడే, దేవులపల్లి, వేదుల ప్రతిభకల్గిన కవితల్తో బాటు కొన్ని కొన్ని ప్రయోగాలు చేయడం గూడా కనబడుతుంది. అంటే భావకవిత్వం కళ, శిల్పంల నించి నగిషీల కోసం పువ్విళ్ళూరడం, అందుకని ప్రయోగాలు చేయడం. ఆ సమయంలో శిష్ట్లా, పఠాభి లాంటి కవులు కొంతమంది భావకవిత్వ ప్రభావపరిధి నించి బయట పడ్డారు. వీరికి—ముందే అనుకొన్నట్టు—పాశ్చాత్యదేశాల్లో విరివిగా ప్రచారం అవుతుండిన డాడాయిజం, సర్రియలిజం, ఇమేజిజం, సింబాలిజం, క్యూబిజం లాంటి కవితోద్యమాలు చైతన్యాన్ని కల్గించాయి.

[76]........ 1934లో కాని ప్రగతివాద కవిత్వానికి స్పష్టమైన స్వరూపం ఏర్పడలేదు. 1931 నాటికే శిష్ట్లా రచనలతోనే ప్రయోగవాద కవిత్వ రీతికి అంకురార్పణ జరిగింది. ఈనాడు అధికంగా విస్తృతి పొందిన వచన పద్యరీతి ప్రాథమికంగా ఇక్కడే నిష్పన్నమయింది. ఈ రీతికి ఈ పేరు పెట్టినకవి పఠాభి. తన' ఫిడేలు రాగాల డజన్' లో,

'నా యీ వచన పద్యాలనే దుడ్డు కర్రల్తో
పద్యాల నడుముల్ విరగదంతాను' అన్నాడు.

కనుక, స్వాతంత్ర్యానికి పూర్వం వచన కవితని రాసిన కవులు అనేకులు వున్నా పూర్తిగా కావ్యం అంతా, వచన కవితలోనే రాసిన ఘనత పఠాభికే దక్కుతుంది. అతడే వచనకవితకి ఆద్యుడు కూడా అవుతాడు.

శ్రీశ్రీ ఒకసారి [77]"............తెలుగు ప్రతిభ గణబద్ధ చందస్సులో కంటె మాత్రాబద్ధ చందస్సులోనే ప్రస్ఫుటంగా ప్రకాశిస్తుంది. వాడుక భాషకి మాత్రాచందస్సులకి అవినాభావ సంబంధం వుంది........" అన్నారు. అంటే ప్రగతివాద కవిత్వానికి మూలపట్టయిన మాత్రాచందస్సు ప్రయోగవాదులు పరిచయం చేసిన వచన కవితకి చుక్కెదురు గాకపోయినా, దానికీ వచన కవితకీ చాలా దూరం అని మాత్రం అర్థం అవుతూంది. అలా శ్రీశ్రీ మాత్రా ఛందస్సులకే ప్రాముఖ్యం ఎక్కువ యిచ్చినా వచన కవిత తెలుగు కవితా రంగంలో బాగా ప్రచారానికి వచ్చేటప్పటికి తన దృక్పథాన్ని మార్చుకొన్నారు. మార్చుకొని [78]'........గ్రాంథిక భాషని విసర్జించినట్లే ఈ గేయాలను కూడా

మన కవులు ఎపుడు పరిత్యజిస్తారో? సాహిత్య పరిణామం గుర్తిస్తే ఇందుకు ఎంతోకాలం పట్టదని చెప్పవచ్చును" అన్నారు. కనుక ఆ కాలానికి శ్రీశ్రీ వచనకవితకి పోషకుడే గాని ప్రయోక్త పతాభి మాత్రమే.

'వచనకవిత'కి స్వాతంత్ర్యం తర్వాత వచ్చిన స్థానాన్ని గూర్చి పలువురు పలు అభిప్రాయాలు వెలిబుచ్చారు. వచనకవితా ప్రస్థాన ఆచార్యుడుగా కుందుర్తికి పేరువుంది. స్వాతంత్ర్యానికి పూర్వం వచనకవితలో వచ్చిన సమగ్ర 'ఫిడేలురాగాల డజన్'లాగా స్వాతంత్ర్యం తరువాత అన్ని హంగుల్తో తెలంగాణా వుద్యమాన్ని వూపిరిగా తీసుకొని వచనకవితా వాహికలో రాయబడ్డ కావ్యం 'తెలంగాణా'. రచయిత కుందుర్తి-అభ్యుదయ కవిత్వం సంపాదించిన అమూల్య సంపద 'వచనకవిత' అన్న అభిప్రాయం కలవాడు. 'యువతకు స్వాగతం' ఇస్తూ, [79]"... ....అభ్యుదయభావన ప్రజల మనస్సులలో స్థిరపడిపోయిన తర్వాత దానిని ప్రకటించడానికితగిన రీతికోసం జరిగిన అన్వేషణలో వచనకవితా రూపం మనకు దక్కింది" అంటూ 'వచనకవిత అన్ని కావ్య వస్తువులనూ ఆక్రమించుకొంది' అన్నారు. దీన్నిబట్టి వచన కవితావిర్భావం అభ్యుదయ కవితోద్యమకాలంలోనే అన్న విషయం స్థిరపడుతూంది. [80]కవితోద్యమాల ప్రభావం వల్ల రాసే కవుల్ని ప్రయోగవాద కవులుగా, మార్క్సిజం ప్రాతిపదికగా రాసే వారిని ప్రగతివాద కవులుగా విమర్శకులు విభజించారు. అయినా అభ్యుదయ కవులుగానే ఆ రెండు తెగల కవులు పిలువబడ్డారు.

డాడాయిజం, ఫ్యూచరిజం, ఇమేజిజం, సర్రియలిజం, సింబాలిజం క్యూబిజం లాంటి కవితోద్యమాల ప్రభావంవల్ల వచ్చిన ప్రక్రియ వచనకవిత. కనుక ఆ ప్రభావం తెలుగు కవులమీద కూడా పడింది అనుకొన్నాం. అందుకనే స్వాతంత్ర్యానికి పూర్వం వచనకవులమీద ఆ వుద్యమాల ప్రభావం వుంది. స్వాతంత్ర్యం వచ్చేటప్పటికి ఆ వుద్యమాల ప్రభావం వెన్నంటిందే దాని స్థానాన్ని ప్రగతివాదం కేవలం భర్తీచేసింది ప్రగతివాదం కమ్యూనిజాన్ని అనుసరించేదేకాని, కవితోద్యమాల పూసెత్తేది కాదు. అయినా అలాంటి ప్రత్యేకతలు ఆ రెంటిమధ్య వున్నట్టు తెలుగుకవులు గుర్తించలేదు. రెండురకాల వుద్యమాలూ కొత్తవేకనుక, రెంటిప్రభావాన్ని ఒకటిగానే స్వీకరించారు. స్వాతంత్ర్యం తర్వాత

కవితోద్యమాల ప్రభావం లేకపోయినా వచనకవిత మాత్రం తెలుగుకవితా రంగలో రాజ్యాం చేసింది. క్రోడీకరిస్తే, తెలుగు కవులపై, వచనకవిత విషయంలో, స్వాతంత్ర్యానికి పూర్వం కవితోద్యమాల ప్రభావం, స్వాతంత్ర్యం తర్వాత ప్రగతివాదం ప్రభావం వున్నట్లు స్పష్టం కాగలదు. వచనకవిత కవితోద్యమాల ప్రభావ ఫలితం అయినా, తెలుగులో అది ఫలించింది ప్రగతి వాద కవుల సరసననే అన్న విషయం మరవకూడదు.

స్వాతంత్ర్యానంతరం సాహిత్యాన్ని పరామర్శిస్తూ, 'సుపాణి' [81]"వచన కవిత మనోగత భావాలను సూటిగా వెలువరిస్తూ, సమాజ విమర్శకెక్కువ సాయపడే ప్రక్రియ. మోసాలతో, ద్వేషాలతో, కపటాలతో, కావేషాలతో, స్వార్థంతో, స్పర్థలతో, నిండిపోయిన వర్తమాన సమాజాన్ని చూసి సుకుమారుని హృదయం కన్నీరు కార్చే విధంగా నిప్పులు కురిసే కవి తన మనసులోని కోపాన్ని, రోషాన్ని, వున్నదున్నట్టు వ్యక్తం చేయడానికి వచనకవిత చక్కని వాహికగా పనిచేస్తుంది." అన్నారు. ఇది పాక్షికంగా మాత్రమే సత్యం—నిజాం నవాబును 'ముసలి నక్క'గా చిత్రించి, హడలెత్తించి, తెలంగాణాని కోటిరత్నాల వీణగా మల్చిన దాశరథిలో కోపం, ద్వేషం కలగలుపుకొని, నిప్పులు, కక్కుతూ వచ్చిన 'కవిత' వచనకవిత'లో' వచ్చింది కాదు కనుక.

జె. బాపురెడ్డి [82]"ఆధునిక ఆర్థిక శాస్త్ర పరిభాషల్లో చెప్పాలంటే "కవితా డిమాండు"ను బట్టి "కవితా సప్లయి" జరుగుతున్నది. ఉత్పత్తి చేసిన కవిత చెల్లుబడి కావాలంటే కవులకు (ఇతర ఉత్పత్తిదారులకు వలెనే) గత్యంతరము లేదు. వచనకవిత సులభంగా అర్థం అవుతుంది. అందుకే ప్రజలు దాన్ని ఆదరిస్తున్నారు. కవులకు ప్రజాదరణ కావాలి. పర్యవసానంగా కవులు కవితను వచన రూపంలో అందిస్తున్నారు"—అంటూ 'ఇది యుగధర్మం' అన్నారు. ఈ విషయం ఒక్కటే యథార్థం, సులభంగా అర్థం అవుతుంది అన్నమాట. 'ప్రజాదరణ కోసం వచన కవితలో రాస్తున్నారనటం విమర్శకులకు నిలిచే మాటలు కావు. శ్రీశ్రీకి ప్రజాదరణ వచ్చిందీ, [83]'నూతన జవంతో, జీవంతో పూచే కవిత్వంతో ప్రతి అంగుళమూ వ్యాపించిన అవినీతినీ, మనిషి నరనరానా

వ్యాపిస్తూన్న అనృతాన్నీ తూర్పార గట్టిన' గజ్జెల మల్లారెడ్డికి 'పేరు పడుగు
రికీ తెల్పిందీ గేయకవిత ద్వారానే అన్న విషయం జ్ఞప్తికి తెచ్చుకొంటే పై
మాటల్లోని వెల్తి కనబడుతూంది. స్వాతంత్ర్యం తర్వాత వచ్చిన కవితలో[84]
"అయోమయభావాలు, అర్థం కాని క్లిష్టతతో, అన్వయదోషాలతో, అవకతవక
సమాసాలతో కలవరపెడుతూవుంటా' యన్న విమర్శ కొత్తదేం కాదు. 1962
ప్రాంతంలోనే అయినా అదే భావాన్ని [85]శ్రీపాద గోపాలకృష్ణమూర్తి కూడా
వెలిబుచ్చారు 'విప్లవ కవితోద్యమం' వచ్చినాక కూడా ఇలాంటి భావమే కన
బడుతుంది. [86]"........ఇపుడున్న కవిత్వాన్ని అర్థం చేసుకొని ఆనందించా
లంటే కొంత వరకు మేధావిత్వం, సాంప్రదాయిక శుద్ధి అవసరం. ఇపుడు
మనప్రజలున్న స్థితిలో ఇవేమీ లేని కవిత్వాన్ని రాయగలగాలి" అన్న
మోహన్ మాటలు విచారించదగ్గవి. కనుక భాపురెడ్డిగారి 'వచన కవిత సుల
భంగా అర్థం అవుతుంది' అన్న విషయం కూడా అంత యథార్థం కాదని
తోస్తుంది.

నూతలపాటి గంగాధరం [87]"నేటి వైయక్తికమైతే నేమి, సామాజిక
మైతేనేమీ, వాటి యొక్క మనస్తత్వానికి ప్రతీక వచన పద్యం"—అంటూ
మార్పు నేటి యుగధర్మం కనుక, మార్పుని అభిలషించేవాడు ఎవడూ ఇతరుల
మన్నింపునో విమర్శనో ఎదురు చూడదంటూ వచన కవిత సాధించిన
లక్షణాల్ని గూర్చి"........గణాల గుణకారాలు, యతిప్రాసల అతికింపులూ,
అనవసరమైన సంస్కృతపద సమాస చాలనలూ మొదలైన సంప్రదాయాల్ని
వచన పద్యం పూర్తిగా త్యజించింది" అన్నారు. ఇది చాలా వరకు యథార్థం
గానే భావించొచ్చు.

నండూరి రామమోహనరావు [88]"........ప్రక్రియకు సంబంధించినంత
వరకు ఇది వచన కవితా యుగమని" అభిప్రాయపడ్డారు. అంతేగాకుండ వారే
"ప్రాచీన కవుల భావావేశం వృత్తాలలో పలికినంత అప్రయత్నంగా, అందంగా
ఆధునిక కవుల భావోద్వేగం వచన కవితగా ఉప్పొంగుతున్నది" అన్నారు.

ఒక కవితా సంకలనాన్ని గురించి [89]"కొన్ని సామాజికాలు, కొన్ని
ప్రతిభాత్మకాలు, కొన్ని వర్ణనాత్మకాలు, కొన్ని రాజకీయ వర్ణచిత్రాలు

కొన్ని స్మృతి గీతాలు, మరికొన్ని ప్రబోధ గీతికలు వైవిధ్యమున్నా అన్నీ సాంఘిక ప్రయోజన ప్రబోధాత్మకాలు"—అన్న మాదావి నారాయణ రెడ్డిగారి అభిప్రాయం స్థూలంగా నేటి వచన కవితా రచనలన్నింటిలోనూ చూడొచ్చు.

పై అభిప్రాయాల్ని, ఇంకా అలాంటి మరికొన్ని అభిప్రాయాల్ని పరిశీలించినపుడు 'వచన కవిత' 'యుగధర్మం' అన్నమాట ప్రత్యక్షంగానో, పరోక్షంగానో వినబడుతూండడం పరిపాటి అయింది. కనుక వచనకవిత ఆధునిక కవితావాహిక. అది అన్ని రకాల కవితా వస్తువులని తనలో ఇముడ్చుకొంది.

తెలుగు సాహిత్యంలో రకరకాల కవులు కనబడుతున్నారు దుందుడుకుతనం కలవారు ఒకరు. చల్లగా సాగిపోయే మనసం కలవారు వేరొకరు. ఒకరు వుద్రేకం మాత్రమే కలవాడు. వేరొకరు వుద్రేకాన్ని అణచుకొని శాంతంగా స్పష్టంగా చెప్పగలవాడు. ఇద్దరిదీ ఒకే విషయం. చెప్పేతీరులో హస్తిమశకాంతరం. ఇద్దరిదీ ఒకేబాట. నడకలో వ్యత్యాసం. ఒకరిది ప్రజ్వలించే కోపం. ఇంకొకరిది 'చురుక్కు' మనిపించే వ్యంగ్యం. ఆయినా 'వచన కవిత' ఇద్దరికీ రచనావాహిక ఆయింది.

శృంగారాన్ని వీరాన్ని సమాన స్థాయిలో వర్ణించగలవాళ్ళు, వీరం తప్ప శృంగారం మచ్చుకుకూడా వర్ణించని వాళ్ళు—అన్న భిన్న దృక్పథం గల కవులు కూడా తెలుగు కవితా రంగంలో వున్నారు. ఒకరిలో బీభత్సం తప్ప అందం కన్పడదు. విధ్వంసం తప్ప వినియోగం కనబడదు. రెండు తెగల వారి సాధ్యం (end) ఒకటే అయినా సాధనాలు (Means) భిన్నమైనవి. ఒకరు పచ్చిపచ్చిగా చెప్తే వేరొకరు దానికి కొంత అందాన్ని జోడిస్తారు. వాచ్యం ఒకరిలో పరాకాష్ఠ పొందితే వ్యంగ్యం ప్రధానమైంది ఇంకొకరిలో. అయితే ఇరుతెగలవారికీ రచనా వాహిక 'వచన కవిత' మాత్రమే.

ఇలా విభిన్న వస్తువులకీ, కవులకీ, వుపయోగపడ్డ వాహిక 'వచన కవిత'. అంతేగాకుండ ఆకలి బాధల్తో అలమటించే అలగాజనాన్నీ, దేశం కోసం, ఒక ధర్మంకోసం ప్రాణాలొడ్డిన దర్మవీరుల్ని, భావకవుల అడుగు

జాడల్లో వర్తించి రక్తికట్టించిన ప్రేమ శక్తినీ, అంతశ్చైతన్య ప్రభావంతో శాంతి కపోతాన్ని ఎగురవేయడాన్ని ఒకే కవితలో చూడగల్గినా [90]'అక్కడ 'రచనా' రూపంలో 'వచనకవిత' సాక్షాత్కరిస్తూంది. కనుకనే అది యుగ ధర్మాన్ని సంతరించుకొంది.

వచన కవితకు పర్యాయంగా స్వచ్ఛంద కవిత, స్వేఛ్ఛా కవిత ముక్త చ్ఛందం, అనిబద్ధకవిత, వచనగేయం, వచనగీతం, వచనపద్యం, దిక్—లు వున్నాయి. అన్నిటి సాధ్యం ఒక్కటే అయినా, ఒక్కో పదాన్ని నిర్వహించ దంలో భిన్నరీతులు కనబడుతున్నాయి. [91]"వచనమూ పద్యమూ అన్న రెండు ప్రక్రియలలోని విశిష్టగుణాలలో రూపొందింది కాబట్టి 'వచనపద్యం' అన్న పేరే సార్థక మయింది" ఇలా—ప్రతిపదాన్ని సమర్థించేవారు తగ్గసమర్థ నల్ని జోడించారు. ఏది ఏమయినా, వచన కవిత అన్న పదమే ఎక్కువ ప్రచారంలో వుంది. 'వచనం' 'కవిత' అని విడదీసి వచనంలో వున్న కవిత అని అనుకోవడం కన్నా వచనకవిత అన్నది పద్యం, గేయం లాంటి అక్షర గణ, మాత్రాగణ చందస్సు కన్నా భిన్నమైన వచనంలో వలె, నియమ రహితమైన ఛందస్సు అని చెప్పుకోవడం సబబు. అదీగాకుండా కాలం మారే కొద్దీ పదాలకు అర్థం మారుతుండడం కొత్తేమీ కాదు. కనుక 'వచనకవిత' అనేది కొత్తపదం. పయిని వివరించిన విధంగా కొత్తఅర్థం ఇచ్చే సమాసం అని అనుకోవచ్చు.

వచన కవితలో రాసే కవుల శాతం వలె, దాన్ని విమర్శించిన వాళ్ళూ, సూత్రాల్ని ప్రోదిచేసిన వాళ్ళూ అధికంగానే వున్నారు. వాళ్ళు సూత్రించిన కొన్ని నియమాలు ఇక్కడ పరిశీలింపబడుతున్నాయి.

మహాకవి శ్రీశ్రీ [92]"వచనగీతానికి ప్రాణప్రదమైన లక్షణం గమన వైవిధ్యం. ఇది సంభాషణలోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణా విశేషాల మీద ఆధారపడి వుంటుంది."

కుందుర్తి [93]"వచన గేయానికి మొట్టమొదటి లక్షణం నిరాడంబరత.. వచన గేయాన్ని కుంటు పడనీయకుండా ఆద్యంతం చదివేటట్లు చేయగల

సొగసు. విసురు అలవరచటం ఛందోబద్ధమైన పద్య రచన కంటె కష్టమైన పని........వచన గేయంలో........ఈ విసురు ఒక ముఖ్య లక్షణంగా ప్రతి పాదిస్తున్నారు."

కొత్తపల్లి వీరభద్రరావు [94]"వచన కవితలో ఛందస్సు లేకుండా ఒక ఊపు, ఒక తూగు చాపకింద నీరులా ఉండాలి." వచనకవితకి విసురు/'ఊపు'/తూగు గమన వైవిధ్యం వుండాలని వీళ్లు అంటున్నారు.

[95]'యతిప్రాసలు లేని లయబద్ధంకాని సంప్రదాయ ఛందోరీతికి చెందని రచన ఫ్రీవర్స్........ఫ్రీవర్స్ రచనలు కొన్ని బరువూ తూగూ కలిగి అంతర్లయ ప్రధానంగానూ ఉన్నాయి. ఎక్కువగా అంతర్నాదం ప్రధానంగా వస్తున్నాయి. అంతర్లయలో లయచ్ఛాయ ఉంటుంది, అంతర్నాదంలో లయ చ్ఛాయ ఉండదు"—మాదిరాజు రంగారావు.

[96]"ఆధునిక వచన గేయ కవిత్వంలో యిటీవల ఒకానొక లయకు ప్రాధాన్యం ఏర్పడుతున్నది. తాళ్ళపాకవారి వచనాలకూ ఈనాటి ఫ్రీవర్స్ కవితా రచనలోని నడకకూ చాలా భేదం వుంది. శబ్దానికి గానీ, భావానికిగానీ ఆనాటి వచనాలలోని లయ వచనపు లయ. వచన గేయంలోని లయ కవిత్వపు లయ........వచన గేయమైనా విశృంఖల విహారం చేయరాదనీ, దాని నడక లోనూ ఒక లయ, పంక్తిలో ఒక నిర్మాణపద్ధతీ వుండాలని సారాంశం"—కుందుర్తి.

[97]" వచన గేయమునకు 'లయ' ముఖ్యము. ఈ'లయ' గణములను గూర్చుటతోనే ఉత్పన్నము కాదు. ఒకానొక ఊపుతో విసురుతో పదములను గుప్పించుట వలన ఈ లయ ఏర్పడును. ఏ నియమములు లేకుండా శుద్ధవచనమును లయాత్మకముగ మార్చినచో అది వచన గేయమగును........వచన గేయములో వైశద్యము ప్రధానగుణము కాదు. పాఠకునిలో భావోద్వేగము కలిగించు 'అంతర్లయ' దీని ప్రధాన లక్షణము. దీనిలో కేవలము అనుప్రాసాదుల వలన సంక్రమించు శబ్దలయ ఆనుషంగిక మైనది దీని కతీతమయినది సంక్రమించు శబ్దలయ యనగా వచనగేయమున పూసలలో దారమువలె నుండు అంతర్లయ"—సి. నారాయణరెడ్డి.

[98]"ఆధునిక కవిత్వపు యితివృత్తాలకు శుద్ధగేయాలకు లయబద్ధమైన కురంగ గమనం కంటె క్రమ లయలేని వచన గేయపు అలసగమనం అనుగుణంగా వుంది"—రాచమల్లు రామచంద్రారెడ్డి.

[99]"వచన పద్యాలంటే ఏదో ఒక చందస్సును పట్టుకొని వ్రేలాడడం కాదన్నమాట. అట్లా అంటే కేవలం చందస్సును విస్మరించడం గాని, జారవిడవడం గాని కాదు. భావ వ్యంజకమైన యమకాలు, గమకాలు, విరుపులు. నాట్యవిన్యాసాలు, ప్రాసలు, తప్పని సరిగా పొడచూపుత"వి—రోణంకి అప్పలస్వామి.

వచనకవితకి లయ, అంతర్లయ, భావలయ, యమకం మొదలైనవి కావాలని ఒకేసారీ, అంతగా అవసరం లేదని మరొకసారీ వీళ్ళే అంటున్నారు.

[100]'సంపత్కుమారాచార్యులు "వచనం నుంచి పద్యాన్ని విభేదింపజేసేది, దానిపాదబద్ధత. పద్యానికి సంబంధించిన ఇతరవిషయాలనేకంఎట్లావున్నా అది 'పద్యం' కావటానికి దాని పాదబద్ధత ప్రధాన లక్షణం. పాదబద్ధంగా ఉండాలన్నదే ప్రధానం తప్ప పాదసమత్వం గానీ, పాద సంఖ్యానియమంగాని కావు. అట్లాగే యతిప్రాసలు గూడా కావు," అనీ, [101]సుప్రసన్నాచార్యులు "వాక్యనిర్మాణంలో మార్పు, పాద విభజనలో ఒక తూగును లక్షించడం, ఒక భావంతోనోభావాంశంతోనో పాదాలు విభజించడం, పాదాలలో పాదాంతాలో ఒకే విధమైన పదాలనో వర్ణాలనో నిలపడం, ఒక పద్ధతిలో ఉపమానాలనో రూపకాలనోవరుసగా ప్రయోగించడం-ఇవీ వచనకవితలో ప్రయోగించే శిల్పమార్గాలలో కొన్ని" అనీ, వచన కవితకు పాదనియమం తప్పని సరిగా కావాలన్నారు. కుందుర్తి [102]"వచనకవిత నేడు ప్రధానంగా రెండు రకాలైన శైలులను ఆశ్రయించుకుని ప్రయాణం చేస్తూవున్నది. ఒకటి సమాన బాహుళ్యమూ, సంస్కృత లేక ఆంగ్ల భాషాశబ్ద ప్రదర్శనమూ, ఉక్తిలో గ్రాంథికచ్ఛాయలూ కలిగి పద్యమూ, వచన గేయమూ అనే భేదం మాత్రమే మిగుల్చుకొని పూర్వ కావ్యభాషా సంప్రదాయానికి చేరువగా నడుస్తున్న శైలి. రెండవది వ్యావహారిక భాషావాదాన్ని జీర్ణించుకొని, ప్రజల పలుకుబడిలోని మెళుకువలను సంగ్రహించుకుని, తెలుగు నుడికారములోని సొగసులను ఆవిష్కరించుకుంటూ,

వర్తమాన కాల పరిస్థితులకూ, సమకాలీన ప్రజల హృదయాలకూ దగ్గరగా నడుస్తున్న శైలి" అన్నారు.

చేకూరి రామారావు వచన కవిత్వానికి లక్షణాలుగా చెప్పబడుతూన్న విసురు/తూగు/గమన వైవిధ్యం—మొదలైనవి భాషా నిర్మాణంలోని విషయాలుగానే సూచించారు. [103]"పద్యం (Verse)లో అర్థవంతమైన శబ్దాల కూర్పు (Morphological arrangement, ) ధ్వనుల కూర్పు (Phonological arrangement ) ఉంటై. ధ్వనుల కూర్పు అక్షర పరిమాణం (Syllabic quantity) మీద ఆధారపడి ఉంటుంది," అన్న వ్యాకరణం నియమాన్ని తెల్పారు.

'లయ'స్ఫురణకు పద, - పదాంశ విరామాలు (Word juncture, Morpheme juncture ), ఊనిక (Stress) ప్రధాన పాత్ర వహిస్తాయనీ, ఇంకా పరిశీలిస్తే, ఊనికే లయకు కారణంగా నిరూపించ వచ్చనీ అన్నారు. 'ఊనికే ప్రవర్తనపద (Word) పదాంశ (Morpheme) విభాగం మీద ఆధార పడి ఉంటుంది' అన్నారు.

భాషకి సహజ సిద్ధాలైన ధ్వనుల కూర్పువల్లా, పదాంశాల కూర్పువల్లా వాటి విరామం వల్లా ఊనిక ఏర్పడుతూందనీ, ఆ ఊనికే నిర్ణీతంగా, నియతంగా ఆవృతం అవడం వల్ల 'లయ' సిద్ధిస్తుందనీ [103]రామారావు అభిప్రాయం అయినట్టు, అతని వ్యాసం వల్ల అర్థం అవుతూంది. 'లయ' పైవాటి కూర్పు వల్ల జరుగుతుంది కనుక అది భాషకి సహజ సిద్ధం. పద్యంలోనే లయ వుండాల్సిన అవసరం లేదు. వచనంలో కూడా వుండొచ్చు. ఇక అంతర్లయ, భావలయ మొదలైనవి అర్థం కాని ప్రయోగాలు.

[104]ప్రతి మాటకీ శక్తిఉంది పదును ఉంది

ప్రతి మాటకీ అర్థం ఉంది ఔచిత్యం ఉంది —తిలక్ నవత-కవిత, పు. 78

దీన్ని 'తూగు'కి అంటే ఊనిక (Stress)కి వుదాహరణంగా ఇచ్చారు సంపత్కుమార, [105]"మాత్రలను బట్టి, అక్షరాలను బట్టీ గాక అర్థాన్నీ, భావాన్నీ

బట్టి ఇక్కడ గణ విభజన చేయవలసి ఉంటుంది" అన్నారు సంపత్కుమార. అంటే 'భావగణం' అన్నమాట. రామారావు [103]"భావాలను గణాలుగా విభజించడం సాధ్యం కాదనీ, వీరు విభజించింది వ్యాకరణ రూపైకత ఉన్న పద సమూహాలు కాబట్టి వీటిని న్యాయంగా 'వ్యాకరణ గణాలు' అని అనాల్సి ఉంటుందనీ తేలుతున్నది" అని అన్నారు. సంపత్కుమార 'భావగణం'ని వద్దనుకొంటే రామారావు 'వ్యాకరణగణం' కన్నా 'అచ్సంఖ్యాసమానత్వం' ఈ కవితలో తూగుని కల్గిస్తూంది.

ప్రతి$_5$ మాటకీ శక్తి$_4$ ఉంది పదును$_5$ ఉంది
ప్రతి$_5$ మాటకీ అర్థం$_4$ ఉంది ఔచిత్యం$_5$ ఉంది

పాద నియమం అవసరం అన్న వాళ్ళు, కాదన్న వాళ్లు కూడా వున్నారు. [105]"పాదనియతి వచనం నించి పద్యాన్ని వేరు చేస్తూందనడం కేవలం భ్రమ" గానే గుర్తించారు పేర్వారం జగన్నాథం. [106]"ప్రాచీన ఛందస్సులోని తాళం లయ వంటి సంగీత ధర్మాల్ని వదల్చుకొన్నవాళ్ళు వాటిల్లోనిదే అయిన పాద విభజన రూపాన్ని పట్టుకొని ఎందుకు ప్రాకులాడుతున్నారు? పాదనియమం లేకుండా చం ప్రాసిన నవలల్లోని అనేక వేల వాక్యాలు వచన కవిత్వం అనిపించుకోవడం లేదా?" అని ప్రశ్నిస్తూ ఉన్నారు హిమభద్ర.

రామారావు [103]"నిర్దిష్టమైన పరిమితి, గణ నిర్మాణం, పద్య పాదానికి లక్షణాలు. ఈ రెండూ లేని పాదాలు పద్యపాదాలు కాలేవు. అందువల్ల పద్యానికి ప్రధానమైన పాదబద్ధత అనే లక్షణం వచన పద్యం అనే కవితా రూపానికి లేదు" అని నిర్ణయించారు. కనుక [103]"వచనపద్యం పద్యం కాదని, గద్యమేనని సిద్ధాంతం" అని వారు సిద్ధాంతీకరించారు.

వచనకవితకి వచనానికి భేదముందని కవులూ, విమర్శకులే కాదు సాహిత్యంలో ప్రవేశం వున్న ప్రతి ఒక్కడూ గుర్తించగలడు. విమర్శకులు నిర్దేశించిన లక్షణాలన్నిటినీ, భాషానిర్మాణం దృష్ట్యా, సహజమైన లక్షణాలు గానే రామారావు గుర్తించారు. కనుక ఆ లక్షణాలు పద్యానికీ, గద్యానికీ

సమమైనాయి అయితే కేవలం పాదనియమం ఊనిక, లయ, లాంటి భాషా నిర్మాణ విషయాలే గాకుండ, మరెన్నో విషయాలు కవిత్వాన్ని వచనం నుంచి వేరు చేసి చూపిస్తున్నాయి. ఆ రెంటి మధ్య భేదమే లేకపోతే కవిత, కథానిక, నవల, విమర్శలాంటి ప్రక్రియా భేదాల అవసరమే వుండి వుండేది కాదు. వచనం నుంచి కవితని వేరుచేసే గుణాలు కొన్ని ఇక్కడ పరిశీలింపబడు తున్నాయి.

'వస్తువు. భావం, రచన' అన్నవి సాహిత్యానికి మూడు అంగాలు. డా. సి. నారాయణరెడ్డి [107]"ప్రాచీన కావ్యములన్నియు కథాత్మకములే. వానిలో పురాణములు ఇతిహాసములు (భారతాదులు) వస్తుప్రధానములైనవి. ......ప్రబంధములు అల్ప వస్తుకములైనను, రచన నాశ్రయించి బ్రతికినవి. అనగా వస్తుబలమును మించిన శైలీరమ్యత, సమాస చాలన నైపుణి, వృత్త నిర్మాణ పటిష్టత, పదగుంపనచాతుర్యము ఉన్నవి. ఈ గుణములన్నియు రచనా గతములే కదా........భావ కవిత్వములో వస్తురచనలకన్న భావము నకే ప్రాధాన్యముండునని నా అభిప్రాయము .......భావ కవిత్వమనగా వస్తు భావ రచనలలో భావమునకు ప్రాధాన్యమిచ్చిన కవిత్వము"...............అని నిర్ణయించారు.

ప్రాచీన సాహిత్యంలో కావ్యాలన్నీ కథని ఆశ్రయించి వుండేటివే. [108]"ఇతివృత్తంతు కావ్యస్య శరీరమ్" అన్నదాకా వచ్చివుండడం తెల్సిందే. 'ఇతివృత్తం' కథకి పర్యాయపదం అయింది. దాన్నే మనం వస్తువుగా చిత్రించు కొంటున్నాము. అయితే వస్తువుని ఆంగ్లములోని Contentకి పర్యాయపదంగా వాడుతున్నారు. అపుడు వస్తువు అంటే కేవలం కథాత్మకమే గాక, theme కల్గి వుండేదని కూడా అర్థం అవుతూంది. ఈ విషయంలో నారాయణరెడ్డి కూడా ఏకీభవిస్తున్నారు. ఎందుకంటే అమరుక శ్లోకాలు, గాథాసప్తశతి శ్లోకాలు తెలుగు శతకాలని కూడా వస్తువు కిందికే వస్తాయి అన్నారు కనుక. 'భావం' ఎపుడూ వస్తువు (content)ని ఆశ్రయించే వుంటుంది. విప్లవ భావాలు కల్గిన వస్తువులో ప్రబంధ ధోరణిలోనో మరే ధోరణిలోనో సాగిన భావాల్ని చొప్పించ లేం. [109]భావం ఎప్పుడూ వస్తువునే ఆశ్రయించుకొని వుంటుంది. 'రచన'

అన్నది వారన్నట్టు శైలీరమ్యత,సమాసచాలన నైపుణి-ఇంకా అలాంటి గుణాలు కలది. ఈ గుణాలు కవిత్వానికీ అవి ఎలాంటి వస్తువుని కల్గివున్నా, భావాలని చిత్రించినా—అవసరం. అంటే వస్తువు, భావాలు కవి అంతర్మథనానికి సంబంధించినవి. 'రచన' ఆ అంతర్మథనానికి రూపం (form) కల్గించేది అని అర్థం చేసుకోగలం. కవిని పాఠకుణ్ణి కలిపే కేంద్రం 'రచన'. కవి వస్తువుని తీసుకొన్నంత మాత్రాన చాలదు. భావవిహాయసంలో విహరించినంత మాత్రాన సరిపోదు. అవి పాఠకునికి తెలియాలి. ఆ విషయాన్ని తెల్పే అంగం "రచన" వారిద్దరికి (link) సంధాయకం.

రచన సంధాయకం అనుకొన్నాక దాని పాత్రని గూర్చి తెలుసుకొందాం. వస్తువు, భావం అంగాలకి వచనం, కవిత్వం అన్న భేదంరాదు. అందుకే గద్యంలో రాయబడ్డ 'కాదంబరి'ని గొప్పకావ్యంగా కీర్తిస్తూండడం. వచనం నించి కవిత్వాన్ని విడదీసి చూపేది 'రచన'.

ఒక్కోకవి ఒక్కోరకమైన రచనా విన్యాసాన్ని కల్గి వుంటాడు. అది అతని ముద్రని కల్గివుంటుంది. తనదైన వ్యక్తిత్వాన్ని బహుభంగిమల్లో చూపిస్తాడు కవి. కొన్ని రచనా విన్యాసాలు ఆ భాషకే స్వతస్సిద్ధంగా వుంటాయి. మొదటిది వైయక్తికం. రెండోది సార్వజనీనం. సార్వజనీనం మామూలుగా పాతబడ్డబాటనుంచి పదుగురికి తెల్సిన జాడ నించి వస్తుంది. ఒకానొక కవి వాడిన ఛందస్సు, ఒక భావచిత్రం, నుడికారం వ్యాకరణ విశేషం, సృష్టించిన కొత్తపదం, పదబంధం తనకే పరిమితమై, సాహిత్యంలో ఇంకెక్కడా అప్పటికి తలచూపకుండా వుండి వుంటే దాన్ని అతని వైయక్తిక లక్షణంగా గుర్తించొచ్చు. ఆ కవి వాడిన'అది' తరువాతి కవులు వుపయోగించుకొంటేఅది సార్వజనీనం అవుతుంది. ఇదిఒకరకంగానారాయణరెడ్డి చెప్పిన 110 సంప్రదాయం ప్రయోగం లాంటిది. ఒకనాటి ప్రయోగం చేవకల్గిందయితేమరోనాటికి సంప్రదాయం అవుతుంది. లేకపోతే పత్తా లేకుండా పోతుంది. కవికవితా సంపన్నుడయితేప్రయోగంచేస్తాడు. అలాగే వైయక్తికాలుసార్వజనీనలవుతాయి. సార్వజనీనలైన లక్షణాలు పాతబడితే వైయక్తిక లక్షణాలకి అస్కారం కల్గుతుంది. ప్రబంధాల్లోని అష్టాదశవర్ణనలు, ఊహాచిత్రాలు మొదట వైయక్తికాలు.

పిల్లమసుచరిత్రలు, వసుచరిత్రలు, పింపిగా వచ్చేటప్పటికి పార్వ్రబసీనా లయ్యాయి. అవి ప్రస్తుత సమయానికి కనుమరుగయి పోయాయి.

కనుక 'రచన' కవితకు ముఖ్యం, అని అనుకొన్నాక అది కవితలో ఎలావుంటుందో పరామర్శించడం ప్రధానం.

'రచన' కవిత్వంలోని ప్రతిభాగంలోనూ వుంటుంది. ప్రతి కవళిక లోనూ, భావతరంగంలోనూ వుంటుంది. ప్రతి ధ్వనిలోనూ, పదంలోనూ, వుంటుంది. కనుక ధ్వనులనించి, పదాలనించి వాక్యాలనించి 'రచనా' విన్యాసాల్ని పరిశీలించ వీలుకల్గుతూంది [111]. ఆదికవి నన్నయ, [112]తను కవితా లక్షణాలుగా చెప్పుకొన్న 'అక్షర రమ్యత', "ప్రసన్న కథాకలితార్థ యుక్తిచే రచనా విశేషాలుగానే గుర్తించడం జరిగింది. [113]. ఇందు చెప్పబడ్డ "అక్ష రమ్యత" కవితలో వచ్చే ధ్వనులకి సంబంధించిన విశేషాలవల్ల, వుపయోగించ తీరువల్ల కలిగెడి రమ్యత్వం. ఇది ధ్వనుల్నిబట్టి వుంటుంది. యతి, ప్రాస, ప్రాసమైత్రి, అనుప్రాస, ఆదిప్రాస, అంత్యప్రాస, అభివ్యక్తీకరణ ధ్వనులు. ధ్వన్యనుకరణ ధ్వనులు, లయ—కి సంబంధించి అక్షరరమ్యతని గుర్తించ వీలు కల్గుతూంది. ప్రస్తుతం ఆధునిక వచనకవిత ఆధారంగా వీటినన్నిటినీ వివరించ వీలవుతుంది.

యతి:- ఇది తెలుగులో సంప్రదాయఛందస్సులో నియతంగా వాడబడ్డది [114] పాదాద్యక్షరమునకు యతి అని పేరు. అది అచ్చయినా కావొచ్చు. హల్లు ఆయినా కావచ్చు. రెంటికీ ఒకే పేరు. [115] "Yati is the agreement of the first and the stipulated one in the line both in consonants and vowels" అన్న అభిప్రాయాన్ని సుబ్రహ్మణ్యన్ వెలిబుచ్చారు. తెలుగులోని ఈ 'యతి' భాషా శాస్త్రకారుల ప్రకారం alliteration కి సమమైందిగా గుర్తించొచ్చు. ఇది అచ్చులు, హల్లులకు సంబంధించి వుంటుంది అని అనుకొన్నాం కనుక [116]vowel alliteration, consonant alliteration ఆ రెండు విధాలుగా చూడవచ్చు. అంటే పాదాది ధ్వని అచ్చు అయితే అచ్చుయతిగానూ, హల్లు అయితే హల్లుయతిగానూ గుర్తించొచ్చు అన్నమాట. Princeton Encyclopediaలో [117]"Any repetition of the same sound (s) or syllable in two or more words of a line (or

line group) which produces a noticeable artistic effect" అని వుంది. ధ్వనులు లేక అక్షరాలు రెండు అంతకన్న ఎక్కువ పదాల్లో పునరావృతం అవుతూ నిర్దిష్టమైన తూగుని కల్గించే విధంగా వుంటే దానిని 'యతి అంటారంటారు. ఒక ధ్వని పదిసార్లు పునరావృతం అవుతుండొచ్చు. కాని దాని వల్ల'నడక'గాని, శ్రావ్యతగాని కల్గకపోతే అది 'యతి' కాదు. ప్రాచీన ఛందస్సులో 'యతి' మొదటి అక్షరం. అదే అక్షరం నిర్ణీత స్థలంలో పునరావృతం అవడం. వచనకవితలో అలాంటి నిర్ణీత స్థలంగాని, అలాంటి యతిగాని లేవు. ఇంకా వివరిస్తే ఛందస్సులో లాగ సరూపాక్షర యతిని గాక, విరామ యతిని పాటించడం కన్పడుతుంది. విరామయతిని పాటించినా నిర్ణీత స్థలం అంటూ లేదు. పాదం మొదటలో, పదాదిలో మాత్రమే 'యతి' వస్తూంది. వీటికి 'వచన కవిత' నించి కొన్ని ఉదాహరణలు చూద్దాం.

> 118"తాన్‌సేన్ గాన ఝరి
> త్యాగరాజ కృతి లహరి
> వేదం పుట్టిన నేల
> వేదాంతం పుట్టిన నేల
> గౌతముడు పుట్టిన నేల
> గాంధీ పుట్టిన నేల

ఈ గేయంలో పాదాదిలో రెండు రెండు పాదాలకి'యతి' చెల్లుతూంది.

> 119కారుతో తప్ప కాలి బాటతో పనిలేనివారు
> ఫోనుతో తప్ప పోస్టాఫీసు జోక్యం రానివారు
> 120సంఘం బాగుకు సత్యనారాయణ వ్రతాలు
> ఖర్చులు ఖుబారాను లేపుకొచ్చి ఖజానాలో కాపురంచెయ్యొచ్చు
> నిర్బంధ నియమాల్తో నిమిత్తం లేని కవిత్వాలు.

ఈ వుదాహరణల్లో 'యతి' పాదం మధ్యలో వచ్చి, వచన కవితకు 'తూగు'ని కల్గిస్తూంది 121"పాదమధ్యమున యతి చెల్లించునపుడు పాదప్రథమాక్షర

మేకో డా ట్రై ఉపయోగించుట యన్నదే అత్యంత ప్రాచీనమయిన సంప్రదాయ మని చెప్పవలయును" అని సంపత్కుమార అంటున్నారు.

## ప్రాస

'పాదము ద్వితీయాక్షరమునకు 'ప్రాస' అని పేరు. ప్రాసయందు ఒక హల్లునకే ప్రాధాన్యము. వృత్తాదుల్లో నియతంగా రెండో అక్షరం ఒకేహల్లుగా వుంటుంది. 'వచనకవిత'లో 'ప్రాస' అని ప్రత్యేకంగా లేదు, కాని అది వచ్చే స్థలాన్ని బట్టి—పాదం మొదట అయితే 'ఆదిప్రాస' గాను, చివరన అయితే 'అంత్యప్రాస' గాను గుర్తింపబడ్డది. ఆదిప్రాసగానీ, అంత్యప్రాసగానీ పాదం పాదంలో ఆవృతం అవుతూండాలి.

ఆదిప్రాసకి వుదాహరణలు :

[122] అందలంలో అబద్ధం ఊరేగుతున్నది
అందంతో అందరినీ అలరిస్తున్నది
కంపుగొడుతున్న బురదలో నిలచి
కమ్మని వలపుల పంచుతున్న పద్మంవలె.

[123] నడుస్తున్న చరిత్ర కొప్పులో ఉద్యమాల విరజాజులు
ముడుస్తుంది ప్రజావాణి,
[124] ఒరే నాన్నా
చిరునవ్వును బహిష్కరిస్తున్నావా?
ఆ పూటకు ఉప్పు పుట్టనపుడు
అప్పులవాడు తెగ తిట్టినపుడు

## అంత్యప్రాస :

[125] కాంతి పచ్చినెత్తురులా గడ్డకట్టునని తెలుసు
కాలం క్షణం కాలం స్తంభించిపోవునని తెలుసు

న్యాయాన్నే శవం లాగ విసిరేస్తారని తెలుసు
ధర్మాన్నే చితిలోపల తగలేస్తారని తెలుసు.

126 విషాదంలో కన్నీరు
ఆనందంలో పన్నీరు
తాండవ మాడితే వరదనీరు
లాస్యమాడితే పంటనీరు.

127 ఇంక చరిత్రలు వ్రాయనక్కరలేదు
ఇంక రాజ్యాలు పాలించ నక్కరలేదు
అణుబాంబు యుగాంతాన్ని నిరూపిస్తున్నది
ఆ ముహూర్తం త్వరలోనే వస్తున్నది.

128 నీవు విసరిన ఓరచూపుల బాణము
తీయనున్నది క్షణములో నా ప్రాణము
కండ్లలో మిన్నాగు లెందుకు దాత్తువే?
విషము కురిసే చూపులేలా చూతువే?

అనుప్రాస 129"Anuprasa is the repetition of the same letter or sound through out the verse or verse--lines". ఇది సంప్రదాయ వృత్త్యనుప్రాస, ఛేకానుప్రాస మొదలైన ప్రాసల్కి సమమైంది.

ప్రాసమైత్రి, యతిమైత్రి లాంటి వాటికి కూడా 'వచనకవిత'లో వుదాహరణాలు కోకొల్లలుగా దొరుకుతున్నాయి. ఇంతవరకు చెప్పినవన్నీ ఛందస్సులో వాడుకొన్నవే. వాటిని 'వచనకవిత'లో వాడుకోవడం కనబడుతూంది. ఈ లక్షణాలన్నీ ఒకరకంగా సాహిత్యంలో ఎపుడూ వుండేవే. అందుకని 'సార్వజనీనాలు' అనుకోవచ్చు.

## అభివ్యక్తీకరణ ధ్వనులు (Evocative value of sound)

కవితలో వ్యావహారిక భాషని వుపయోగించటం వల్ల కల్గిన ఫలితం శ్రీశ్రీ అన్న 130"సంభాషణలోని యాసలూ, కాకువులూ, ఉచ్చారణ" విశే

ప్లాలమీద ఆధారపడ్డవి. ఇవి లోక వ్యవహారంలో మామూలుగా ధారాపాతంగా దొర్లిపోతున్నా వాటికి కవిత్వంలో చోటు కల్పింపలేదు పూర్వీకులు. ఇది వచనకవితాకారులకి ప్రత్యేకం. అందుకని వైయక్తికం. దీనివల్ల పాదంలో 'నడక' స్ఫురిస్తుంది.

[131]చీకటి తెర తొలగును లే
ఇక నీ
వాకిట సిరి వెలుగును లే
రేపన్నది వచ్చునులే.

'లే' అన్నది 'లెమ్మ' అర్థం కలది కాదు. సంభాషణలో అనిశ్చయ పరిస్థితుల్లో వాడే ఒక ప్రత్యయం. ఈ గేయంలోని 'లే' కూడ అనిశ్చయతని తెలియ చేస్తూంది. "రేపు" అన్నది వస్తుందో రాదో, వస్తే మాత్రం సిరి వెలుగుతో వస్తుందా? అన్న సందేహం కవికే సహజం. అయినా ప్రజలకి ఆశ కల్పిస్తు న్నాడు. తద్వారా కార్యోన్ముఖుల్ని చేస్తున్నాడు.

[132]సక్రమ మార్గంలో నడిచేదే ప్రభుత
ప్రగతి పథాన పయనించేదే కవిత
మెదడుకు మేతగా నిలిచేదే ఆలోచన
శక్తికొలది సాయపడుటే మానవత

'నడిచేది ప్రభుత', 'పయనించేది కవిత', 'నిలిచేది ఆలోచన', 'సాయపడుట మానవత'—అన్న రూపాల్కి జోడించిన ఆశ్రయం. (Clitic)పై వుదాహరణంలో వుంది. ఈ ఆశ్రయం వల్ల కవితకి అనిశ్చయార్థం కల్గుతూంది.

[133]ఓ నిరాశా జీవులారా ఉదయమిది లేవండహో
మానసమ్ముల నవ మధువుతో స్నానమాడించండహో

'అహో' 'అన్న శబ్దం వల్ల నిరాశాజీవులైన లోకంలోని వాళ్ళకంతా అని అర్థం అవుతూంది. తండోరా వేసేవాడు కూడా సరిగ్గా ఈలాంటి మాటనే వాడుతుంటాడు. అక్కడ వాని దృష్టి తనవైపుకి తిప్పుకొని తన మాటల

సారాంశం విన్పించాలని. అలాగే ఇక్కడ నిరాశా జీవుల్ని తనవైపుకి తిప్పు కొని, వెన్నతట్టి ఆత్మధైర్యం రంగరించి పోయడం కవిదృష్టి అని తెలుస్తూంది.

లయ :— ఇప్పటి వరకు 'యతి' నించి 'అభివ్యక్తీకరణధ్వనుల' వరకు చెప్పబడ్డవి ధ్వనులకు కాకపోతే అక్షరాలకు సంబంధించేవి. ఈ ధ్వనులు సమ పాళ్ళలో ఆవృత్తం అవుతూంటే పాదానికి ఒక గతి, గమనం, నడక ఏర్పడుతూంది. ఆ 'నడక' లో ఊగు విసురు కన్పడుతూంది. గతి, గమనం, నడక, ఊగు, విసురు—ఈ పదాలన్నీ ఒకే విషయాన్ని చెప్పేటివి. అది 'లయ', అక్షర రమ్యత. మిల్టన్ 'Paradise Lost'ని గురించి చర్చిస్తూ వై. పింటర్సు, మిల్టన్ వాడిన బ్లాంక్ వర్స్ (Blank Verse)ను కవితా ప్రపంచంలో విశిష్టమైందిగా కీర్తిస్తాడు. కీర్తిస్తూ ఆ ఛందస్సు అంటే అదేదో అతీతమైంది అని అనుకోవాల్సిన అవసరం లేదు. అది [134]"The total Phonetic Quality of metrical language that is rhythm" అంటాడు. కనుక 'లయ' (Rhythm) అంటే కేవలం ఒక ప్రాసో, అనుప్రాసయతో, గతో అభివ్యక్తీకరణ ధ్వనో, ధ్వన్యనుకరణధ్వనో మాత్రమే కాదు, అన్నిటి కలయిక. అన్యోన్య కలయిక అని అర్థం అవుతూంది. ఈ విషయంలో బెంజిమన్ హ్రూషోవ్‌స్కీ (Benjamin Hrushovski) మాటలు స్మరణీయాలు [135] "Rhythm is an "Organic" phenomenon and can be appreciated fully by a Phenomeno-logical approach to the poem, that is, by going within it and moving in a hesmeneutic circle from the whole to the parts and vice versa." పాటిబండ గారి [136] "ఛందమున ప్రభావమైనది లయ. అది యక్షర సంఖ్యను గాని, వృత్త నామమును గాని ఆశ్రయించియుండదు. అది యక్షర బంధము నాశ్రయించి యుండును." అన్న ఈ అభిప్రాయం కూడా పై అభిప్రాయంతో సంపదిస్తూ వుంది.

ధ్వనులకి సంబంధించిన విశేషాల్ని తెల్సుకొన్న తర్వాత పదాలకి సంబంధించిన విషయాల్ని ముచ్చటించుకొందాం. పదానికి సంబంధించిన రూపం, దాని అర్థం—రెంటినీ గూర్చి తెల్సుకోవడం ఇక్కడ అవసరం. రూపం విషయానికి వస్తే కవులు సృష్టించే అనేక పదాలు జ్ఞప్తికి వస్తాయి.

పవనబాలకులు, పూలబాల, మేఘబాల లాంటి భావకవిత్వంలో విరివిగా ప్రచారం పొందిన పదాల్ని ముచ్చటించుకోవచ్చు. అలాంటి వాతావరణం వచనకవితలో కూడా కనబడుతుంది. [137]నెలబాలుడు, [138]చీకటి దయ్యము [139]గాలి కన్నె, లాంటి పాతబడ్డ పదసంయోగాలు కూడ నేటి కవితలో కన్పడుతున్నాయి. అవే గాకుండా మరి కొన్ని కొత్తపదాలు—

[140]రిపబ్లిక్ ఖజానా, [141]ఎక్స్ఛేంజి దేవాలయం, [142]కాఫీకల్చర్,
[143] మిన్నయిన బస్సు [144] సినీ తారడు,

[145]పది నిమిషాల్లో నవ నవ యౌవనం త్రాగేసి
మత్తుగా మెత్తగా తూలుతూ సోలుతూ
అధికారం గారు వారి కారుగారు పోతున్న వేళ—లాంటి

ఆదాన ప్రదానాల (Loan Blends)తో బాటు

[146]అరకు లోయల గాలికొండ
హైదరాబాదు గోలకొండ.

[147] రగ్గులు కప్పుకున్న బొగ్గుల కుంపటికి
అగ్గి పాటలు నేర్పుతున్నాను.
[148] కలల కవుగిళ్ళు ఆశించ లేదు
కళల పొదరిళ్ళు కాంక్షించలేదు

[149] గుండెను రెండుగా జీల్చినట్లు
అఖండ దేశాన్ని ఖండించింది చాలక
ఇరుగు పొరుగులకు ఇంకా
భూదానం చేస్తూనే ఉన్నారు.

[150] కన్ను దాన్నెలు-లాంటి సమాసాల్తోబాటు
[151] నీవు హరుని నెత్తికెక్కితే
నీ నెత్తికెక్కేను మా నరుడు
నిజంగానే అతడు ఘనభుజుడు

(ఘనభుజుడు= Armstrong, ఎవరెస్ట్ శిఖరాన్ని అధిరోహించినవాడు)

[152] ఎఱ్ఱసీసా, ఎఱ్ఱటి ద్రవం (Brandy Bottle, Brandy) [153] తెల్లపిండి (Toilet Powder), [154] గాజుకడ్డీ (Thermometre) లాంటి అనువాద రూపాలూ కనబడుతుంటాయి. ఇవి పదం రూపానికి సంబంధించిన ప్రత్యేకతలుగా చెప్పుకోవచ్చు. ఇక్కడ వాటి అర్థం కన్నా రూపానికి ప్రాధాన్యం అని పిండితార్థం. పదం అర్థానికి సంబంధించిన ప్రత్యేకతల్ని గూర్చి తెల్సుకొందాం. కాలం మారేకొద్దీ కొన్ని పదాల అర్థంకూడా మారి పోతూండడం సహజం. అది రకరకాలుగా వుండొచ్చు. నన్నయ 'కంపు' కన్నా, నేటి 'కంపు' ఎంతో మారిపోయింది. ఆలనాటి 'అవ్వ' నేడు 'అమ్మాయి' అయింది. మన 'అమ్మాయి' 'మధుర' తెలుగు భాషలో 'అవ్వ' అయింది. ఇవి అన్నీ మార్పుకు కొన్ని సూచనలు. ఇలాంటి మార్పులన్నీ కవి గుర్తిస్తుంటాడు. వాటిని కవితలో చొప్పిస్తుంటాడు. వీటితో బాటు నానార్థాలు, పర్యాయ పదాలు కవితలో ప్రముఖ స్థానాన్ని కల్గి వుంటాయి. వీటి ప్రభావం చేతనే 'శ్లేష'లకు అవసరం కల్గింది. ఈ శ్లేష శబ్దాల విరుపులకి సంబంధించీ, పదానికున్న నానార్థాలకి సంబంధించీ వాక్య నిర్మాణంలోని అస్పష్టతకి సంబంధించీ వస్తూంటుంది. పదాల విరుపుకి సంబంధించిన శ్లేష 'శబ్దశ్లేష'; నానార్థాలకి సంబంధించింది "అర్థశ్లేష"; వాక్య నిర్మాణ అస్పష్టతకి సంబంధించిన శ్లేష "వాక్య నిర్మాణ శ్లేష"గా మనం గుర్తించుకోవచ్చు. ప్రాచీన లాక్షణికులు శబ్దశ్లేష, అర్థశ్లేష రెంటినే గుర్తించారు. వాక్య నిర్మాణ శ్లేష భాషా శాస్త్రం ప్రభావం. ఇవి అన్నీ కవితలో చోటు చేసుకొంటుంటాయి. అవి భాషయొక్క ప్రాచీనత్వాన్ని, వైలక్షణ్యాన్ని సౌష్టవాన్ని తెలియ జేస్తాయి. కవి గొప్పతనాన్ని, నిపుణత్వాన్ని కనులకు కట్టిస్తుంటాయి. అందుకని వీటిని రచనా విన్యాసంలో ఒక వైలక్షణ్యంగా గుర్తిస్తున్నాం. వీటికి సంబంధించిన వుదాహరణలు వచన కవితలో వున్నాయి.

**శబ్దశ్లేష:**

[155] వసుధన శాంతి రక్కసిగ నర్తిల శాంతి నికేతనమ్ముగా
విసరి దిగంతరాశముల వెచ్చని శాంతినికేతనమ్ము లో

శాంతినికేతనము = శాంతినీ + కేతనము
శాంతినికేతనము

[156]హరి -జనుడె పుట్టిన రోజు
హరిజనుడే పుట్టినరోజు
హరిజనుడు = హరి + జనుడు + ఐ
హరిజనుడు + ఏ

[157]అయ్యోరామ చిల్క
అయ్యో రామచిల్క

ఇక్కడ 'అవ్యవహితావయవాల' (Immediate Constituennts) వల్ల శ్లేష కల్గుతూంది. 'రామ' పదాన్ని 'అయ్యో'కి అవ్యవాహితావయవంగా చేర్చితే 'అయ్యోరామ' అన్న, సంభాషణలతో వచ్చే అభివ్యక్తీకరణ పదం అవుతుంది. కాక, 'చిల్క'తో చేర్చితే 'రామచిల్క' అన్న నామవాచకం— ఒక పక్షి—అవుతుంది

## అర్థశ్లేష

[158]మరఫిరంగీ గుండ్లను తన చిరునవ్వులతో నెదిర్చి
నా సంకెల లూడ్చిన గాంధీ సంగతి తలచినపుడు
సరిహద్దుల కబళింపగ విరుచుకపడు దుశ్శక్తుల
పిట్టలవలె కొట్టిన మన 'జెట్టుల' స్మరియించినపుడు.

జెట్టి—ఏకవచనం. జెట్టులు—బహువచనం తెలుగురూపం—మగధీరులు, జెట్—ఏకవచనం. జెట్టులు—తెలుగులో బహువచన రూపం. ఆంగ్ల పదం. —జెట్ విమానాలు అని అర్థం.

[159]మిస్సయిన బస్సును చూస్తూ
మిటుకరించే వాళ్ళు
బస్సులోని మిస్సును చూస్తూ
గుటకలేసే వాళ్ళు

మిస్—ఆంగ్లపదం. క్రియారూపం—తప్పిపోయిన అనీ అర్థం
మిస్—ఆంగ్లపదం. నామవాచకం—పడుచు అన్న అర్థం

160ఉట్టిని అందుకోలేనని కాదు—
ఉట్టినే ఎందుకు ఎగరాలని.

ఉట్టి :— ఇళ్ళల్లో సామాన్లని ఎత్తులో పెట్టుకొనేందుకు
ఉపయోగపడు సాధనం తాళ్ళతోగాని, కమ్మితోగాని చేసివుంటారు

'ఉట్టికెక్కలేనమ్మ స్వర్గానికెక్కిందట'! అని సామెత.

ఉట్టి :— ఊరకనే

161 ఎదురు చూస్తున్నాయి
నా కండ్లు ఆవేదనతో
కాని రాలేదు నారాజు
ఐదు గంటల కొచ్చేవాడు ప్రతి రోజు
చిరునవ్వుతో నన్ను పలకరించి
బాహుపంజరంలో బంధించి
తీయని కబుర్లతో మురిపించి
చిలిపి చూపులతో కవ్వించి
గళ్ళలో కళ్ళు కలిపి
క్షణాల్లో గంటలను గడిపి"

.... .. .... ....

ఇక్కడ కనబడే 'రాజు' ప్రియుడని అనుకొనే అవకాశం వుంది. కారణం వాతావరణం ఆలాంటిది. చేష్టలన్నీ ప్రేయసీ ప్రియులవే. వాక్యాల్లో గాని, పదాల అమరికలో గాని శ్లేషకి అవకాశం లేదు. ఈ గేయంలోని రాజు "ఆరేండ్ల అందాల రాజు" అని తెలుస్తూంది చివరకు. మరి ఇలాంటి శ్లేష ఎలా కల్గింది? అంటే "రాజు"కి వుండే గుణాల్ని ఎక్కడ చెప్పలేదు, చివరనతప్ప. అంటే నిర్మాణం దృష్ట్యా కొంత అస్పష్టత వుందన్న మాట.

ఇలాంటి 'వాక్య నిర్మాణశ్లేష'లు కూడా వచన కవితల్లో వున్నాయి. పదం, అర్థానికి సంబంధించి ముచ్చటించుకోవాల్సింది భావచిత్రణ. ఇది

ఆంగ్లంలో 'Imagery'కి సమానార్థంలో వాడబడ్డది. డా. సి. నారాయణ రెడ్డి [162]ఇమేజరీ యనగా స్థూలముగా కల్పన యనవచ్చును. ఇమేజ్ అనగా కల్పనా చిత్రమనవలె. కాని దీనికన్న పదచిత్రమనుటలోనే సామంజస్య మున్నది... ....కవి తన పదబంధముల ద్వారా భావమునకు మూర్తికల్పన చేయును. అనగా పదములతో బొమ్మలు కట్టు నేర్పు కవిది- అని "పద చిత్రము"ను వాడినారు,

దాశరథి [163]"కవి వాస్తవాన్ని చెబుతూ, దాన్ని తన కల్పనలతో మెరుగు పెట్టి మనకు అందిస్తాడు.....ఆతను ఉపయోగించే ఎత్తుగడలలో ఈ మాట బొమ్మలు కూడా వొకటి....కల్పన అనే శబ్దము నేడు వాడినప్పుడు అది వ్యంగ్యము, అలంకారాలు, ఇతర శబ్ద, నాద చిత్రాల ప్రగాఢ సమ్మేళనం వల్ల ఏర్పడిన మాటగా భావించాలి. కల్పన (ఇమేజరీ) దీనికే పర్యాయ పదం అనవచ్చును," అన్నారు. ఒకరు "పదములతో బొమ్మలు" అనీ, ఇంకొకరు 'మాట బొమ్మలు' అనీ అనడంతో 'పద చిత్రము' కల్పన అన్న పదాల్ని ఇమేజరీకి సమానార్థకాలుగా వాడారు 'వాడు కల్పించి చెప్తున్నాడు'. 'వాడి పని ఎపుడూ కల్పనలు చేయడమే' అన్న వాక్యాల్లో 'కల్పన' అంటే కల్పించి చెప్పడం. లేని పోనివి చెప్పడం. అంటే వున్నది ఒక్కటయితే చెప్పడం మరొకటి అన్న అర్థం. అలాంటి అర్థం గల 'కల్పన'ని ఇమేజరీకి సమానార్థంగా తీసుకోలేం.' పదచిత్రము'లో "పదాలతో బొమ్మలు చేయడం" రూపానికి సంబంధించింది. అపుడు అది అనుప్రాసాదుల్లో చేరుతుంది కాకపోతే 'కొత్తపదాల సృష్టి'లో చేరుతుంది. అంతేగాని అర్థానికి సంబంధించింది అన్న అర్థం రావడం లేదు. దీన్ని రెండు రకాలుగా విభజించి "భావ ప్రకర్ష యున్నది భావచిత్రము," "ఊహాధిక్యమున్నది ఊహాచిత్రము" అని విభజించారు ఇది కేవలం ఉపమాది అలంకారాల్ని దృష్టిలో పెట్టుకొని చెప్పిన నిర్వచనం గానే తోస్తుంది. డా. బి. కోటేశ్వరరావు 'పద్యవిద్య'ని గురించి చెప్తూ [164]"ప్రసన్నత అంటే శబ్దార్థాల చాటున వున్న రహస్యార్థాన్ని సుస్పష్టంచేయటం" అని నన్నయ వాడిన 'ప్రసన్న కథా కలితార్థ యుక్తి'లోని'ప్రసన్నత'ని గురించి చెప్తూ అన్నారు. అయితే ఇది ఆంగ్ల ఇమేజరీకి సమానార్థకమే.

'ఇమేజరీ' నారాయణరెడ్డి అనుకొన్నట్టు ఉపమాద్యలంకారాలకి సంబం ధించీ, కోటేశ్వరరావు చెప్పిన 'శబ్దార్థాల చాటున వున్న రహస్యార్థాన్ని గురించీ చెప్తూంది. దీన్ని 'భావచిత్రణ' అనొచ్చు. అది పదం కానీ, అలం కారం కానీ, భావన వల్లనే గోచరిస్తుంది. మనోలోకంలో వాటికి సంబంధించిన అనేక రూపాలు దృశ్యమవుతాయి. ఏది సందర్భోచితమో దాన్ని వెతికి పట్టు కొంటుంది మనస్సు. అది భావానికి సంబంధించిందే కాని పదానికి కాదు. [165] "The word "image" means a mental reproduction" అన్న రెనె వెల్లెక్ మాటలు దీంతో సంవదిస్తున్నాయి. కనుక దీన్ని 'భావచిత్రణ'గా గుర్తించొచ్చు. దీనికి కూడ వచన కవితలో వుదాహరణాలు కనబడు తున్నాయి.

[166]నులి వెచ్చని సాయంత్రపు ఎండలో.
అరుణాంబరపు ముఖం మీద
ఉషాకాంత వమనం చేసి వెళ్ళిన
వేడి రుధిరపు మరకలా తయారయింది

[167]గిరి నితంబం పై వలువలార వేసుకున్న
అప్సరసల జీరిన శిరోజాల్లాంటి
చెట్ల ఆకుల గలగలల
వినబడని గుసగుసలలో,

[168]కారాలు మిరియాలు నూరుతూ
అసమర్థుడైన మొగుడి మీద
విరుచుక పడ్డ గయ్యాళి గంపలా
వచ్చిపడింది హోరుగాలి. లాంటి వివరణ

అవసరం లేని ఉపమాలంకారాలూ,

[169]రక్కసగాళ్ళెవరో రక్కి నొక్కితే
రక్తం వమనం చేసుకున్న శశివలె.......
ప్రభాతాన పరచుకున్న సంధ్యను
ఎవడో కసిగా పిసికి వేసినట్లు .......

సిలువ మీద మానవతిని కట్టివేసి కొట్టిన ప్రతి మేకు శరీరంలో దిగినపుడు, అవి ఎదను చీల్చితే, ఎంత భయంకరమో పై వుపమానాల ద్వారా చెప్తున్నాడు శశి ఉషస్సంధ్య రెండూ లాలిత్యానికి మారు రూపాలు- వమనం చేసుకోవడం, పిసికి వేయబడడం ఉద్ధతత్వానికి మరో రూపాలు. ఇక్కడ లలిత ఉద్ధత రూపాలకి ఘర్షణ చెప్పడం ప్రధానం. అంటే ఉద్ధత రూపాల వల్ల లలిత రూపాలు బాధ పడటం. తద్వారా 'మానవత' అవస్థని చెప్పడం. అదీ భావచిత్రణ.

[170]సాయంత్రం పూట వాహ్యాళికి రావణుడు వస్తాడు
పొద్దు తిరుగుడు పువ్వు సూర్యుణ్ణి వదిలేసి అతనివైపు చూస్తుంది.
రావణుడు మరి సాయంత్రం పూట తూర్పువైపు నడుస్తాడు,

'పొద్దు' ఏ పక్కన వుంటే ఆ పక్కకి వుంటుంది పొద్దు తిరుగుడు పువ్వు ఆది దాని గుణం. రావణుడు సాయంత్రం తూర్పు వైపు వాహ్యాళికి పోతున్నాడు. పొద్దు తిరుగుడు పువ్వు అతన్ని చూస్తుంది- అని కవి చమత్కరిస్తున్నాడు. ఇలాంటిదే, అప్రస్తుతం అయినా, తమిళంలోని [172]శిలప్పదిగారంలో ఒక వుపమానం వుంది. మధుర పాండ్యరాజు అంతఃపురం కోటపై జెండా ఎగురుతూంది. కణ్ణకి కోవలన్ లు వ్యాపారార్థం మదురై వస్తున్నారు. వాళ్ళని "రావొద్దు, రావొద్దు" అని చేయి వూస్తూ చెప్తున్నట్టు జెండా ఎగురుతూందట. ఇవి అలంకారాలకి సంబంధించినవి. వీటిలో ఒకే పదం వల్ల గాక అలంకారం వల్ల భావనాత్మకం ఆయి భావచిత్రణలుగా భాసిస్తున్నాయి

[173]నిద్రాగుహ నుండి
బయటికివచ్చిన మనస్సు

'గుహ' పర్వతాల్లో. కొండల్లో మల్చబడి వుంటుందని వింటున్నాం. ఒకే పక్క ద్వారం. మిగతా మూడు పక్కలా ఏలాంటి సందు వుండదు. బయ

టికి పోయే అవకాశమే లేదు. నరకం అని కూడా అనుకోవచ్చు. భయంక రత్వానికి చిహ్నం. అలాంటి 'గుహ'ని 'నిద్ర'కు పోలుస్తున్నాడు. గుహలాగా నిద్రకూడా భయంకరం. ఎటూ పోయేందుకి వీలుకాని, మూసుకోబడి వున్న ప్రదేశం. అలాంటి ప్రదేశం నించి 'మనస్సు' బయటికి వస్తూంది. అంతవరకు 'నిద్ర' అనే గుహలో బందీలాగా వున్న 'మనసు' బయటికివచ్చి స్వేచ్ఛా వాయువుల్ని పీల్చుతూంది. అంతేగాకుండా అజ్ఞానం నించి విడివడి మనసు వచ్చింది అనికూడా అర్థం చేసుకోవీలవుతూంది. ఇంతఅర్థం కేవలం 'గుహ' అన్న పదంవల్లనే సాధ్యమవుతూంది. కనుక అది 'భావచిత్రణ' అయింది.

174ఈ దేశములో ఎప్పుడు
పేదల గుడిసెలే కాలిపోతాయి
కడుపులో మండే ఆకలిమంటలు
కన్నుల్లోంచి ఎగిసి
కప్పులంటుకొంటా యేమో

'మంట': గడ్డితోకాని, కట్టెల్తోకాని, మరి వేటితోకాని అగ్గివేసి రగలేస్తే మంట పుట్టుతుంది. అది చలికాలం చలిని పారదోలే నునువెచ్చదనం ఇవ్వొచ్చు, భోజనాన్ని ప్రసాదించొచ్చు. పరశురామ ప్రీతి చేయొచ్చు. ఇవి అన్నీ మంటకి స్వాభావికాలు. అలా మూడూ స్వాభావికాలైనా ప్రస్తుత కవితలో మనకు వెంటనే మనసుకి తట్టేది పరశురామ ప్రీతిమాత్రమే. 'ఆకలి మంటలు' ఆకలి అనెడి మంటలు, ఆకలియొక్క మంటలు. ఆకలివల్ల మంటలు లాంటి అర్థాల్ని సాధించొచ్చు. కాని అన్నీ జ్వలితరూపాలే. ఆ జ్వలన చేష్ట కడుపునించి కళ్ళలోకివచ్చి గుడిసెకప్పుని అంటుకొంటుంది. ఈ అంటుకోవడానికి కారణంవేరు. ఆకలిమంటలే అంటుకొంటున్నాయనడం కవి చమత్కారింపు అలా మూడు రూపాలున్నప్పటికీ ఒక రూపాన్నే తీసుకోవడం భావనకి సంబంధించింది. కనుక భావచిత్రణ.

175గుండెను రెండుగా చీల్చినట్లు
అఖండదేశాన్ని ఖండించింది చాలక

ఇరుగు పొరుగులకు ఇంకా
'భూదానం' చేస్తునే ఉన్నాడు.

భూదానం- గొప్పవారు పుణ్యంకోసం భూమిని దానంచేయడం భూదానం. ఎవరో తమ పితృపితామహుల జ్ఞాపకార్థం భూదానం చేయడం సర్వదా కన్పడక పోయినా సంఘంలో అనూచానంగా వస్తూ వున్నదే. వినోబాభావే ప్రారంభించిన యజ్ఞం 'భూదాన యజ్ఞం'. అవసరానికంటె ఎక్కువగా వున్న వాళ్లందరి దగ్గర నించీ భూమిని దానంగా గ్రహించడం, పేదలకు పంచడం ఈ యజ్ఞం లక్ష్యం. అయితే ఈ అర్థాలేవీ ప్రస్తుతకవితలో పొసగడం లేదు ఆంధ్రరాష్ట్రం దేశంలో మొదటి భాషాప్రయుక్తరాష్ట్రం అయింది. అవిభక్త చెన్నరాష్ట్రంనించి, చీలిక కల్గినపుడు కొన్ని కొన్నిగ్రామాలు, పట్టణాలు ఆంధ్రరాష్ట్రంలో చేరాల్సి వుండినా రాజకీయ నాయకుల స్వలాభాపేక్షకి ఎరగా అవి చెన్నరాష్ట్రంలోనే వుండిపొయ్యాయి. ఆ విషయంకూడా అప్రస్తుతం.

గాంధీజీ కలలుగన్న స్వాతంత్ర్యం వచ్చింది. ఎంతో వేదనని రగిలించింది. అఖండంగా వున్న దేశాన్ని మూడుగా చీల్చింది. రెండుదేశాలుగా చేసింది. దాంతోనే గుండెలు వ్రయ్యలయ్యేట్టు కనబడుతూంటే చైనా, పాకిస్థాను యుద్ధం ప్రకటించడం, కొన్నికొన్ని దౌత్యాలు నెరపడం, కొన్నికొన్ని ప్రదేశాల్ని వాళ్లకి ముట్టచెప్పడం జరిగింది. అలాంటి 'ముట్టచెప్పడం' కవిని బాధించింది. ఈ విషయం అంతా 'భూదానం' పదం వల్ల భావించిడానికి వీలవుతూంది. కనుక 'భావచిత్రణ' అయింది.

ఇలాంటి భావచిత్రణల్తోపాటు రచనావిన్యాసంలో పేర్కొదగ్గది నుడికారం- తన భాషకి స్వతస్సిద్ధమైంది, విషయవివరణాన్ని మిక్కిలిగా హత్తుకొనేటట్టు చేసేది, కవిని పాఠకుడికి చేర్చేది.

176(అ)కాలుతున్న గుండెలమీద కుంపట్లు బోర్లించుకుని
కూలుతున్న గుడిసెలవలె ఏటవాలుగా పడుకొని

(ఆ)గుడ్డివాని చేతిలోరాయి
తప్పిదారి తగుల్తుందేమో
తాకాల్సినవాడి తలకు

(ఇ)సమాజం మోజుపడి, నీ మెడలో
"గుదిబండయి వ్రేలాడిందెప్పుడు

(ఈ)ఎందుకంత బిగుసుకపోతావు
ఎదను "అయోమయ్యం చేసుక
ఏదీ ఒకసారి ఇటుకేసిరా

177స్నేహసూత్రము "పడుగుపేకల జేరి రెపరెపలాడగా
పైటనై నీ ఎడదపై నే వాలవలె నని ఉన్నది.
178పోలీసు లాఠీచార్జిసైతం ఖాతరుజెయ్యకుండా
"చిత్తకార్తె కుక్కల్లా వెంబడివురికే కాలేజీవిద్యార్థులూ

క్రింది గీతలున్నవి నుడికారాలు. ఇవి వ్యావహారికంలో సజీవరూపాలు. కొన్ని కొన్ని విషయాల్ని చెప్పాల్సినపుడు వాడుకొనే సంక్షిప్తభావాలు ఇవి.

కేవలం ఇవేగాకుండా ధ్వన్యనుకరణ శబ్దాలు, ఇతర భాషాశబ్దాలు, మాండలికాలు, అపభాషాశబ్దాలు ( slangs ), తిట్టుపదాలు అవసరం అయితే అభివ్యక్తికి తోడ్పడేటివి అయితే అవికూడా రచనావిన్యాసంలోని భాగంగానే గుర్తించుకోవచ్చు.

ఇంతవరకు పదం రూపానికీ, అర్థానికీ సంబంధించి చూశాం. ఇపుడు వాక్యాలకి సంబంధించి చూద్దాం.

ప్రతి భాషకీ వ్యాకరణం వుంటుంది. అది గ్రాంథికభాషా వ్యాకరణంకన్నా వేరుగావుండవచ్చు, లేక సంవదించొచ్చు. అలాంటివ్యాకరణాల్ని 'నిర్మాణం' అని పిలుచుకోవచ్చు. ఆ వాక్యనిర్మాణం వల్ల రచనావిన్యాసం కన్పడటం కద్దు దీన్ని మూడురకాలుగా విభజించి చూడొచ్చు. మొదటిది నామవాచకం, క్రియ మొదలైన భాషాభాగాల (Parts of speech)కి సంబంధించింది. పదాలు, వాటి నిర్మాణం, చేర్పులు, మార్పులు మొదలైన వాటిని గురించి తెల్పడం ఇక్కడి విషయం. తర్వాత, వాక్యం ఆధారంగా, నామ పదబంధం, క్రియా పదబంధం, విశేషణం—లాంటి వాటి నిర్మాణం, అవి కవితలో ఎలా మారుతుంటాయి, ఆ విషయాన్ని గురించి చెప్పడం, అవి కవిభావానికి ఎలా ప్రోద్బలకాలవు

తున్నాయో తెల్పడం. ఇక మూడోది ఈ రెంటికన్నా భిన్నమైంది. వాక్య నిర్మాణంకి భిన్నమైంది. పాత్రచిత్రణాదులకి సంబంధించింది.

## నామవాచకం :-

[179]ఈ ఫస్టోబరు శుభవేళ
నిన్నటి మన స్వరూపం స్మరించి

ఫస్ట్ + అక్టోబరు ⟶ ఫస్టోబరు = అక్టోబరు ఒకటి.

అయితే కవిత అంతా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రావతరణానికి సంబంధించింది. రాష్ట్రావతరణ నవంబరు ఒకటి. 'మార్పు' కోరేవాడికి ఇలాగే వుండాలన్న నియమం లేదుగా. కనుక ఫస్ట్+నవంబరు ⟶ ఫస్టోబరు అని అర్థం చేసుకోవాల్సి వుంది. రాష్ట్రావతరణ దినం కనుక శుభవేళ. ఫస్టోబరు నామవాచకం అయినా అపూర్వం.

[180]ఈ పూట చెప్పిన మాట మాపటికి మార్చేవాడికి
పొగడిక బ్రతుకుదెరువు తెప్ప

పొగడిక — పొగడ్త

## క్రియ :-

[181]గూమీతిమిరాలు చెరిషించి
సైతాన్ మనల్ని పరిషించి నపుడు

చెరిష్—చేసి

పరిష్-చేసినపుడు—అని అర్థం. ఆదాన రూపాల్లో క్రియలకు "చేయు"రూపం చేర్చి తీసుకోవడం తెలుగు సంప్రదాయం. అయితే కొన్ని సంస్కృతపదాలకి "ఇంచు" కూడా వాడబడుతుంది. సంస్కృతేతర ఆదాన రూపాల్లో "చేయు" చేర్చిన రూపాలే ఎక్కువగా వున్నాయి. ఆ సంప్రదాయాన్ని శ్రీశ్రీ ని రాజని ఆరుద్ర "ఇందు" చేర్చిన రూపాల్ను వాడారు,

చెరిష్—ఇంచి     చెరిషించి
పరిష్—ఇంచినపుడు     పరిషించినపుడు

విశేషణం: క్రియల లాగే ఆదాన రూపాల్లో విశేషణాలకి తెలుగుప్రత్యయా న్ని జోడించడం,

[182]సైంటి ఫిగ్గా, సిస్టమేటిగ్గా
నిందుందాం, పొందుందాం
Scientific —గా సైంటిఫిగ్గా
Systematic —గా సిస్టమేటిగ్గా

ఇక వాక్య నిర్మాణంలో నామ పదబంధం. క్రియా పదబంధం, విశేషం మొదలైన వాటికి సంబంధించిన విశేషాల్ని గురించి చూద్దాం. తెలుగులో కర్త, కర్మ, క్రియ వరుసగా వుండడం వాక్య నిర్మాణ పద్ధతి. ఇది వ్యావహారికంలో కానీ, రచనలో కానీ వుండాల్సిన పద్ధతి. కాని కవికి వెసులుబాటు వుంది. నిరంకుశుడు. అందుకని అనేక కారణాల వల్ల ఈ నిర్మాణ పద్ధతి మారుతూంటుంది. అయితే ఎక్కువగా వచనంలో ఈ పద్ధతి మారదు.

[183]ఒకనాడు వితంతువెదురైతే ఆమె పట్ల
ప్రకటించే వాడు మదిలోన సానుభూతి

'ప్రకటించేవాడు' చివరన వుండాలి.

[184](ఉ)2 ఉదయం అడుగుతుంది
1 రాత్రి చేసిన అపకారం ఏమని?
4 రాత్రి అడుగుతుంది
3 పగలు చేసిన ఉపకారం ఏమని?

1, 2, 3 ,4 వరసలో రాస్తే నిర్మాణం సరిపోతుంది.

[185]హృదయ పాత్ర లేకుండా
కవితా తటాకంలో దిగి
మంచినీరు ముంచుకో లేక
మరలారు వట్టి చేతుల యింటికి

'మరలారు' క్రియ చివరన వుండాలి.

[186]రాగ రంజితమైన ఉషస్సు
కలిగిస్తూంది క్రాంతి వాకిట శాంతి

'కలిగిస్తూంది' ని చివరికి నెట్టాలి.

[137]తెల్లని మంచుకొండ పాదాల మీద
ఎర్రని రుధిరాల పారాణి దిద్దడానికి

ఏలాంటి మార్పు లేదు. కవితలో నిర్మాణంలో తప్పక మార్పు వుండాలి అని గాకుండా ఐచ్ఛికం అని చెప్పడం యిక్కడ వుద్దేశం.

[188]పడగొట్టండి పాడు గోడల్ని
పోగొట్టండి ఈ పీడల్ని
దిగనివ్వండి మమతల మబ్బి ఊడల్ని
ప్రాకనివ్వండి చల్లని చెలిమి నీడల్ని

మొదటి క్రియా పద బంధాల్ని చివరన చేర్చాలి. ఇలా ఒక మార్పే గాకుండా

[189]నద్దు చెయ్యకుండా పడుక్కొంది సముద్రం

ముద్దు పెట్టుకుంది చంద్రుణ్ణి మేఘం

గుర్తుల ప్రకారం పదాల్ని పొదిగితే మామూలు వాక్యనిర్మాణం అవుతుంది.

'క్రియ'కి సంబంధించి Princeton Encyclopediaలో ఇలావుంది.

[190] "It is possible, as pointed out by O. Jespersen (The Role of the Verb) to quote verbless construction giving a very definite impression of motion' and vice versa; one should add, i. e., a poem packed full with verbs may be static".

ఈ నిర్వచనాన్ని బట్టి క్రియా రహితంగా రాయడం వల్ల కవితకి చైతన్యం కల్గుతూంది అని అర్థం అవుతుంది.

[191]విచ్చిన్ని బాణంలా విచారం దూసుక పోయిన గుండెతో
దిగులుతో దైన్యంతో బరువుతో బాధతో
బ్రతుకు బజార్లో నిలబడింది.

—కుందు రి. 'కాలం ఆగిపోయింది'.

ప్రస్తుత కవితలో 'నిలబడింది' క్రియ. మిగతావన్నీ నామ పద బంధాలు (Noun Phrases). వ్యాకరణ నిర్మాణం దృష్ట్యా పనిని చూపించేది క్రియ. అంటే చైతన్యాన్ని స్ఫురింప జేసేది క్రియ. ఒక క్రియకే అంత పని తనం వుంటే, ఇంక కవితలో మరిన్ని క్రియలు వుంటే ఇంకెంతో చైతన్యం కల్గి వుండాలి. కాని ఈ కవితలో ఒక క్రియ మాత్రమే వుంది. "బ్రతుకు బజార్లో నిలబడింది" అన్నది చెప్పదలచుకొన్న భావం. అలా వ్యాకరణ దృష్ట్యా నిర్మాణాన్ని పాటించి యథాతథంగా చెప్తే భావం అర్థం అవుతూంది. విషయం పూర్తవుతుంది. అయితే వచనంగానే మిగిలి పోతుంది. అందుకని బోలెడన్ని విశేషణాల్ని చేర్చుతున్నాడు. విశేషణాలు ఎపుడూ నామవాచకాన్ని ఆశ్రయించే వుంటాయి. కనుక ఒక క్రియ తప్ప మిగతా పదాలన్నీ నామ వాచకానికో, దాన్ని ఆశ్రయించిన విశేషణానికో సంబంధించినవి. అలా వాటి మధ్యన ఒకే క్రియ వున్నా, నడకలో వేగం వుంది భావంలో గాంభీర్యం వుంది. వేగం క్రియా లక్షణం. ప్రస్తుత కవితలో వున్న నడక, వేగం క్రియ వల్ల పుట్టినవి కావు. ఒక్కో పదంతో క్రియని చేర్చితే—వివ్వచ్చుని బాణంలా నిలబడింది, విచారం దూసుకపోయిన గుండెతో నిలబడింది, దిగులుతో నిల బడింది, దైన్యంతో నిలబడింది. బజార్లో నిలబడింది, లాగా-వేగం రావడంలేదు. నడకస్ఫురించడం లేదు. స్ఫురించినా దెబ్బతింటూంది. మరిన్ని క్రియలు వాడితే క్రియా లక్షణం అయిన చైతన్యం, వేగం స్ఫురించడం లేదు. కనుక జెస్పర్సెన్ చెప్పిన విషయం సరైనదే అని ఈ కవిత ద్వారా తెలుస్తూంది.

సంపత్కుమార ఉదాహరించిన మరో గేయంలో కూడా ఇలాంటి అనుభూతినే పొందగలం.

> [191]చెంగలువలు—గన్నేరులు—ఉన్మాద పతాకలు
> పలలపు ప్రసవాలూ
>
> —బైరాగి 'పుడమికి కన్నెరికం.

'ఎండా కాలపు నెలవులు', 'రామాయణపు పాటలు' లాంటి ప్రయోగాలకి ఎండాకాలానికి సంబంధించిన నెలవులు, రామాయణానికి సంబంధించిన

పాటలు' అని అర్థం. అలాగే 'పలలపు ప్రసవాలు' అంటే 'పలలమునకు సంబంధించిన ప్రసవము' అని అర్థం.

[197](అ) పలలము — సం. వి. అ. న.
1. మాంసము, 2. బురద, 3. నూవుపిండి

ప్రసవము — సం. వి. అ. పుం
1. కానుపు, 2. పువ్వు, 3. పండు
4. పుట్టుక, 5. బిడ్డ —అని

అర్థాలు కనబడు తున్నాయి, కనుక 'బురదకి సంబంధించిన పూవు"— తామర — అని అర్థం చేసుకోవాలి. "—పు" సంబంధబోధక విభక్తి (Possessive Case) అవుతూంది. విభక్తులు ఎపుడూ నామబంధాల్నే ఆశ్రయించి వుంటాయి కనుక 'పలలపు ప్రసవాలు' కూడా నామబంధమే అవుతుంది. మిగతా పదాలన్నీ నామ పదబంధాలే. నాల్గు రకాల పూల సంబంధం తద్వారా లోక మనోభిరామం కల్గుతూంది. ఇలాంటివి వ్యాకరణ నిర్మాణం రీత్యా దోషాలు అయినప్పటికీ, కవులకు ఆ మాత్రం స్వాతంత్ర్యం వుంది. విశేషణాల పాత్ర కొన్ని కొన్ని పాదాల ద్వారానే గాక పూర్తి గేయం వల్ల కూడా కన్పడుతూంది.

దిగంబర కవి చెరబండరాజు రాసిన [198]వందేమాతరం' అన్న కవితని వుదాహరణగా తీసుకొందాం.

(అ) దీన్లో ఇరవైనాల్గు పాదాలు వున్నాయి. పాదం పాదానికి విరామం కన్పడుతూ, వచనం నించి కవితని వేరు చేసే గుణంగా చెప్పబడు తూన్న పాదాల కొలత కనబడుతుంది.

(ఆ) మొత్తం రెండు వందల ఎనభై ఎనిమిది (288) అచ్చులు వాడారు. హ్రస్వాచ్చులు రెండువందల రెండు (202), దీర్ఘాచ్చులు ఎనభైఆరు.

(ఇ) మొత్తం పదాల్లో ఏభై ఎనిమిది (58) తెలుగు పదాలు. ముప్పై ఒక్క (31) సంస్కృత పదాలు వున్నాయి. తదితర పదాలు లేవు.

(ఈ) అన్నిటి కన్నా చిన్న పాదం అయిదు అచ్చులు (5), పెద్ద పాదం ఇరవై నాల్గు అచ్చులు (24) కల్గి వున్నాయి. ఒక రకంగా పెద్ద పాదాలు నాల్గు మాత్రమే వున్నాయి (24, 22, 20, 19)

(ఉ) ఆదిప్రాసలు లేవు. అనుప్రాసలు వున్నాయి. మధ్య మధ్యన కూడా ప్రాసలు వున్నాయి.

ఇలా శల్య పరీక్ష చేస్తూ వున్న విషయాల్ని క్రోడీకరించటం వల్ల అటు కవితకిగానీ, ఇటు పాఠకుడికిగానీ ఒరిగేదేమీ లేదు. ఇది కేవలం రూపానికి సంబంధించి వుండడమే కారణం. పాద విభజన సంఖ్య కవి ఇష్టానికి సంబంధించింది. అలాగే అచ్చులు కూడా. అయితే ఒకే గేయంలో చిన్న పెద్ద పాదాల ఆవశ్యకతకు కారణం ఏమిటి?

ఈ కవితలో వున్న నాల్గు పెద్ద పాదాలు ఇవి.

"ఆకలికి ఎండి మాడి ఎరుపు సొమ్ముల్తో వీథిన బడ్డ శృంగారం నీది"
"అంతర్జాతీయ విపణిలో అంగాంగం తాకట్టు పెట్టిన యవ్వనం నీది"
"ఎలకల్ని పందికొక్కుల్ని భరిస్తూ నుంచున్న భారతివమ్మా"
"సంపన్నుల చేతుల్లో మైమర్చి నిద్రిస్తున్న యవ్వనం నీది"

వాటికి కారణాలని చూద్దాం.

"వీథిన బడ్డ శృంగారం" విశేషణంతో కూడుకొని వుంది. 'ఎరుపు సొమ్ములు' మరో విశేషణం. అలాగే "ఎలకల్ని భరిస్తూ వున్న 'భారతి' వమ్మా" చాలు—కాని 'ఎలకల్తో' కూడా "పందికొక్కులు" అన్న విశేషణంతో బాటు "నుంచున్న" క్రియా విశేషణం (Adverb) చేర్చటం వల్ల ఆ వాక్యాలు పెద్దవయ్యాయి. "అంతర్జాతీయ విపణిలో తాకట్టు పెట్టిన అందం నీది" అన్న వాక్యమే విశేషణం—తాకట్టు పెట్టిన అందం—తో కూడుకొని వుంది. 'తాకట్టు పెట్టిన అందం' అనడంలో శరీరంలోని భాగాలన్నీ తాకట్టు పెట్టినట్టు అర్థం అవుతూంది. అందం కేవలం ఒక అవయవం వల్ల, దాని అమరిక వల్ల రాదు. శరీరంలోని అన్ని అవయవాల అమరిక వల్ల అందం వస్తూంది. 'అందం' తాకట్టు పెట్టడంలోనే, శరీరం అంతా, దాని సౌందర్యం అంతా తాకట్టు పెట్టినట్టు అర్థం అవుతూంది, అయితే 'అంగాంగం

అన్న మరో విశేషణం కూడా ఈ కవితలో వుంది. దానివల్ల భావానికి గంభీరత చేకూరుతుంది. అర్థం మారలేదు. అలాగే "సంపన్నుల చేతుల్లో నిద్రిస్తున్న యవ్వనం నీది" చాలు. 'మైమరచి' అన్న క్రియా విశేషణం చేర్చటం వల్ల భావానికి గంభీరత (emphasis) కల్గుతూంది.

ఈ వివరణ వల్ల కవిత్వంలో పెద్ద పాదాలు ఒకే నామవాచకానికి మరిన్ని విశేషణాలు వాడటం వల్ల వస్తాయనీ, మరికొన్ని క్రియా విశేషణాలు (Adverbs) వాడటం వల్ల, గాంభీర్యంతో బాటు వాక్యాలు పెద్దవవుతున్నాయనీ తెలుస్తూంది. గాంభీర్యం ఎపుడూ భావోద్వేగాన్ని బట్టి వుంటుంది. చిన్న పాదాలు, పెద్ద పాదాలు కల్సివుండడం వచన కవితలో ఎక్కువగా కన్పడుతుంది. చిన్న పాదాల తర్వాత పెద్ద పాదం, తర్వాత చిన్న పాదం రాయడం వల కవితకి 'లయ' స్ఫురిస్తుంది.[193]

వాక్య నిర్మాణంలో విశేషణం, క్రియా విశేషణం లాంటివాటి పాత్రని చూసిన తర్వాత మరో విశేషాన్ని చూడాల్సి వుంది. ఇది నిర్మాణం వల్లా, మార్చి మార్చి ప్రయోగించడం వల్లా కాదు. ఈ విశేషానికి వాక్యానికి సంబంధమే లేదు. అయినా వాక్యాల అర్థాన్ని అనుసరించి వుంటుంది. పాత్ర చిత్రణ, ప్రత్యక్ష వాక్యాలు, పరోక్ష వాక్యాలు—లాంటివి వీటికింద వస్తాయి. ఇవి కూడా కవితని ఆస్వాదించడంలో సహాయపడితే రచనా విన్యాసంలో ఒక భాగంగా గుర్తించుకోవచ్చు. పాత్రచిత్రణ లాంటివి తెలుగు కవిత్వానికి కొత్తేమీ కాదు. ఎక్కడ చూసినా, ఏ కవిత చూసినా కన్పడుతుంటాయి.

[194]ఈ గడ్డపై ఆకాశ వలయాన
లేదు ఏ అభయ మార్గమూ
"ఏ క్షణం మీద పడతాయో బాంబులు"
"ఏ క్షణం ప్రసరిస్తుందో విషవాయువు"
ఆ భయం క్షణం రావడానికీ.

ఇది ఆత్మాశ్రయ రీతిలో సాగిన కవిత. ఆత్మాశ్రయ కథనంలో కవే వక్త. మధ్యలో సంవాదగుర్తులు (inverted commas)లో వున్న భాగం కవి

చెప్పింది కాదు. ప్రజల మనోగత భావం. 'బాంబులు ఎపుడు పడతాయో, ఏ విషవాయువు ఎలా, ముంచుకొస్తుందో' అని భయపడుతున్న ప్రజల భావం. అపుడు కవితో బాటు, ప్రజలు కూడా వక్తలు అవుతున్నారు ఇది వాక్య నిర్మాణం దృష్ట్యా చెప్ప వీలుకానిది. కేవలం సంవాద గుర్తుల వల్ల సాధ్యం అయింది.

ఇంత వరకు రచనా విన్యాసంలో ధ్వనులకి లేక అక్షరాలకి సంబంధించీ, పదం రూపానికీ, అర్థానికీ, సంబంధించీ, వాక్య నిర్మాణం గురించీ, తదితరమైన వాటిని గురించీ తెల్సుకొన్నాం. అయితే ఎక్కడికక్కడ ఇచ్చిన వుదాహరణాల్ని చూస్తే అవి కేవలం వుదాహరించిన విభాగానికే పరిమితమా? అన్న శంక కలుగుతూంది. అంటే 'యతి'కి ఇచ్చిన వుదాహరణలో కేవలం 'యతి' తప్ప ఇంకేం వుండదా? అన్న సందేహం. ఆ వుదాహరణాలన్నీ రచనా విన్యాసంలోని పలురీతుల్ని చెప్పడం కోసం ఇచ్చినవి. అంతే గాకుండా ఒకే వుదాహరణలో పలు రచనా విన్యాసాలుండొచ్చు. అంటే ఒక రచనా విన్యాసానికి పలు వుదాహరణాలు, ఒక వుదాహరణలో పలురచనా విన్యాసాలు వుంటుంటాయి. దాన్ని కూడా కొన్ని వుదాహరణల ద్వారా పరిశీలిద్దాం.

> 105 రక్తం మసిలితే ఆగదు
> రాత్రించరులను కాల్చేస్తుంది
> ఊపిరి విసిగితే ఆగదు
> ఉర్విని ఊదేస్తుంది,

కర్త, (రక్తం, ఊపిరి), కర్మ (రాత్రించరులు, ఉర్వి), క్రియ (కాల్చేస్తుంది, ఊదేస్తుంది) అన్న వాక్య నిర్మాణం భాషకి అనుగుణంగా వుంది.

> 106 తిరగబడుతున్నాయి
> నగరం పొత్తికడుపులో పేగులు
> బీటలు పారుతున్నాయి
> కొవ్వు పెంచుకొన్న గోడలు

కర్త (పేగులు, గోడలు) క్రియ తిరుగబడుతున్నాయి,

ఈ వ్యాకరణ ప్రకారం 'గోడలు' 'గొప్పవెంపుకొన్న' విశేషణాన్ని కల్గివుంది- 'నగరం పై ___ ' పద ప్రయోగం వల్ల రూపకాలంకారం అవుతూంది. వాక్యనిర్మాణంలో 'కర్త కర్మ క్రియ' క్రమానికి క్షతి కల్గుతూంది. మొదటి కవితలో వాక్యనిర్మాణం వల్లగాక, సంఘానికి ప్రతీకల్ని వాడటం వల్ల రచనా విన్యాసం తెలుస్తూంది. 'రక్తం', 'ఊపిరి' కేవలం అమూర్తపదాలుగా గాక, చైతన్యవంత సంఘానికి ప్రతీకలుగా కవి నిర్దేశిస్తున్నారు. ఇది 'భావచిత్రణ' విన్యాసం కూడా. ఆదిప్రాస వల్లా చేసి పాదాల్లో వుండే 'అనుప్రాస' వల్లా—ఈ కవితలో ధ్వనికి పదానికి, వాక్య నిర్మాణానికీ సంబంధించిన రచనా వైలక్షణ్యాలని గుర్తిస్తున్నాం.

కవితలో మధ్య మధ్య పాత్ర కనబడుతూ వుండడం, మాట్లాడుతూ వుండడం 'పసులపోశి'లో కనబడుతూంది.

[197]"ఎపుడో స్తిరి బాంచెను?
గుప్పెడు కర్పూరపు బిళ్లలు
గుండెలో వెలిగించుకొని
కుశల ప్రశ్నలడిగింది
పసుల పోశి"

[197]గులామోల గుడిసెలకు
గొప్పింటోళ్లు రావద్దు
అంటరానోళ్ల నీడను
మీ అసొంటోల్లు తాకద్దు"

'పసుల పోశి' పాత్రతో బాటు అపభాషా (slang) పదాలు కనబడడం ఇచట విశేషం. కవి తన చిన్నతనంలో తనకు ఆత్మీయురాలైన ఒకానొక పేదరాలుని గురించి చెప్పడం, కవి ఉద్దేశం. ఆమె పేదదనీ, తెలంగాణా ప్రాంతపు దనీ కవి వాచ్యం చేసినట్టు కన్పడడం లేదు. కాని పాత్రని పరిచయం చేసే తీరులో—'ఎపుడో స్తిరి బాంచెను'—అర్థం అవుతూంది. నైజాం పరిపాలనల్లో

మాటకు ముందు "బాంచెను, నీకాల్మొక్త" అన్న పదాలు తరచుగా వినబడుతు వుండేట్టు తెలుస్తూంది. అలాంటి నైజాం పరిపాలనలో వున్న పేదరాలు ఆ 'పసుల పోశి'. అది ఆనాటి వాతావరణం. ఆ వాతావరణానికి తగ్గట్టు పాత్రని కూడా చిత్రించారు. ఆమె పేదది. దాంతో బాటు నిరక్షరకుక్షి. ఆ విషయం కూడా వాచ్యం చెయ్యబడలేదు. 'గులామోల' అని మాత్రం అన్నాడు. ఆ పదం వల్ల మిగతా అర్థాన్ని కవి నిర్దేశించాడు.

[197]సిన్న బాపూ ఇటు చూడు
సింతకాయ తొక్కు రుసిజూడు
అంబలితో కొద్ది కొద్దిగ
అందుకుంటె ఉంటది ముద్దుగ

చ (శ్వాసం, అల్పప్రాణం, తాలవ్య స్పర్శము) కి బదులుగా స (ఊష్మం) ని వాడడం—చిన్న సిన్న, రుచి—రుసి. ఇక్కడి ప్రత్యేకత. కథనం దృష్ట్యా చూసినపుడు ఇలాంటి ధ్వనుల మార్పు అవసరం; స్పష్టం కాకపోవచ్చు. కాని ఆలా మార్చిందాని వల్ల మనకు కనబడేది 'పసుల పోశి'. అపభాషా రూపాల్ని పలికేది 'పసులపోశి' కవికాదు. ఇంకా ఈ కవితలో యతి అనుప్రాస-1-2, 3-4 పాదాల్కి -కనబడుతుంది. ఇలాంటివి స్వతస్సిద్ధంగా వుంటే శ్రావ్యంగా వుంటాయి. శ్రావ్యత లేకపోతే ఎంతటి అర్థవంతమైనా వెంటనే రసానందం కలుగదు. "అందుకుంటే ముద్దుగ వుంటది" అని క్రియకు ముందు క్రియా విశేషణాన్ని వాడి వుంటే, శ్రావ్యతని సాధించి వుండొచ్చు. అయితే, 'అనుప్రాస' కే ప్రాధాన్యమిచ్చాడు కాని, శ్రావ్యతకు కాదనిపిస్తూంది.

[198]పేర్వారం జగన్నాథం, 'చేతనావర్తం' సంకలనంలో పదహారు వచన కవితల్ని రాశాడు. వాటి ఎత్తుగడ "స్వామీ" తో ప్రారంభం అవుతుంది. ఏ కవీ ఇంతవరకు "స్వామీ" లేక మరి అలాంటిదేదైనా నియతంగా ఎత్తు గడలో కాని, చివరన కాని వాడినట్టు కానరాదు. ఇది జగన్నాథం రచనా విన్యాసంలో ప్రత్యేకం. కేవలం వైయక్తికం. "శ్రీ" తో ఆరంభించి "మంగళ మహాశ్రీ" వృత్తంతో ముగించడం ప్రాచీన సాహిత్యంలో తఱచుగా కనబడుతూ వుంటుంది. అది కావ్యాలకి సార్వజనీనం అయిపోయింది. ఆధునిక కాలంలో

ఇలాంటివి కనబడవు. అందుకని అది అతని ప్రత్యేక గుణం అయింది. వాక్య నిర్మాణం కన్నా మరేదో గుణం కవిత్వసొబగును చూపిస్తే దాన్ని కూడా రచనా విన్యాసంగా గుర్తించాలనుకొన్నాం. కనుక ఇది ఆ విభజన కిందికి వస్తుంది. "స్వామీ" ఒక గేయంలో "స్వామ్ ఈ" అయిపోతుంది. "వర్ణమాల" ని సవరించాలనే వూహ వచ్చినా కవి వూహ అదికాదు,

'స్వామ్ ఈ
అయాం సారీ
స్పెల్లింగ్ పాడైపోయిందనుకోకు
డోన్ట్ వర్రీ
'సిన్ అయ్య చచ్చిపోయాడెన్నడో'

ఈ గేయం పూర్తిగా suggestive భావాలకి సంబంధించింది. వ్యాఖ్యాలు బట్వాడా చేసే అర్థాన్ని యథాతథంగా తీసుకోలేం. అర్థవివరణాత్మం (Semantics) ని మూడురకాలుగా గుర్తించొచ్చు. చెట్టు, పక్షి, మనిషి మొదలైన సహజ రూపాలు, వాటి సహజ అర్థాలు—వాటిని గురించి చెప్పడం మొదటిది. కొన్ని కొన్ని పదాలకి కొన్ని కొన్ని అర్థాలు ప్రత్యేకంగా వుంటాయి. ఇవి వాడుకొనే code వల్ల అర్థం అవుతుంది. ఇది రెండోది. మూడోది అభివ్యక్తీకరణం. అంటే ఉన్నది ఉన్నట్టు గాక వేరొక అర్థం స్ఫురింపజేసేది. ఇది కవితకి ముఖ్యమైంది. వాక్య నిర్మాణాది జ్ఞానం వల్ల అవగతం అయ్యే భావం వేరు కవి నిర్దేశించిన భావం వేరు. దీన్ని మన లాక్షణికులు "నిర్దేశించిన "వ్యంగ్యార్థం"గా తీసుకోవచ్చు. అలాంటి వ్యంగ్యార్థాన్ని సాధించడం కోసం కవి మొదటే "స్వామ్ ఈ" అని వాడాడు. ఈ పదం ఎత్తుగడలో వుండటం వల్ల కవిత కూడా వ్యంగ్యార్థం లోనే వుందన్న భావం అర్థం అవుతుంది. దిగంబరకవుల్ని విమర్శించడం కవితలోని విషయం. అయితే వాచ్యం చెయ్యలేదు. దిగంబరకవులు, ప్రాచీన కవులు, భావ అభ్యుదయ కవుల విషయంలో చేసిన విమర్శననే తాను కూడా చేశాడు.

"వెఱ్ఱివెంగళయ్యా మానేష్టం
గొఱ్ఱెదాటుడింక మా నేష్టం" అన్నవి కవిభావాన్ని

స్పష్టంగా చూపిస్తున్నాయి. 'వెఱ్ఱి వెంగళయ్య' 'గొప్పదాటుడు' లాంటి నుడి కారాలవల్ల కవి ఈసడింపు అర్థం అవుతూంది. కనుక నుడికారాలు, ఎత్తుగడ పేర్వారం జగన్నాథం రచనా విన్యాసంకి సంబంధించిన లక్షణాలుగా గుర్తించొచ్చు.

200'నాయనలారా
తలా ఒక చెయ్యి వెయ్యండి
చెరొక రెక్కాపుచ్చుకుని
రెండడుగులు వేయించండి
నా కళేబరాన్ని నీళ్లలోకి'—

వేగుంట మోహన ప్రసాదులో ధ్వనికి సంబంధించిన రచనా విన్యాసాలకన్నా మిగతా రెండు ప్రాముఖ్యాన్ని కల్గివుంటాయి. నారాయణరెడ్డిగారి కవితకూ, వేగుంట వారి కవితకూ, చూసీ చూడటంతోటే, రూపంలోనే భేదం కన్పడుతూ వుంటుంది. ఆత్మచైతన్యం నించి వచ్చే కవితలు ఇవి. అంటే, ఒక రకంగా సంఘం నించి పలాయనం చిత్తగించి, లోపల, లోలోపల, మనస్సుకీ, భావానికీ కల్గే పోరాటంలో భావాలు నిలబడి వుండడం చితి-చింతలో చూడగలం. భావకవుల్లో 'విరహం' ప్రధానం అయితే మోహన్ ప్రసాదు గారిలో చీకటి' 'నైరాశ్యం' అ స్థానాన్ని పొందుతూంది. రకరకాల విరహాలు అక్కడ. చీకట్లు ఇక్కడ. ఊహాప్రేయసిని వెతుక్కొంటూ బయలుదేరడం అక్కడ. ఊహ ఆత్మకై వెతుకులాట ఇక్కడ కన్పడుతూంది. కవితలో ఎక్కువ నుడికారాల ప్రయోగం భావచిత్రణల పొడిగింపు కన్పడుతూంది పై పాదాల్లో వున్న "చెయ్యి వెయ్యండి" "రెండడుగులు వేయించండి" లాంటి నుడికారాల్తో పాటు అందరికీ సుపరిచితమైన "నాయనలారా" అన్న సంబోధన కూడా అతని రచనా విన్యాసం లోని భాగంగానే గుర్తించ వీలవుతూంది. "ఇస్కూలు" "గురూ" లాంటి అపభాషా పదాల్తో బాటు "గుర్గుర్వు" (ఈశ్వరుడు) అన్న కొత్త పదనిర్మాణం కూడా కన్పడుతుంది.

రాత్రిని తడుతూ, నిద్రని గిచ్చుతూ
ఉషఃఖడ్గాలతో నన్ను చీల్చడానికి

నిలూనా కొయ్యడానికి
కత్తుల్తో నేలను గుచ్చడానికి
వస్తారో రారో. —32

"రాత్రిని తట్టడం, నిద్రని గుచ్చడం ఉషఃఖడ్గాలతో చీల్చడం, కత్తుల్తో నేలను గుచ్చడం" అపూర్వ భావాలు కన్పడుతున్నాయి. ఇవి అన్నీ చోమ్స్కీ చెప్పిన వక్ర నిర్మాణం (deviant structure) కి వుదాహరణాలు. అయినా నూతన భావం స్ఫురిస్తుంది. భావచిత్రణ కనులకు కట్టుతూంది.

గాలీ వచ్చింది
వానా వచ్చింది
మంచు పట్టింది
తన కొంగంతా చెట్లముఖాలమీద కప్పింది
ఊపిరాడక కొమ్మలూ రెమ్మలూ తోసేస్తోన్నయ్
ఎండా వచ్చింది
నీడా వచ్చింది
రూపూ పడింది
వేడిగా నా బొమ్మ నేల మీదకాలింది —30

'రాత్రి, వుదయం, మధ్యాహ్నం', వర్ణన ఈ పాదాల్లోని విషయం ఇలాంటి భావచిత్రణలు సాహిత్యంలో వున్నా, మోహనప్రసాదుగారికే 'పరిమితం'గా కూడా తీసుకోవీలవుతుంది. "మంచుపట్టడం" రాత్రి తన కొంగును చెట్లముఖాలమీద కప్పిందట. ఇక్కడ 'కొంగు' చీకటి, ఎండా, నీడా, రూపు—సూర్యోదయానికి లక్షణాలు. ప్రభాత సమయంలో, మసక మసకగా వుంటుంది. సూర్యుడు ఉదయిస్తుండగా కిరణాలు భూమిపై పడతాయి అదే ఎండ. ఎండ పడగానే మసక మసక నించి నీడలు కన్పడుతుంటాయి. ఆ ఎండ కొంచెం ఎక్కువయితే 'నీడ' 'రూపు'గా రూపుదిద్దుకోంటుంది. "బొమ్మ నేల మీద కాలడం" మధ్యాహ్నంకి సరికొత్త భావచిత్రణ.

ఇంకా గంటల కారు (Fire Engine), ఊదామంటలు (Altrosonic rays), గాజుకడ్డీ (Thermometre), తెల్లపిండి (Toilet Powder), దూరపు

బొమ్మలు డే యంత్రం (Television), ఊపిరికందని (Syntactical breathlessness )లాంటి అనువాద రూపాల్తో బాటు 'పర్సన్నలీశ్వరుడు, రికామిగాలి నిమోనియా కవి, వయోలిన్‌కత్తి, మాంటిల్ నాలుక, డెస్పరేటశక్తి లాంటి సమాసాలు కూడా ప్రసాదుగారి కవిత్వంలో వున్నాయి. పఠాభి, అరుద్రలకి తర్వాత ఆంగ్ల పదాల్ని విరివిగా వాడుకొన్నకవీ, 'మానవతా మాగాణీ'ని సునంపన్నం చేసిన కవీ మోహన ప్రసాదు.

ప్రబంధకవుల్లో అంగాంగ వర్ణనకున్న ప్రాధాన్యం తెలియంది కాదు. భావకవుల రాకతో ఆ అంగాంగ వర్ణన అంతసౌందర్య వర్ణన అయింది. అది తిరిగీ ప్రబంధకవుల జాడల్లో నడిచిందా అన్న సందేహం వస్తూంది. మోహన్‌ప్రసాదుగారు ఖజూరాహో శిల్పసుందరత్వాన్ని దృష్టిలో పెట్టుకొని "వెన్న తిప్పుతున్న ముసలమ్మ కోడలి గుండ్రని ఖజూరాహో భుజాల్లా" అంటారు.మరోసారి

"జాకెట్ జరీలో మామిడిపిండెలు
తళుక్కు లీనుతుంటై" అంటాడు.

వయసుకి వచ్చీరాని వాళ్ళని గురించి వర్ణించాల్సి వచ్చినపుడు, స్తనాల్ని మాత్రమే తీసుకొని అవసరం తీర్చుకోవడం సరికొత్త ఏంకాదు. శ్రీనాథుడు వుపయోగించిన "ఉసిరిక కాయలు" బహుశా ఇక్కడ 'మామిడిపిండెలు 'అయినా యేమో. ఇలాంటి వర్ణనలతో పాటు'కలలతుంటరి' 'కన్నీటి జారిణుజలు 'పూవిల్లు'జుట్టు'లాంటి కొత్త వుపమలతో పాటు "కిర్మీరం, రసమాయాశ్వం' లాంటినిఘంటువుల్లో తలదాచుకొన్న పదాల్ని కూడా అక్కడ చూడగలం.

పశ్చిమాద్రిని వున్న సూర్యుణ్ణి 'కమలాకాయ'గా భావించడంలో 'భావ చిత్రణ' హృదయానికి సంబంధించిందే కాని మనసుకి సంబంధించింది కాదన్న విషయం బోధపడుతూంది. "అబగా లాక్కోవడం, అరిందాలాగ మాట్లాడడం, ఆలాగ్గా అన్న లోకవ్యవహారాలు ఆతని రచనకి స్ఫోరకత్వాన్ని కల్గిస్తున్నాయి. ప్రబంధకవుల ఏడ్పుని "ఊపిరికందని వాక్యవిన్యాసంతో, లయలో ఏడుస్తో........"అని చమత్కరిస్తారు.

మాటిమాటికీ
బ్రతుకు దుఃఖాలకి ఆడపిల్లలా కన్నీళ్ళు నింపుకొనే నగ్ననేత్రం

పీకిపోయి
నీళ్ళొడి
చివరికి అక్కడొక్క బోటే జ్ఞానదీపం వేడిగా కాలుంది. -15

పై పాదాల్లో కవి చెప్పదల్చుకొంది జీవాత్మకి పరమాత్మకి వున్న సంబంధం. జీవాత్మని 'నగ్ననేత్రం' అనీ, పరమాత్మని 'జ్ఞానదీపం' అనీ అన్నారు. పాత వూహల్ని పట్టించికోవడమో,పరాస్తం చేయడమో తా చేయబోయేది లేదు. కనుక దానికి సంబంధించిన పదాలకి కూడా రూపాంతరాల్ని కల్పించారు. నగ్న నేత్రాన్ని ఆడపిల్లల కన్నీళ్ళతో ఉపమించాడు. ఆడపిల్లల కన్నీళ్ళలాగా నగ్ననేత్రానికి వున్న అస్థిరత్వాన్ని చూపిస్తున్నారు. ఇలా చెప్పడంలో నగ్న నేత్రం లేక జీవాత్మ అస్థిరమైంది. అన్నవిషయం అర్థంఅవుతుంది. ఆవిషయాన్ని చెప్పడం కోసం'మాటకు ముందు ఏడ్చే ఆడది' అన్న లోకవ్యవహారాన్ని తీసుకో వడం కవిచేసిన రచనా విన్యాసం. ఉపమానం ఉపమేయం రెండూ పరిచితం అయినవే. హృదయానికి సంబంధించినవే. వాస్తవాన్ని నిల్పుకొన్నవే. అందుకనే భావచిత్రణ అయింది. ఇలాంటిదే మరో భావచిత్రణ. వర్షానికి సంబంధించింది·

'పైనెవరో చెరిగే నీటిజల్లు మనల్ని వ ంసా రా తడపదు' పృ. 40

తిలక్ గారిలో లాగే ప్రసాదు గారిలోకూడా వ్యాకరణ శబ్దాలు రచనా విన్యాసాన్ని చూపిస్తున్నాయి.

ఖంగుఖంగుమని దగ్గుతోన్న ఇనుపప్రహాతలో
జుట్టు పైకెగదువ్వుకొని పోతోన్న రైలుబండి -41

ఇచ్చట రైలుబండి పదం కన్నా ఖంగుఖంగు మంటున్న శబ్దాలవల్ల కవి సాధించ దలచుకొన్న భావం స్పష్టం అవుతూంది.

తిలక్ భావకవి. అభ్యుదయకవి. అన్నిటికన్నా ముఖ్యమైంది అతను 'వచనకవితా' కవి. అతనిలో వున్న కొన్ని రచనా విన్యాసాల్ని చూడడం ప్రస్తుతవిషయం.

203 ఘోష
హేష

మురళి
రవళి
కదలి
ఘణం ఘణల నిక్వణ క్వణల ఝణం ఝణం ల
బండి మువ్వ
కాలిగజ్జె
కలసిపోయి —91

గుఱ్ఱాలు కట్టబడ్డ రథం. రధచక్రాల తిరుగలి వల్ల శబ్దం. గుఱ్ఱాల సకిలింపులు—ఇవి మురళి రవళిలాగా మనోహరంగా శ్రావ్యంగా వినబడుతున్నాయి. బండి ఇరుసునుంచి చక్రం విడిపోకుండా కట్టివున్న (కడచీల) బండిమువ్వకల్గించే శబ్దం సంగీతాత్మకంగా, లయబద్ధంగా ఝణం ఝణలతో వినసొంపుగా వుంది. పై శబ్దాల శ్రావ్యానికి ఇంపుసొంపులకు ముగ్ధుడై, అంకితం (లీనం) అయిపోయిన అతనూ, అతని కాలిగజ్జె ఒకటయిపొయ్యాయి. అంటే ఆనంద భరితుడై వాటితో కూడా నాట్యం చేశాడని అర్థం చేసుకోవచ్చు. ఇంతటి అపురూపచిత్రణ కేవలం ధ్వన్యనుకరణ శబ్దాల వల్ల అవగతం అవుతుంది. ధ్వన్యనుకరణ శబ్దానికి కవిత్వంలో చోటు అవసరమా? అని తల బద్దలు కొట్టుకొన్నారు. కాని చివరకి కల్పించాల్సిందే అన్న అభిప్రాయం వెలిబుచ్చారు విమర్శకులు[203]. పై కవితలో, 'భావచిత్రణ' కూడా చాలా వుదాత్తంగా వుంది. కవికి ప్రకృతిగత వాతావరణంపై గల మక్కువని చూపిస్తోంది. ప్రకృతిని యథాతథంగా తీసుకోవడం గాక, ప్రకృతికి తనకి సంబంధం కల్పించుకోవడంలో తాను, చేయబోయే కార్యానికి కారణం పోల్చి చేయడంలో ఈ భావచిత్రణ కన్పడుతుంది. ఈ కవితలోని పదాలన్నీ పాత కవిత్వానికి సంబంధించినవి, 'తిలక్'ని[204] కాల్పనిక అభ్యుదయ కవిగా కొందరు కీర్తించడానికి ఇలాంటి భావచిత్రణలే వుపయోగపడి వుండొచ్చు.

"అంత్యప్రాసలు వేసినంత మాత్రాన ప్రొసైక్ భావం పొయెట్రీఅవదు
కవిత్వం ఒక అల్కెమీ, దాని రహస్యం కవికే తెలుసు" —78

చాలామంది అనుకొంటున్నట్టు కేవలం అంత్యప్రాసలు మాత్రమే వచనాన్ని కవిత్వం చేయలేవు. అవి కేవలం బయటివి మాత్రమే. ఈ కవితలో అన్య

భాషా పదాలు వున్నాయి. అన్యభాషాపదాలు వాడినంత మాత్రాన రచనా, విన్యాసం కాదు. అది భావస్ఫోరకత్వానికి ప్రయోగపడ్డప్పుడే అవుతుంది పొలిసైక్—పొయెట్రీ వున్నాయి. వచనం—కవిత్వం అని గాకుండా ఇంగ్ల పదాల్ని వాడటం వల్ల కవి ఇక్కడ సాధించిన ప్రత్యేకత ఏమీ లేదు. ఒక విసురు తప్ప. అయితే "అల్కెమీ"లో కవి నిర్దేశించిన భావం కన్పడుతుంది పరుసవేది విద్య' అని కూడా అనొచ్చు. కాని ఒక భావాన్ని చెప్పేందుకు వీలవుతూన్న అనేక దారుల్లో శ్రావ్యంగా పరిస్థితికి అనుగుణంగా వాడు కోవడంలోనే కవి ప్రతిభ వ్యక్తమవుతుంది. "కవిత్వం" అన్నపుడు (మూడు అచ్చులు) 'అల్కెమీ' వాడితేనే చెవికింపుగా వుంటుంది. అంటే శ్రావ్యతని అందించగలడు. అదీగాక 'పరుసవేది' పాతది. అన్నిటినీ జడంగా తయారు చేసేది. అల్కెమీ మనకు కొత్తది. చైతన్యాన్ని పుణికి పుచ్చుకొని వుంది కవి చెప్పే భావాలు ఆధునిక భావాలకి సంబంధించినవి. అందుకే ఆధునిక పదం 'అల్కెమీ' వాడారు. అన్య భాషాపదం....ఈ కవితలోని రచనా విన్యాసం.

ఇంతవరకు వచన కవితకి సంబంధించిన విశేషాల్ని గురించి తెల్సు కొన్నాం. అక్షర రమ్యత వల్ల, పదాలకి సంబంధించిన రూపం, అర్థం వాటి వ్యాపారం వల్ల, వాక్యానికి సంబంధించిన నిర్మాణ విశేషం వల్ల కవితలో కల్గే మార్పుల్ని గుర్తించాం. తద్వారా కల్గే భావస్ఫోరకత్వం, శ్రావ్యత్వంతో బాటు మరెన్నో ప్రత్యేకతల్ని చూశాం. ఇవి అన్నీ వచనం నించి కవితని వేరుచేసి చూపిస్తున్నాయని తెల్సుకొన్నాం. కనుక వేకూరి రామారావు అన్నట్లు వచనకవిత వచనం కాదు, కవిత్వం అవుతూంది.

# భావకవిత్వం

1. The Verse Satire P. 62
2. Solitary Reaper, Daffodills లాంటివి
3. Ancient Mariner లాంటివి
4. బైరానిజం—కట్టు బొట్టూ దోవతి కట్టూ ఎలా వుండాలో చెప్పేది.
5. "విరసం—తెలుగు సాహిత్యంలో అరుణ పతాకం"—
జ్వాలాముఖి, వేకువ త్రైమాసిక. అక్టోబరు-డిసెంబరు, 1971 పు. 56
6. తె. క. వి. స్వ. .... .... పు. 117
7. అ. అ. క. .... .... పు. 323
8. శ్రీ శ్రీ సాహిత్యం : ఒకటి (కావ్యవచన విభాగాలు) పు. 11
9. Lyrical Ballads : Preface
10. తె. క. వి. స్వ .... .... పు. 119
11. ఆం. సా. చ .... .... పు. 327
12. Lyrical Ballads Preface ని చూస్తే ఆ విషయం అర్థం అవుతుంది.
13. "....కోలరిడ్జి పురాతన గాథలను తరచి తరచి నూతన వాతావరణంలో ఆ దృశ్యాలను చిత్రించాడు. ఆశ్చర్య జనకమైన పురాణ గాథలను పునరుద్ధరించుట రొమాంటిసిజం లక్షణాలలో ఒకటి. ఈ కవితా ధోరణికి ప్రతినిధి కోలరిడ్జి.
ఆం. సా. చ .... ... పు. 336
14. "షెల్లీ కవితా హృదయాన్ని ప్రేమతత్వం ఆర్ద్రపరిచింది. ఈ ప్రేమతత్వం మానవులకే పరిమితం అవకుండా జీవ కోటి కంతటికీ పరివ్యాప్తమయింది"
ఆం. సా. చ. .... .... పు. 348-349
15. "....సౌందర్యమే సత్యం. సత్యమే సౌందర్యం అని తెలుసు కొంటే చాలునని ఉద్ఘాటించాడు. ప్రపంచంలో మిగిలి

పోయిన సౌందర్యాన్ని పరిగపంటగా పొందడమే ఇతని లక్ష్యం.
ఆం. సా. చ .... .... పు. 353

16. ఆం. సా. చ .... .... పు. 343
17. Lectures and Notes: 598. Coleridges Theory of Poetry లో వుదాహరించిన ప్రకారం పు. 165
18. తె. క. వి. స్వ .... .... పు. 136
19. Coleridge's theory of Poetry పు. 206
20. అం. సా. చ .... .... పు. 344
21. తె. క. వి. స్వ .... .... పు. 130
22. ఆ. ఆం. క .... .... పు. 219-220
23. Literary Criticism-A Short History. పు. 347-348
24. Ibid. P. 350
25. Refer: 19 P. 213
26. Refer : 23 P- 360
27. ఆ. ఆం. క .... .... పు. 260
28. —పైదే— లో వుదాహరించబడ్డది పు. 284
29. Lyrical Ballads — — P. 8
30. Coleridge's theory of Poetry — — P. 207
31. Literary Criticism - A Short History — P. 403
32. తె. క. వి. స్వ. పు. 136

# అభ్యుదయ కవిత్వం

1. ఆ. అం. క పు. 586
2. అభ్యుదయకవిత్వం అనే పేరు అభ్యుదయ రచయితల సంఘంతోబాటు ప్రచారంలోకి వచ్చింది. తె. క-వి. స్వ పు. 278
2. ఆ. ఆం. క పు. 585
3. ఆ. అం. క పు. 586

4. కె. క. వి. స్వ ఫు. 176
5. అర్ధశతాబ్దికాలంలో ఆంధ్రులపైని అక్టోబరు విప్లవ ప్రభావం-
కంభంపాటి సత్యనారాయణ పు. 49, 54
6. నోరా—ప్రేం చంద్
7 దిగవల్లి శివరావు —చూ-5 పు. 50
8. కృష్ణ పక్షము—దేవులపల్లి కృష్ణశాస్త్రి
9. రుధిర జ్యోతి—నారాయణబాబు
10. విరసం మహాసభలు—ఒక సమీక్ష 'నిప్పుపూవు'
కళాకేళి, ఏప్రిల్. 1971
11. ఆ. అం. క. పు. 585
12. నేటి తెనుగు కొత్త పోకడలు—సారస్వత వ్యాసములు
ప్ర. సం. పు. 391, 397
13. మహాప్రస్థానం పు. 19
14. ,, పు 26
15. ,, పు. 33
16. ,, పు. 37
17. పాతిక ముప్పయి ఏళ్ళక్రితం అభ్యుదయ సాహిత్యం బయలు దేరిన మొదటి రోజుల్లో .... నిజానికి ఆనాడు భారీ పరిశ్రమలు లేవు, కార్మికులూ, లేరు. పట్టణాలే అభివృద్ధికాలేదు.
ఎస్. వి. జోగారావు, సృజన, డిసెంబరు 1972 పు. 41
18. మార్క్సిజం అంటే ఏమిటి?—ఎమిలీ బరన్సు పు 8
19. మహాప్రస్థానం పు. 73
20. పు. 87
21. ఖడ్గసృష్టి—శ్రీ శ్రీ పు. 56
22. ఉత్తర రామచరిత్రము—భవభూతి
23 Cubo-futurism-Princeton Encyclopedia పు. 175
24. నేటి తెనుగు కొత్తపోకడలు—శ్రీశ్రీ. చూ. 13
25. ఖడ్గసృష్టి పు. 53

26. శ్రీశ్రీ సాహిత్యం—రెండు (కావ్యవిభాగం) పు. ఠ67-168
27. రుధిరజ్యోతి—నారాయణబాబు పు. 32
28. ,, ,, పు. 15
29. ప్రస్తావన—రోణంకి అప్పలస్వామి
30. ,, ,, పు. 113, 115, 79
31. ,, ,, పు. 11
32. కృష్ణపక్షము—దేవులపల్లి కృష్ణశాస్త్రి పు. 105, 28, 42
33. రుధిరజ్యోతి— పు. 13
34. Futurism-Prineeton Encyclopedia
35. రుధిరజ్యోతి పు. 62, 83, 100
36. తె. క. వి. స్వ పు. 180
37. Thirty four years ago-T. Pattabhi Rama Reddy
ఫిడేలు రాగాల డజన్ పు. vii
38. ఫిడేలు రాగాల డజన్—పఠాభి పు. 8
39. పకపకలు వెకవెకలు —రమణారెడ్డి -ఫైదే- పు. 28
40. ఫిడేలు రాగాల డజన్ — పు. 11-12, 15
41. ....పఠాభిపై ఫ్రాయిడ్ ప్రతిపాదించిన 'సెక్సు' బలవత్తర
మైన ప్రభావము వేసినది ఆ. ఆం. క. పు. 522
42. ఫిడేలు రాగాల డజన్ పు. 30 31
43. చూడుము : వీరతెలంగాణా, నా అనుభవాలు—జ్ఞాపకాలు........రావి
నారాయణరెడ్డి.
44. తెలంగాణా సాయుధపోరాటం తెలుగు సాహిత్యంలో మాత్రం సత్ఫలితా
లనే ఇచ్చింది ఈ ఉద్యమంలో ప్రగతి శక్తుల పాత్రను కూడా ప్రజలు
మరచి పోలేదు. అందుకనే వాళ్ళను 1952లో జరిగిన ఎన్నికలలో
ఘనంగా గెలిపించారు. ఈ గెలుపు ఒక పెద్ద మలుపు.
ఆరుద్ర—స్వాతంత్ర్యయుగోదయంలో తెలుగు కవిత,
మహతి .... పు. 300
45. ,, ,, ,,
46. అగ్నిధార—దాశరథి పు. 18

